సంపుటి : 30 | సంచిక :2
మార్చి : 2007 | 350వ సంచిక

నవ్య నవలా వేదిక

# చతుర



ఈ నెల నవల

ఆదర్శం, మంచితనం
మూర్తీభవించిన
ఓ ఉపాధ్యాయుడి
జీవిత చిత్రం

తులసి బాలకృష్ణ నవల

## సరస్వతీ నమస్తుభ్యం

10వ పేజీలో



బొమ్మలు: భాస్కర్

హెల్త్ బిట్స్: ఎం. వెంకటేశ్వరరావు

# తండ్రీ కొడుకులు

## తెర తీయగ రాదా!

ఇంగ్లీష్ నవలలు బలిసిన వస్తాదుల్లా ఉంటే మనవి ఎముకల పోగుల్లా ఉంటాయి. రాత ప్రతి వంద పేజీలకు మించితే నవలగా పరిగణిస్తామంటారు కొందరు పత్రికా సంపాదకులు. బెర్నార్డ్ షా పేరు మీరు వినే ఉంటారు. ఆయన సమగ్ర రచనలతో ఒక అల్మారా నిండుతుంది. జాన్ గాల్స్‌వర్దీ, హెచ్.జి.వెల్స్, రుడ్యార్డ్ కిప్లింగ్ కూడా యథాశక్తి బుక్ షెల్ఫ్‌లను నింపిన వాళ్లే. వీరి సరసన ఉండదగిన వాళ్లే రాబర్ట్ లూయీ స్టీవెన్ సన్ (కాంచన ద్వీపం) డిటెక్టివ్, హార్రర్ నవలల రచయిత్రి రాబర్ట్ రైన్‌హార్ట్, జేన్ గ్రే (క్యాటిల్ రాంచర్స్ గురించి రాసిన అమెరికన్ రచయిత). అయితే వీళ్లందరూ కలిసి రాసినదాని కన్న రెట్టింపు రాశాడు అలెగ్జాండర్ డ్యూమా (1802-1870). 'త్రీ మస్కటీర్స్' (1844), 'కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో'(1845) చదివారా? ఆయనే ఈ మహానుభావుడు. ఈయన సమగ్ర రచనలు పన్నెండువందల సంపుటాలు నిండుతాయి. వందకు పైగా నాటకాలు, చారిత్రిక గాథలు, నవలలు, కథలు రాసిన డ్యూమాకు కలం కింద పెట్టే తీరిక గూడా ఉండగూడదు మరి. ఆ రోజుల్లో పక్షి ఈకల్ని యింకులో ముంచి రాసేవారు. అవును, డ్యూమా మద్య పానప్రియుడు కాదు. విందు వినోదాలతో కాలక్షేపం చెయ్యలేదు.



ప్యారిస్ నగరానికి ప్రపంచ శృంగార రాజధానిగా పేరుంది. ఎవరు ఎవరితో తిరిగినా అక్కడెవరూ పట్టించుకోరు. అలాంటి ప్యారిస్‌లో డ్యూమా స్త్రీ వ్యసనాన్ని చూసి రసికులు కూడా ముక్కుమీద వేలేసుకున్నారు. అతడి కొడుకు డ్యూమా జూనియర్ కూడా ప్రముఖ ఫ్రెంచి రచయితే. తండ్రి తీరు భరించలేక ఇంట్లోంచి వెళ్లిపోయాడు. పుస్తకాలతో పోటీ పడినట్టుగా, తన సంతానం కనీసం అయిదు వందలని చెప్పుకున్నాడు మన రచయిత.

డ్యూమా అందగాడేమీ కాదు. పిడచ ముక్కు. దళసరి పెదవులు. బానపొట్ట, పెళ్లి 'బంధం'లో చిక్కుకోవటం అసలు ఇష్టం లేదు. కాని, అప్పులు తీర్చలేని వాళ్లను జైలుకు పంపించటం అప్పటి రివాజు. ఆ శిక్ష నుండి తప్పించుకోవటానికి గత్యంతరం లేక, ఓ ధనికురాల్ని భార్యగా అంగీకరించక తప్పలేదు.

డ్యూమా అనేది ఫ్రెంచి పేరు కాదు. అతడి నాయనమ్మ మాలీ డ్యూమా వెస్టిండీస్‌లోని చెరకు తోటల్లో పనిచేసిన ఒక నీగ్రో బానిస. తన మనవడు ఇంత గొప్పవాడై రాజులు, రారాజులతో సన్మానాలందుకుంటాడని కలగని ఉండదు. అలెగ్జాండర్‌కు ఆమె పోలికలు వచ్చాయి. చర్మం రంగు తెలుపైనా, ఉంగరాలు తిరిగిన జుత్తు అతడి వారసత్వానికి సాక్ష్యంగా నిలిచింది.

సృజనాత్మకతలోనే కాదు. టేబుల్ చుట్టూ ఓ పదిమంది కూర్చుంటే భోజనంలో కూడా డ్యూమాతో పోటీ పడలేరెవ్వరూ. అందరూ కలిసి తిన్నంత, ఒక్కడే లాగించేసేవాడు. అయినా ఇంతటి భోజనప్రియుడూ, నిద్రాహా

రాలు మాని, రోజుల తరబడి ఏకబిగిన రాసిన సందర్భాలనేకం.

ప్రతి రచయితకూ కొన్ని అలవాట్లుంటాయి. అలవాటు ముదిరితే పిచ్చవుతుంది. నవలల్ని నీలి రంగు కాగితాల మీదా, కవిత్వం పసుపు రంగు కాగితాల మీద మాత్రమే రాశాడు డ్యూమా.

సమకాలీన పాఠకులు బ్రహ్మరథం పట్టిన ఈ రచయిత అయిదు మిలియన్ డాలర్లకు పైగా ఆర్జించాడు. ఈనాడు దాని విలువ కొన్ని వందల రెట్లు ఎక్కువ. స్వంతంగా ఒక కోటలాంటి భవంతి కట్టించుకుని మౌంట్ క్రిస్టో అని పేరు పెట్టుకున్నాడు. అయినా, అతడెప్పుడూ శుభ్రమైన, మంచి డ్రెస్సు వేసుకోవడం చూడలేదంటారు మిత్రులు. చిరిగిన, మాసిన దుస్తులే అతడి ట్రేడ్ మార్క్. ఏకకాలంలో అయిదారు నవలలు రాసేవాడు. ఈయనకెప్పుడూ ముక్కు మీదే కోపం. రచనా వ్యాసంగం సరిపోలేదని, ఇరవైసార్లు ఖడ్గాలతో, పిస్తోళ్లతో డ్యూయెల్స్ (పోటీకి ఛాలెంజి చేసిన ప్రత్యర్థితో మల్ల యుద్ధం లేదా కుస్తీ)లో కూడా పాల్గొన్నాడు.

ఎంత సంపాదించినా రచయితలు నిత్య దరిద్రులే! డ్యూమా చివరి రోజులు అత్యంత దయనీయంగా గడిచాయి. రోజువారీ అవసరాల కోసం ఉన్నవన్నీ తాకట్టు పెట్టాడు. చలిలో కప్పుకోవటానికి దుప్పటి కూడా లేక నేలమీద ముడుచుకుని పడుకునేవాడు.

డ్యూమా కొడుకు అక్రమ సంతానమే. ఈయన పేరు కూడా అలెగ్జాండర్ డ్యూమాయే. కాకపోతే పేరు చివర 'ఫిల్స్' (కొడుకు) అని రాసుకున్నాడు. గొప్ప క్రమశిక్షణతో జీవించాడు. మెలోడ్రామాలు కాక, వాస్తవిక సమస్యల గురించి రాశాడు. నైతికత మాత్రమే మనిషి జీవితానికి గీటురాయి అని విశ్వసించాడు. అతడి ప్రముఖ రచనలు 'కామిక్', 'లా ట్రావియాటా'(1852).

–స్వప్న




ప్రపంచ ప్రసిద్ధ నవలల పరిచయ వేదిక



ఆర్.డి. బ్లాక్‌మోర్
1825–1900

# లోర్నాడూన్

1869




జాన్ రిడ్‌కు పన్నెండేళ్లు. టివెర్టన్‌లోని బ్లండెల్స్ స్కూల్లో చదువుకుంటు న్నాడు. తోటిపిల్లలతో స్నేహంగానే ఉంటాడు గాని, ఎవరైనా అవమానిస్తే ప్రాణాలకు తెగించి పోట్లాడతాడు. ఒకసారి తనకన్నా పెద్దవాణ్ణి కూడా చిత్తుగా ఓడించాడు.

తండ్రిని డూన్ తెగకు చెందిన దోపిడీ దొంగల ముఠా హత్య చేసిందని తెలిసి, తమ ఎస్టేట్ ఫాం 'ప్లోవర్స్ బారోస్'కు తిరిగి వస్తాడు. ఎక్స్‌మూర్ ప్రాంతంలోని రైతులం దరూ చాలాకాలంగా ఈ దొంగల బెడదతో ప్రాణాలరచేతిలో పెట్టుకుని బతుకుతున్నారు. అక్కడి రాజు వారిని స్కాట్లండు నుండి తరి మేస్తే, సర్ ఎన్సార్ డూన్ నాయకత్వంలో ఇక్కడికి వచ్చి దోపిడీలే తమ వృత్తిగా చేసుకు న్నారు డూన్‌లు. ఎక్స్‌మూర్‌లో పర్వతాలె క్కువ. రోడ్డు సౌకర్యం లేదు. అందువల్ల రాజుగారు కూడా అక్కడ శాంతిభద్రతలను రక్షించలేడు. గుర్రాలే తప్ప గుర్రబ్బళ్లు పరిగెత్త లేవక్కడ. ఊబి నేల కావడం వల్ల ప్రయా ణంలో ఎప్పు డూ ముప్పు పొంచే ఉంటుంది. డూన్‌ల దుష్కృత్యాలకు అడ్డు లేకపోవటానికి వన్నీ కారణాలే.

తండ్రి మృతదేహాన్ని చూసిన క్షణాన్నే జాన్‌లో ప్రతీకారేచ్ఛ రగులుతుంది. గోడకున్న తుపాకీ తీసుకుని ప్రాక్టిస్ ప్రారంభిస్తాడు. ఎంతో దూరంనుండి పేల్చినా సరే, గురి తప్ప కూడదు. తన అయిదువందల ఎకరాల పొలాన్నీ, కుటుంబాన్నీ రక్షించగలిగింది తుపాకి ఒక్కటే అనుకుంటాడు.

రెండేళ్లు గడుస్తాయి. తల్లి ఆరోగ్యం పాడైంది. తల్లికిష్టమని జాన్ లోచ్ చేపలు పట్టుకురావటానికి బయల్దేరాడు. లిన్ నదిలో ఆ చేపలు దొరకలేదని, చెట్లు, కొండలగుండా ప్రవహిస్తున్న బాగ్‌వర్దీ కాలువలో ప్రయత్నిం చాడు. అది డూన్‌ల ఆక్రమిత ప్రాంతానికి పొలిమేర. బల్లెంతో చేపల్ని పొడిచి పట్టాలి. మంచు కరిగిన నీళ్లలో కాళ్లు గడ్డకట్టుకుపోతు న్నాయి. తలెత్తి చూస్తే ఎదురుగా ఎనిమిదేళ్ల

పిల్ల కనిపించింది.

"నా పేరు జాన్ రిడ్. నువ్వెవరు?" అంటూ వాకబు చేశాడు.

"లోర్నా డూన్" అని చెబుతుందా అమ్మాయి. జాన్‌ను చూసి కాస్త భయపడుతున్నట్లు కనిపిస్తుంది.

"నువ్వు నాకేమీ అపకారం చెయ్యలేదు. నేను నిన్నేమీ చెయ్యను. భయపడకు. ఇదిగో ఈ చేపలు తీసుకో. నేను మళ్లీ పట్టుకుంటాను" అంటూ చేపలన్నీ లోర్నాకిచ్చేస్తాడు జాన్.

ఆ మరుక్షణమే ఆమె కూడా అతడి ప్రాణం కాపాడుతుంది. తమ 'రాణి' కోసం అటుగా వస్తారు డూన్‌లు. వాళ్లు తిరిగి వెళ్లిపోయేదాకా జాన్‌ను ఒక గుహలో దాస్తుంది లోర్నా.

జాన్‌కు పొలం పనులతో ఒక్క నిమిషం విరామం ఉండదు. నవంబర్ నెలలో జాన్ సమీప బంధువు టాం ఫాగస్ వస్తాడు. అతడూ దారికాసి చిన్నచిన్న దోపిడీలు చేస్తాడు కానీ, పేదలకు సాయం చేస్తాడు. అందరికీ అతడంటే ఇష్టం. ఎస్టేట్‌లో ప్రవేశించగానే జాన్ సోదరి ఆనీ అతణ్ణాకర్షించింది. అశ్వికుడిగా తన నైపుణ్యాన్ని ప్రదర్శించి ఆమె మెప్పు పొందటానికి ప్రయత్నిస్తాడు టాం.

జాన్ తల్లి, అంకుల్ రూబెన్ హకాబాక్ చుట్టపుచూపుగా వచ్చినప్పుడు డూన్‌లు వాణ్ణి దోచుకుంటారు. హకాబాక్ కోపగించి, ఆ ప్రాంతపు లార్డ్ ఆఫ్ ది మేనర్‌కు ఫిర్యాదు చేస్తాడు. ఫలితం లేకపోవడంతో డూన్‌ల స్థావరం గురించి తెలుసుకుని ప్రతీకారానికి సిద్ధపడతాడు.

ఏడేళ్ల తర్వాత జాన్‌కు తిరిగి కనిపించిన లోర్నా ఇప్పుడు అద్భుత సౌందర్యవతిగా ఎదిగింది. డూన్‌లలో కొందరు ఆమెను వివాహమాడాలని ప్రయత్నిస్తుంటారు. అలాంటి ప్రమాదమే సంభవిస్తే తనకో సంకేతం పంపమని ఆమెకు సూచిస్తాడు జాన్. రూబెన్ హకాబాక్‌కు బ్రిటన్ రాజు దగ్గర మంచి పలుకుబడి ఉన్నట్టుంది. ఆ ప్రాంతంలోని శాంతిభద్రతల గురించి స్వయంగా వచ్చి నివేదించమని జాన్‌కు వర్తమానం వస్తుంది. ఆ వర్తమానాన్ని మోసుకొచ్చిన వ్యక్తి జెరెమీ స్టిక్‌ల్స్. డూన్‌లు స్టిక్‌ల్స్ మీద హత్యాప్రయత్నం చేస్తారు. తన ప్రాణాలొడ్డి పోరాడి అతణ్ణి రక్షిస్తాడు జాన్.

ఆ శీతాకాలంలో డూన్ తెగను ఒక్కతాటి మీద నడిపించిన వృద్ధుడు సర్ ఎన్సార్ డూన్ మరణిస్తాడు. అతడి ముఠాలోని కార్వర్‌డూన్ కొంతకాలంగా లోర్నా మీద కన్నేశాడు. తను ఇక రంగంలోకి దిగక తప్పదని జాన్‌కు తెలుసు. అదే సమయంలో ఒక రోజు, తను ప్రమాదంలో చిక్కుకున్నానని సంకేతం పంపుతుంది లోర్నా.

డూన్ స్థావరమంతా మంచు పేరుకుపోతుంది. చార్ల్‌వర్త్ డూన్ అనేవాడు లోర్నాను బంధించి ఉంచటంతో రహస్యంగా ఆమె ఉన్న గదికి చేరుకుంటాడు జాన్. కార్వర్ కన్నా ముందు తనే ఆమెను పెళ్లి చేసుకుంటే ఇక అడ్డుండదని చార్ల్‌వర్త్ వ్యూహం. జాన్ చార్ల్‌వర్త్‌తో యుద్ధంచేసి లోర్నాను తన ఇంటికి తీసుకొస్తాడు.

***లోర్నాడూన్‌ను అత్యుత్తమ నవలగా అభివర్ణించలేం కానీ, అమితంగా పాఠకాదరణ పొందడమే కాకుండా నేటికీ అదే స్థాయిలో ఆదరించబడుతున్న రొమాంటిక్ హీరోయిక్ నవలగా పేర్కొనవచ్చు. ఈ నవలలో గొప్ప కథనం కాని, శైలీవిన్యాసం కానీ లేవు. ఉదాత్తమైన లేదా నవ్య దృక్పథంతో కూడిన ఆలోచనా విధానమూ కన్పించదు. కానీ చారిత్రిక నేపథ్యం, నాటి వాస్తవికతతో ముడిపడి ఉండటమే కాక సాహసోపేతమైన ప్రేమ కథనం పాఠకులను ఆకట్టుకుంటోంది.***



## ఆర్.డి. బ్లాక్‌మోర్ (1825-1900)

ఇంగ్లండులోని లాంగ్‌వర్త్‌లో జన్మించిన రిచర్డ్ డాడ్రిడ్జ్ బ్లాక్‌మోర్ 19వ శతాబ్ది ఉత్తరార్థంలో ప్రాచుర్యం పొందిన నూతన రొమాంటిక్ మూవ్‌మెంట్‌కు ఆద్యుడు. ఆ రోజుల్లో ఆయన కథలు, నవలలు బాగా పాఠకాదరణ పొందాయి. ప్రపంచవ్యాప్తంగా, ముఖ్యంగా అమెరికాలో ఆయనకు అభిమానులు బ్రహ్మరథం పట్టారు. తరువాతి తరం ప్రముఖ నవలాకారుడు థామస్ హార్డీ, బ్లాక్‌మోర్‌ను ఆదర్శంగా తీసుకున్నాడు. రాబర్ట్ లూయీ స్టీవెన్సన్; అమెరికన్ నవలా, కథా రచయిత ఎఫ్.స్కాట్ ఫిట్జ్ జెరాల్డ్‌లకు కూడా ఆయనే ప్రేరణ. సమకాలీనులందరూ బ్లాక్‌మోర్‌ను ఉత్తమ నవలాకారుడంటూ కీర్తించారు. ఆయన చాలా రచనలు చేశాడు. అయితే ఇప్పుడా పుస్తకాలు ఎవరికీ గుర్తులేవు. 1869లో అతడు రాసిన 'లోర్నాడూన్' ఒక్కటే ఇప్పటికీ పాఠకులనలరిస్తోంది. పదిహేడో శతాబ్దిలో జరిగిన ఒక వాస్తవ సంఘటన ఈ నవలకు ప్రేరణ. సుమారు పదిసార్లు సినిమాగా, టీవీ సీరియల్‌గా తీశారు దీన్ని. కథాస్థలం ఎక్స్‌మూర్ అభిమానులకు యాత్రా స్థలంగా మారింది. టూర్ గైడ్‌లు దీన్ని 'లోర్నాడూన్ కంట్రీ'గా వ్యవహరిస్తారు.

రిచర్డ్ డాడ్రిడ్జ్ బ్లాక్‌మోర్ తండ్రి ఒక క్రైస్తవ మత సమూహానికి బోధకుడిగా ఉండేవాడు. తల్లి మరణించటంతో బ్లాక్‌మోర్ పినతల్లి సంరక్షణలో పెరిగాడు. ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయం నుంచి డిగ్రీ పొందె 'లా' కూడా చదివాడు. ప్రాక్టీస్ చెయ్యటానికి ఆరోగ్యం సహకరించలేదు. ఏదో ఒక ఉద్యోగం చెయ్యక తప్పదు గనక, అనేక స్కూళ్లలో టీచర్‌గా పనిచేశాడు. జేన్ ఆస్టెన్, సర్ వాల్టర్ స్కాట్‌ల నవలలతో ప్రభావితుడై రచనలకు శ్రీకారం చుట్టాడు. రచనల్లో గ్రామీణ జీవితాన్ని అత్యంత ప్రతిభావంతంగా చిత్రించిన బ్లాక్‌మోర్ జీవితమంతా పల్లెసీమల్లోనే గడిచింది. సాహిత్య కృషికి మాత్రమే కాదు, కృషీవలునిగా కూడా అతడికి మంచి గుర్తింపు వచ్చింది. ఆనాటి పేరున్న హార్టికల్చరిస్టుల్లో ఆయనొకడు. పర్యావరణ పరిరక్షణ ఫ్యాషన్‌గా మారని ఆ రోజుల్లోనే బ్లాక్‌మోర్, రైల్వే లైన్లు వాతావరణాన్ని కలుషితం చేస్తున్నాయని ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఉద్యమించాడు.

'కవి కాలేక కథలు రాస్తున్నాను' అని చెప్పుకున్న బ్లాక్‌మోర్ వచనం కవితాత్మకంగా ఉంటుంది. ముఖ్యంగా ఆయన ప్రకృతి వర్ణనలను వచన కవిత్వమే అంటారు.

లోర్నా కట్టుబట్టల్తో ప్రియుడి వెంట వచ్చింది- మెళ్లో చిన్నపిల్లలు వేసుకునే ఒక రంగురాళ్ల హారం తప్ప ఆస్తిపాస్తులేమీ లేవామెకు. ఆ హారంలో ఉన్నవి అమూల్యమైన రత్నాలని టాం ఫాగస్ ఒక్కడికే తెలుసు.

డూన్‌ల స్థావరం మీద జెరెమీ స్టిక్‌ల్స్ యుద్ధం ప్రకటిస్తాడు. ప్రభుత్వ సైన్యాలు అతడికి సహాయంగా వచ్చేలోగా డూన్‌లు జాన్ ఎస్టేట్‌పైకి దండెత్తి వస్తారు. కాల్పుల్లో ఇద్దరు డూన్‌లు మరణిస్తారు. కార్వర్ తప్పించుకుని పారిపోతాడు. 'లోర్నా పోతే పోయింది. కనీసం ఆమె హారమైనా దక్కించుకోవాల'ని డూన్‌ల ప్లాను. తమ కౌన్సిలర్‌ను మంతనాలకు పంపిస్తారు. తిరిగి వెళ్లేటప్పుడు హారం దొంగిలిస్తాడతడు.

జాన్ వంశ చరిత్రకు సంబంధించిన పత్రాలు పరిశోధించి అనేక విషయాలు తెలుసుకుంటాడు జెరెమీ స్టిక్‌ల్స్. సుమారు పదహారేళ్లక్రితం డూన్‌లు ఒక బాలికను అపహరించారు. అపహరణకు ముందు తల్లి ఆ పిల్ల మెళ్లో ఒక వజ్రాల హారాన్ని అలం





కరిస్తుంది. ఆనాడు తప్పిపోయిన పిల్లే లోర్నా. ఆమెను పెంచిన ఒక ఇటాలియన్ నర్స్ సహాయంతో ఆమె ఎర్ల్ ఆఫ్ డూగల్ సంతానమని నిర్ధారిస్తాడు. అంటే ఆమె నిజానికి లోర్నా డూగల్. రాజవంశీకురాలు గనక, రాజపరివారంలో చేరాలని ఆమెకు లండన్ నుండి ఆదేశం వస్తుంది.

జాన్ కేవలం ఒక రైతు. ఎర్ల్ కూతుర్ని ప్రేమించే అర్హత తనకు లేదని గ్రహిస్తాడు.

రెండవ చార్ల్స్ రాజు మరణిస్తాడు. అతడి అక్రమ సంతానమైన డ్యూక్ ఆఫ్ మాన్ మౌత్ తిరుగుబాటు చేస్తాడు. జెరెమీ స్టిక్‌ల్స్ మాన్‌మౌత్‌తో యుద్ధానికి బయల్దేరతాడు. రాజులు పోట్లాడుకుంటే ప్రాణాలు కోల్పోయేది సామాన్య పౌరులే.

వ్యవసాయం చేసుకుని ప్రశాంతంగా బతుకుతున్న తమను బలవంతంగా సైన్యంలో చేర్చుకున్నందుకు రైతులు నిరసన వ్యక్తం చేస్తారు. వృత్తిపనులు చేసుకునేవాళ్లు, చిన్న వ్యాపారస్తులు కూడా ఈ అన్యాయానికి అంతమెప్పుడంటూ దేవుణ్ణి ప్రార్థిస్తారు. టాం ఫాగస్ తిరుగుబాటుదార్లలో చేరతాడు. తన చెల్లెలి జీవితం గురించి బాధపడతాడు జాన్. ఆమె సంసారం చల్లగా ఉండాలంటే టాంని ఒప్పించి వెనక్కు తీసుకురావాలి. కాని తను టాంను వెదకటానికి పోతే, తన ఎస్టేట్ మీద డూన్ దాడిచేసే అవకాశముంది. కాని పొలంకన్నా, చెల్లెలి జీవితం ముఖ్యం. దారిలో తుపాకుల మోత వినిపిస్తుంది. భీకర యుద్ధం జరుగుతుంది. ఇరువైపులా అనేకమంది మరణిస్తారు. గాయపడిన టాం ఫాగస్‌ను సురక్షిత ప్రాంతానికి చేరుస్తాడు జాన్. ఇది గమనించిన ప్రభుత్వ సైనికులు, జాన్ కూడా తిరుగుబాటుదార్లతో చేరాడనుకుంటారు. జాన్ ప్రభుభక్తి జెరెమీ స్టిక్‌ల్స్‌కు తెలుసు. లండన్‌లో వాదించి ఆ మచ్చను తొలగించవచ్చుననుకుంటాడు.

లోర్నా ఇప్పుడు ఎర్ల్ ఆఫ్ బ్రాండిర్ సంరక్షణలో ఉంటోంది. జాన్ ఇంకా తనను ప్రేమిస్తున్నాడని ఆమెకు తెలుసు.

ఎర్ల్ ఆఫ్ బ్రాండిర్ మీద జరిగిన దాడిని జాన్ తిప్పి కొడతాడు. ఇంగ్లండు కొత్తరాజు జేమ్స్‌కీ విషయం తెలిసి జాన్‌ను ఆస్థానానికి పిలిపించి ఏం కావాలో కోరుకొమ్మంటాడు. జాన్ కోరిక మేరకు అతడికి రాజవంశీకుడిగా గుర్తింపు కలిగిస్తాడు. దాంతో లోర్నాను వివాహం చేసుకోగలిగిన గౌరవ ప్రతిష్ఠలు వస్తాయి జాన్‌కు. అయితే ఇంటివద్ద పొలం ఏమైందోనన్న బెంగ మాత్రం తీరలేదు. డూన్‌లు అక్కడ స్వైర విహారం చేస్తున్నారు. ఎవరికీ రక్షణ లేకుండా పోయింది. కార్వర్ అనేక దోపిడీలకూ, హత్యలకూ పాల్పడ్డాడు. జనమంతా జాన్‌తో మొరపెట్టుకున్నారు.

జాన్ శాంతికాముకుడు. డూన్‌లకు నచ్చచెప్పి సమస్య పరిష్కరించాలనుకుంటాడు. కాని కార్వర్ ఆ ప్రతిపాదనను తిరస్కరిస్తాడు. రూబెన్ హకాబాక్ డూన్‌లకు తాగించి నిర్వీర్యుల్ని చేస్తాడు. ఆ తర్వాత యుద్ధంలో కార్వర్ తప్ప అందరూ మరణిస్తారు.

లండన్ విలాసాలతో విసుగెత్తిన లోర్నా కూడా ఎక్స్‌మూర్‌కు తిరిగి వస్తుంది. ఎలాగైనా జాన్‌ను పెళ్లాడాలన్నదే ఆమె కోరిక. కొద్దిరోజుల్లోనే జెఫెరీ సమక్షంలో వివాహం కూడా జరుగుతుంది. ప్రీస్టు వాళ్ళను భార్యాభర్తలుగా ప్రకటించిన వెంటనే ఒక తూటా వచ్చి లోర్నాకు తగుల్తుంది. తెల్లటి ఆమె డ్రెస్సు రక్తసిక్తమవుతుంది. ఆమెపై కాల్పులు జరిపిన కార్వర్‌ను వెంబడిస్తాడు జాన్. ఇద్దరూ ప్రాణాలకు తెగించి తలపడతారు. ఆ పోరులో కార్వర్ హతమౌతాడు. జాన్ కుటుంబానికేమీ హాని జరగదు. లోర్నాకు కూడా గాయం నయమైపోతుంది. 'ప్లోవర్స్ బారోస్' కిప్పుడు దొంగల బెడద తొలిగిపోతుంది.

– ఎం. వసంత





# సరస్వతీ నమస్తుభ్యం

## తులసి బాలకృష్ణ



మైకంలో మునిగిన తండ్రి, లోకాన్ని విడిచిన తల్లి, ఊహల్లో తేలే చెల్లి.... సుఖమంటే ఏమిటో ఎరగని ఇరవై రెండేళ్ల ఆ యువకునిలో నిరాశ, నిస్పృహలు దట్టంగా పెనవేసుకున్నాయి. అలాంటి తరుణంలో ఆమె సాక్షాత్తూ శారదా దేవిలా వచ్చి అతని మానసవీణను శ్రుతి చేసింది. 'జీవితం తృణప్రాయం'గా భావించిన అతని ఆలోచనను 'జీవితం ఎంతో ఘనం' అనుకునేలా మార్చింది. ఆమె అతనికి మార్గదర్శి. అతడు మరెందరో విద్యార్థులకు మార్గదర్శి. మోడువారిందనుకున్న తన బతుకులోనూ వసంతాలూ విరబూయించుకున్నాడు. ఇతరులకూ సుఖశాంతులందించాడు. ఆదర్శ అధ్యాపకుడయ్యాడు. మానవత్వానికి ప్రతీకగా నిలిచాడు. తనకు కాంతిపథం పరిచి, నవ జీవనం ప్రసాదించిన ఆనాటి తన ఆరాధ్య దేవతకు అతడు కృతజ్ఞతాభివందనాలు సరికొత్త తరహాలో సమర్పించిన వైనాన్ని ఆసక్తికరంగా మలచిన **తులసి బాలకృష్ణ** నవల **'సరస్వతీ నమస్తుభ్యం'** ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.





బంజారాహిల్స్ మీదుగా పడమటకు జారుతున్న సూర్య భగవానుడి ఎర్రని కిరణాల తాకిడి, నీటి మీదుగా పరావర్తనం చెంది మీద వాలుతున్న కాంతి ప్రభావాలతో హుసేన్‌సాగర్‌లోని బుద్ధ భగవానుడి కుడి పార్శ్వం ఖణఖణ మండే కొలిమికి దగ్గర్లో నిలబెట్టినట్లుగా ఎర్రగా వెలుగుతూ, ఆ శాంతిదూత సైతం లోకంలోని అన్యాయాలు సహించలేక, కోపంతో నిలువునా 'దహించుకు' పోతున్నట్లున్న భ్రాంతిని కలిగిస్తోంది.

ఒకప్పుడు సాయం సమయాలు ప్రశాంతంగా గడపడానికి అనువైన ప్రదేశంగా పేరుపడ్డ ట్యాంక్‌బండ్ ఈనాడు అంగుళం ఖాళీ లేకుండా, ఆదరాబాదరా హడావుడిపడుతూ తిరుగుతున్న హైదరాబాదు ట్రాఫిక్ తాకిడితో- సామూహిక అత్యాచారం చేయబడుతున్న అమాయక ఆడపడుచులా 'కంపించి'పోతోంది. అసహనంగా వీస్తున్న గాలి రొద సైతం సాంకేతిక పొరబాటు కారణంగా పరీక్ష తప్పిన తెలివైన విద్యార్థి రోదనలా, ఫస్టు తారీఖునే జీతం పోగొట్టుకున్న చిరుద్యోగి ఆక్రోశంలా భారంగా వుంది.

రైలింగ్ మీదుగా వంగి, నీటివైపే బరువు గుండెతో భారంగా చూస్తున్నాడు భాస్కర్.

జీవితం మీద నెత్తుటి మరకలా నీటి పొడవునా పరుచుకున్న సూర్యకాంతి ఎర్రని చార, దిగులుని నింపుకున్న తన హృదయంలా నీటి నిండా కమ్ముకొన్న చిక్కటి నలుపు, భవిష్యత్తంటేనే భయపడుతున్న తన మనస్సులా కంపిస్తున్న జలాల 'అల' జడి- అతని దృష్టిని తట్టి కుదుపుతోంది.

మరణించిన తల్లి, మైకంలో మునిగే తండ్రి, ఊహల్లో తేలే చెల్లి, సుఖమంటే ఏమిటో ఎరగని తన ఇరవై రెండేళ్ల గడిచిన జీవితం... ఇవే... ఇవే ఆలోచనలు... ఇవే జ్ఞాపకాలు... ఇవే ఆందోళనలు... మెదడు పైపొరకి సిమెంటుపోత పోసినట్లు... లోపల నిక్షిప్తమై కూర్చుని... చెదపురుగులై తింటున్నాయి.

వయసుకి తగ్గ మరో సరదా ఆలోచనని, చిలిపి భావనని మెదళ్లోకి ఆహ్వానిద్దామని ఎంత ప్రయత్నం చేసినా తన శక్తి చాలడం లేదు. తన వయస్సు యువకుల్లా సరదాగా తిరగాలని, అల్లరి చేయాలని, ఆడ పిల్లలతో సరస సంభాషణలు చేయాలని తనకీ అనిపిస్తుంది. కాని అంతలోనే మెదడుని ఆక్రమించుకుని ఉన్న ఆలోచనలు కత్తులు దూస్తాయి. కసిదీరా కదను తొక్కుతాయి.

ఆ మధ్య ధైర్యం చేసి, తమ వీధిలోనే ఉండే తన కాలేజీలో జూనియర్ బేబీ రాణికి స్నేహాన్ని ప్రపోజ్ చేశాడు తను. నిజానికి ఆమె అందానికి, యవ్వనంతో అణువణువూ ప్రతిస్పందించే ఆమె శరీర సౌష్ఠవానికి ఆకర్షించబడి జీవితంలో మొట్ట మొదటిసారిగా ఓ స్త్రీ పట్ల తన హృదయం స్పందించింది. భవిష్యత్తులో ప్రేమగా రూపుదిద్దుకునేదేమో!

అప్పుడామె అంది, "ఆకారానికీ, అందానికీ నీకేం తక్కువ లేదు. కాని నాలాంటి అమ్మాయిలు కోరుకునేది అదొక్కటే కాదు. ఐశ్వర్యం, ఆకర్షణ, నాయకత్వ లక్షణం, పలుకుబడి అన్నీ ఉండాలి. యూ నో ఇప్పటికే నేను డాన్సర్‌గా ఇండియాలో సిటీలన్నింటిలో పెర్ఫార్మెన్సెస్ ఇచ్చున్నాను. ఈ పెర్ఫార్మెన్సెస్ అన్నీ అరేంజ్ చేసింది మా డాడీయే. ఇకనైనా ఫారిన్‌లో పెర్ఫార్మెన్సెస్ ఇవ్వాలి. అవి అరేంజ్ చేయగల సత్తా ఉన్న వ్యక్తితో నాకు ఫ్రెండ్‌షిప్ కావాలి. అతణ్ణి లైఫ్ పార్ట్‌నర్‌గా చేసుకోవడానికి కూడా నాకు నో అబ్జెక్షన్. అంతేకాని బ్లడీ కష్టాలు, కన్నీళ్లు... ఐ హేట్. ఐ హేట్ దోజ్ పర్సన్స్ కంపెనీ" అని.

రైలింగ్ గొట్టాల మీద భాస్కర్ చేతులు బిగుసుకున్నాయి.

ప్రేమలో తిరస్కరింపబడ్డందుకు తను





బాధపడడం లేదు. కాని అన్ని చోట్లా ఓటమి ఎదురవుతోందే...!

చదువు బుర్రకెక్కదు... చక్కటి ఆలో చన్లు రావు... చల్లటి సాయంత్రాన్ని అనుభవించే ఆసక్తి లేదు...

సూర్యుడు కొండల వెనక్కి పూర్తిగా జారిపోయాడు. ట్యాంక్‌బండ్ మీద, నెక్లెస్‌రోడ్ లోను, సాగర్ చుట్టూరా లైట్లు వెలిగాయి.

బేబీ రాణి మీది అభిమానం, ప్రేమ పటాపంచలైపోయాయి. హుసేన్‌సాగర్ వైపు నడిచాడు. రైలింగ్స్ మీదుగా నీట్లోకి చూస్తున్నాడు. 'ఇక్కడ లోతుంటుందా' అనే సంశయం కలిగింది. వినాయకచవితికి ఇక్కడే విగ్రహాలను నిమజ్జనం చేస్తారు. తను ములుగుతాడా మునగడా? ములక్కపోతే, కొన ఊపిరితో ఆ మురికి నీట్లో పడి కొట్టుకోవడం ఘోరం.

చరచరా ట్యాంక్‌బండ్ వైపు బయలుదేరాడు.

మనసు తిరిగి చెదిరి పోకుండా దృఢపరుచుకున్నాడు.

ఆత్మహత్యని మించి హాయినిచ్చేదేమీ కనబడడం లేదు.

ట్యాంక్‌బండ్ ఫుట్‌పాత్ మీదే నడుస్తూ, నీట్లోకి చూస్తూ, బాగా లోతుగా నీరున్న చోటు, ఎక్కువగా దీపాల కాంతి తనమీద పడనిచోటు వెతుక్కుని, బుద్ధభగవానుడి వైపు చూస్తూ 'ఈ భూ ప్రపంచంలో భోగభాగ్యాలు అశాశ్వతాలు అనే జ్ఞానోదయం కలిగి నువ్వు వాటిని అన్నిటినీ త్యజించి సన్యాసివయ్యావు. నేను ఈ భూప్రపంచంలో నాలాటి వాళ్లకి కష్టాలు శాశ్వతాలు అనే అభిప్రాయంతో జీవితాన్నే త్యజిస్తున్నాను' అని గొణిగాడు. చేతుల్ని రైలింగ్ మీద బలంగా నొక్కి, ఒక్క ఊపులో శరీరాన్ని గొట్టాల మీదకు లేపి, హుసేన్‌సాగర్ వైపుకు కూర్చున్నాడు ...

"ఇంత చిన్న వయసులోనే జీవితం బోరు కొట్టేసిందా?"

ఉలిక్కిపడ్డాడు భాస్కర్.

"ఆత్మహత్య చేసుకోవాలని ఆరాటపడ్తున్నావు కదూ?"

యాంత్రికంగా తలతిప్పి చూశాడు.

చిన్న చిన్న బట్టల షాపుల బయట ఎండకీ, దుమ్ముకీ గురవుతూ వెలిసిపోతున్న ప్లాస్టిక్ బొమ్మలాంటి స్త్రీ పెదవుల మీద ప్లాస్టిక్ నవ్వు. ఆమె రాసుకున్న సెంటు మరీ ఘాటుగా వుంది.

"ఆత్మహత్య చేసుకోవడానికి తొందరపడిపోనక్కరలేదు. మరో పది నిమిషాల తర్వాత చేసుకోవచ్చు. పది రోజుల తర్వాత చేసుకోవచ్చు, పది సంవత్సరాల..."

"మీరెవరు?" అప్రయత్నంగా ప్రశ్నించాడు భాస్కర్. ఆమె పెదాలమీద నవ్వు చిట్లింది. పెదాల మధ్య ఖాళీలోంచి కనిపించిన ఆమె పళ్లు నాచు పట్టిన బాత్‌రూం టైల్స్ టైపులో వున్నాయి. "గుడ్! ప్రశ్నించావంటే తెలుసుకోవాలనే కుతూహలంతోనే కదా? మరీ-తెలుసుకుందువు గాని" అంటూ, ఓ అడుగు ముందుకువేసి చొరవగా రిస్టుని పట్టుకుంది.

భాస్కర్‌లో ఒక్కసారిగా విద్యుత్తు పాకినట్లయ్యింది.

"చెయ్యి వదిలెయ్" అన్నాడు గాభరాగా-ఎవరయినా చూశారేమోనని కంగారుపడ్తూ.

"సరే, అయితే ఇటు దిగి నా పక్కనే నుంచో. సరదా కబుర్లు చెప్పుకుందాం.

"సరదా కబుర్లా?!"

"అబ్బ, కబుర్లొక్కటే కాదు లేవయ్యా. సరసాలాడుకుందాం, సరా?"

చురచురా చూసి ఫుట్ పాత్ వైపుకు దిగి, ముందుకు పోబోయాడు భాస్కర్.

మళ్లీ చెయ్యి అందుకుంది ఆ యువతి.

విసురుగా తల తిప్పి, "చూడూ, నేను ఆ రకం మగాణ్ణి కాదు" అన్నాడు కోపంగా.



"ఆహా! మరే రకం మగాడివిట? పిరికి తనంతో ఆత్మహత్య చేసుకునే మీసం తిప్పే మగ మహారాజువా? ఇందాక నేను అడ్డుకో కుంటే ఈపాటికి నీకు ఈ లోకంతో రుణం తీరిపోయేదిగా. ఇంకా నీకు సుఖపడే యోగం ఉండబట్టే కదా నువ్వు నా కంట షడ్డావు."

"సుఖమా? నాకు సుఖమా? దేవుడు నాకు రాయలేదు."

పకపక నవ్వింది ఆమె.

"తలరాత మార్చుకోవడం మన తరం కాదు" నిక్కచ్చిగా అన్నాడు భాస్కర్.

"సరే, అలాగే అనుకుందాం పోనీ. నువ్వు ఇప్పుడు ఆత్మహత్య చేసుకోవు అని రాసి పెట్టి ఉండబట్టే కదా బయటపడ్డావు?!"

తెల్లబోయి చూశాడు భాస్కర్.

"అలాగే, సుఖపడమనీ రాసుందేమో ఛాన్సెందుకు వదు లుకుంటావ్?"



## పరిచయం

వందలాది రచనలు చేసిన తులసి బాలకృష్ణ ఆంధ్రా బ్యాంక్‌లో ఆఫీసర్‌గా పనిచేస్తున్నారు. కథ, నవలలతో పాటు నాటకాల మీద కూడా మక్కువ కలిగిన ఆయన అభ్యుదయ నట సమాఖ్య కార్యదర్శిగా కూడా వ్యవహరిస్తున్నారు. ఇప్పటి వరకు ప్రచురితమైన ఆయన కథల సంఖ్య 340. దాదాపు ప్రముఖ తెలుగు పత్రిక లన్నిటిలో ప్రచురితమైన తులసి బాలకృష్ణ కథల్లో ఓ యాభైవరకు ఇతర భాషల్లోకి అనువాదమయ్యాయి. నాటకాలు రచించి, నటించి, దర్శకత్వం వహించి, న్యాయ నిర్ణే తగా కూడా వ్యవహరించే ఆయన ఈటీవీ-2లో ప్రసారమైన ఓ పది ఎపిసోడ్‌లలో నటించారు. ఈనాడు దినపత్రిక, ఆదివారం సంచికలో సొంత పేరుతో, కిరీటి అనే కలం పేరుతో అనేక వ్యాసాలు రాశారు. 'విపుల'లో ఆయన తెలుగు కథలతో పాటు అనువాద కథలు కూడా ప్రచురించబడ్డాయి. 'చతుర'లో ఇది ఆయన రెండో నవల.


చిరునామా: **తులసి బాలకృష్ణ**
ఆఫీసర్, ఆంధ్రాబ్యాంక్,
ఆర్. ఆర్. పేట బ్రాంచి, ఏలూరు.


"ఎందుకు అలా నవ్వుతున్నావు?"

"మన క్యారెక్టర్స్ మొత్తం ఆయన స్క్రిప్ట్‌లో ప్రతి మూవ్‌మెంటూ, డైలాగ్స్‌తో సహా రాయడయ్యా పిచ్చివాడా. కొన్ని లక్ష ణాలని మనకి ఆపాదించి భూమ్మీదకి వది లిపెడ్తాడు. ప్రపంచాన్ని గమనిస్తూ తడబడ కుండా అడుగులేస్తూ మనమే మన క్యారక్ట ర్ని విలక్షణంగా మలుచుకోవాలి."

"అబద్ధం. అన్నీ రాసిపెట్టే ఉంటాయి.

"సుఖమా- ఈ భూప్రపంచంలో నాకు సుఖాన్ని ఇచ్చేదెవరు?" నిరాశగా అన్నాడు భాస్కర్.

"నేను" కళ్లల్లోకి చూస్తూ కవ్విస్తూ అందామె.

"నా దగ్గర డబ్బుల్లేవు"

"పది రూపాయలు కూడా లేవా?"

అదిరిపడ్డాడు భాస్కర్.

ఆమె వైపు అసహ్యించుకుంటూ చూస్తూ,



"వెధవ పది రూపాయల కోసం..." దవడ బిగుసుకుంటూండగా చీదరించుకున్నాడు. చ(రున వెనుతిరిగి గబగబా నడవసాగాడు.

ఆమె వెన్నంటే వస్తూ రోషంగా అంది, "అందరి జీవితాలూ వడ్డించిన విస్తర్లు కావు మిస్టర్" అని.

ఆ మాటలు భాస్కర్‌కి వీపులోంచి బాణాల్లా గుండెల్లోకి పొడుచుకొచ్చాయి. 'అంటే తనకంటే ఇబ్బందుల పాలవుతున్న, అన్యాయమైపోతున్న, ఆక్రోశిస్తున్న జీవితాలు ఉన్నాయన్న మాట' భాస్కర్ అడుగుల్లో వేగం తగ్గింది.

ఆమె మళ్ళీ అంటోంది, "నీలాగే అధైర్య పడ్తే ఈ హుసేన్‌సాగర్‌లోకి దూకి చావడం నాకు క్షణాల్లో పని. మనిషై పుట్టాక చేతనయినంతవరకూ పోరాడాలి. కష్టాల్లోనే సుఖాన్ని వెతుక్కోవాలి."

భాస్కర్ ఆగిపోయాడు.

వెనుతిరిగి ఆమె ముఖంలోకి చూశాడు.

"రోడ్డు దాటి అక్కడ లాన్స్‌లో కూర్చుందాం పద" అందామె చొరవగా చెయ్యి అందుకుని.

యాంత్రికంగా ఆమె పక్కనే నడుస్తూ రోడ్డు దాటి, లాన్స్‌లో కొంచెం చీకటిగా ఉన్న ప్రదేశంలో ఆమెతోబాటు కూర్చున్నాడు భాస్కర్.

ఆమె నవ్వుతూ ముందుకు జరిగింది.

"నా దగ్గర పన్నెండు రూపాయలే ఉన్నాయి" అన్నాడు భాస్కర్ ఏదో అపరాధిలా చటుక్కున.

నవ్వుతూ చిన్నగా వేళ్ళతో చెంపమీద తట్టింది ఆమె.

ఆ నవ్వుకి అర్థం తెలియలేదు భాస్కర్‌కి.

"చదువుకుంటున్నావా? " అంటూ భాస్కర్ ముఖాన్ని పరికించి చూస్తూ అడిగింది. అతని ముఖ కవళికలలోనే ఆమె అనేక విషయాలని చదువుకుంటున్నట్లుగా ఉంది. ఆమె గొంతులో మార్దవం ధ్వనించింది ఈసారి.

"పి.జి. ఫైనలియర్" తలొంచుకున్నాడు భాస్కర్.

"ఎప్పుడైనా, ఏ స్త్రీతోనైనా సంబంధం ఉందా? "

తలెత్తి అడిగాడు భాస్కర్. "ఏ విధమైన సంబంధం? "

"నీకేవిధమైనదుందో చెప్పు- స్నేహం, ప్రేమ, శారీరక సంబంధం..."

"స్నేహం స్థాయిలోనే బెడిసికొట్టింది"

"ఆమెకి నువ్వు నచ్చలేదా? "

"మొదట్లో ఆమెకు నేను నచ్చలేదు- ఇప్పుడు నాకు ఆమె అంటే అసహ్యం."

"ఎందుకని? "

"ఆర్థికంగా దరిద్రుడినని ఆమె నన్ను తీసిపారేసింది."

"మరి నువ్వు? "

"పేరు ప్రతిష్ఠల కోసం దిగజారిన స్త్రీని అసహ్యించుకుంటాను నేను"

"పొట్ట గడవక దిగజారిన స్త్రీని? "

"........."

ఆమె కళ్ళల్లోకే చూస్తున్నాడు భాస్కర్.

"నేను ఆ కోవకు చెందుతాను. ఒదిలెయ్, ఏదో గబుక్కున అనేశాను. అవునూ- నీ దగ్గర పన్నెండు రూపాయలున్నాయంటున్నావు. ఎదురుగా దేనికైనా సరే, అభ్యంతరం లేని స్త్రీ కూర్చుని ఉంది. ఆ డబ్బుల్తో సుఖాన్ని కోరుకోవాలనిపించడం లేదా? "

"లేదు. నాలాగా నువ్వెప్పుడైనా సూసైడ్ చేసుకోవడానికి ప్రయత్నించావా అని అడగాలనిపిస్తోంది."

"లేదు! నెవర్! నీకు ఇంకేమనిపిస్తోంది"

"నువ్వసలు ఇలా ఎందుకయ్యావో తెలుసుకోవాలనిపిస్తోంది"

"అమ్మ దొంగా! పన్నెండు రూపాయల్తో నాలాంటి వాళ్ళ జీవితాన్ని గురించి క్షుణ్ణంగా తెలుసుకుని పత్రికలకో, సినిమా



# కృతజ్ఞతలు



అనతి కాలంలోనే అపరిమితమైన ఆదరణను చూపిన
ఆంధ్ర రాష్ట్ర ఆడపడుచులకు కృతజ్ఞతలు.

మీ సేవ – మాకు గర్వకారణం...







## సుప్రియ డిష్ వాష్ బార్ & పౌడర్

★ అందుబాటు ధరలో అరుదైన పనితనం

★ పేరుకుపోయిన నూనె మరకలు సైతం క్షణాల్లో మాయం

★ వంటింటి శోభ - ఇల్లాలి చేతులకు రక్షణ

**మా ఉత్పత్తుల ప్రత్యేకతలు:**

హై స్పీడ్ డిటర్జంట్ పౌడర్ & డిటర్జంట్ బార్

★ అందుబాటు ధరలో అరుదైన పనితనం

★ అన్నిరకాల బట్టలకు అద్భుతమైన రక్షణ

★ మరకలకు శత్రువు - రంగులకు కాపలా

★ మహిళామణుల అత్యుత్తమ ఎంపిక - హైస్పీడ్ మరియు సుప్రియ ★

మీ ప్రాంతానికి డిస్ట్రిబ్యూషన్ కై సంప్రదించండి

# లక్ష్మీ ఇండస్ట్రీస్

కోరుట్ల, కరీంనగర్ జిల్లా- 505 326

సెల్: 9948143473, 9948143476



లకో కథ నందించి వందలో, వేలో కొట్టేద్దామనుకునే రచయితవన్నమాట" గల గల నవ్వింది.

ఆమె తీరు వింతగా తోచింది భాస్కర్‌కి. కనబడుతున్న బాహ్య రూపానికి ఆమెలోని 'ఆమె'కి చాలా వ్యత్యాసం ఉన్నట్లుగా తోస్తోందెందుకో. ఆమె మాటల్లో సంస్కారం ద్యోతకమవుతోంది. మానవత్వంతో కూడిన ఏదో భావం వ్యక్తమవుతోంది. ఆమె తన నుంచి డబ్బుని కాకుండా మరేదో ఆశిస్తోంది.

"నేను రచయితని కాదు. పత్రికల వాళ్లతో గాని, సినిమాల వాళ్లతో గాని అసలు సంబంధమే లేదు. అసలు ఈ లోకంలోనే ఎవ్వరితోనూ నాకు సంబంధం ఉందనిపించదు. నాకు తల్లి లేదు. బాధ్యతలు విస్మరించిన తండ్రి మీద గౌరవం లేదు. చెల్లిమీద జాలి ఉంది గాని, ఆమె అస్తిత్వానికి నేను బాధ్యుణ్ణి కాదు. కాబట్టి నేను ఈ లోకంలో ఒంటరిగాణ్ణి" దరిదాపు అరిచినంత గొంతుతో అన్నాడు భాస్కర్.

"మరి నా గురించెందుకు తెలుసుకోవాలనుకుంటున్నావు? "

"ఊఁ...ఏమో...అర్థం కావడం లేదు..."

తాపీగా అందామె. "నీలాగే జీవితంలో పతనావస్థలో ఉన్న వ్యక్తుల గురించి తెలుసుకోవాలనే తపన మొదలయ్యిందిప్పుడు. నీలో నిన్ను నువ్వు ధైర్యపరుచుకోవడానికి నిన్ను మించి దగాపడ్డ జీవితాలు నీకు తెలియాలి"అతని కళ్లల్లోకి సూటిగా చూస్తోంది.

"........." కళ్ళప్పగించి చూస్తూ వింటున్నాడు భాస్కర్.

చిన్నగా నవ్వి అంది, "నా కథ చెబ్తాను గాని, మరి విన్నాక నీకు పన్నెండు రూపాయలకు దక్కాల్సిన సుఖంమీద ఇంట్రస్టు పోతుందేమో? "

ఆవేదనగా గొంతు వణుకుతుండగా భాస్కర్ అన్నాడు, "ఒద్దు. నాకా సుఖం వద్దు. మళ్లీ నేను సూసైడ్ అటెంప్ట్ చేసుకుంటానో లేదో చెప్పలేను గానీ, గుండెల్ని తడిపే ఒక్క విషయాన్నైనా ఎవర్నుంచైనా తెలుసుకోవాలనుంది నాకు. అదే నాకు సానుభూతి. అదే నాకు ఓదార్పు."

ఒక్కసారి గుండెలనిండా ఊపిరి పీల్చుకుని, కళ్ళు మూసుకుని, ఆమె చెప్పడం ప్రారంభించింది.

"మాది పశ్చిమగోదావరి జిల్లాలో ఓ శ్రోత్రియ కుటుంబం. మా తండ్రిగారు వేద పండితుడు. 'మా అమ్మాయి చదువుల తల్లవుతుందీ' అంటూ ముచ్చటపడి 'శారద' అని పేరు పెట్టాడు ఆయన నాకు.

మా క్లాసులో ఎప్పుడూ అన్ని సబ్జక్టుల్లోనూ నేనే ఫస్టు, ఇంటర్‌వరకూ నా చదువు చక్కగా సాగింది. తండ్రి చాటు బిడ్డని అప్పటివరకు.

బియస్సీ ఫస్టియర్‌లో ఓ ద్రాష్టుడితో స్నేహం కలిసింది.

'నీ అందం ఇలా ఓ మూల పల్లెటూళ్ళో వెలిసిపోకూడదు. రాష్ట్రంలోని యువకులందరూ నీ అందానికి దాసోహం కావాలి. అందంగా, ఆకర్షణగా కనబడాలనుకునే అమ్మాయిలందరికి నువ్వు రోల్ మోడల్‌వి కావాలి. మిస్ యూనివర్స్ పోటీల్లో పాల్గొని గెలిచి లక్షలూ, కోట్లూ గడించాలి, రాజ్యాలేలాలి' అంటూ ఎదిగీ ఎదగని నా బుర్రలో విషపు విత్తనాలు జల్లాడు అతను.

నాకు మత్తెక్కిపోయింది. మైమరచిపోయాను.

విచక్షణ జ్ఞానం నశించిపోయింది. ఏదో ఆకాశానికి ఎదిగిపోయే యోగం ఉందనిపించింది. అద్దంలో నా రూపం జగన్మోహనంగా కనిపించింది.

న్యూస్ రీడర్‌గా, యాంకర్‌గా, యాక్టర్‌గా ముందు టీవీ ఛానల్స్ ద్వారా నన్ను ప్రేక్షకులకి పరిచయం చేసి, తర్వాత వెండితెర



మీద వెలుగు చూపిస్తానని, జలతారు జీవితాన్ని నా కళ్లముందు బొమ్మ కట్టించాడు.

పరువు ప్రతిష్ఠ, ఆత్మాభిమానం లాంటి వాటికే పెద్దపీట వేసే నా తండ్రి నాకెన్నటికీ అటువంటి అందమైన జీవితాన్ని అందించలేడు కదా అనిపించింది. తెగించేశాను. బంధాలు తెంపేసుకున్నాను. అతన్తో లేచిపోయి హైదరాబాదొచ్చేశాను.

తలెత్తుకోలేని నా తండ్రి తలుపులు బిగించుకుని నేనున్న ప్రపంచంలోని గాలిని సైతం తన శరీరంలోకి ప్రవేశించడానికి అంగీకరించక అవమాన భారంతో మరణించాడు.

అక్షర జ్ఞానం, ప్రపంచ జ్ఞానం ఏ మాత్రంలేని అమ్మ, అనారోగ్యమే ఆభరణంగా ఎదుగుతున్న తమ్ముడూ అనాథలుగా మిగిలిపోయారు.

బుల్లితెర, వెండితెర కాదుగానీ, నా జీవితా



నికి ఇనుపతెర పడింది. ఆ దుర్మార్గుడి బందిఖానాలో పంజరంలో చిక్కిన రామచిలుకనైపోయాను. ఎంతగా ప్రయత్నించినా బయటపడలేకపోయాను. బయటపడే అవకాశం ఒకటి రెండుసార్లొచ్చినా స్వంత ఊరికి పోలేక, ఎటుపోవాలో తెల్చుకోలేక అమ్మనీ, తమ్ముణ్ణీ మరింత అనాథల్ని చేయడం ఇష్టం లేక వాడు చెప్పినట్లల్లా ఆడాను. నాకు దక్కుతున్న డబ్బులో కొంత ఓ స్నేహితుడి ద్వారా ఇంటికి పంపిస్తున్నాను. నేను ఏ విధంగా బతుకుతున్నానో అమ్మా తమ్ముళ్లకి తెలియదు. తెలిస్తే వాళ్లూ బతకరు. ఈ నీచపు వృత్తిలో హైక్లాసుతో మొదలై ఇప్పుడు ఇలా బజారు స్థాయికి జారాను.

నా జీవితాన్ని నాశనం చేసిన దుర్మార్గుడు మొన్నీమధ్యే ఓ యాక్సిడెంటులో చచ్చిపోయాడు. నాలో ఆనందమూ లేదు. బాధా లేదు. నేనిప్పుడొక మాట్లాడే ప్లాస్టిక్ బొమ్మని. చలనం కలిగిన మట్టి దిమ్మని. బహుశా త్వరలోనే నా శరీరం రోగాలకు నిలయమవుతుంది. మరో రెండేళ్లకో, మూడేళ్లకో ఈ శారద ఉనికి ఉండదు..." ఆమె గొంతు బొంగురుపోయింది. కన్నీళ్లు చెలియలికట్ట దాటకుండా కనురెప్పల మాటున దాచుకోవడానికి విఫల ప్రయత్నం చేస్తూ, మోకాళ్ల చుట్టూ, చుట్టుకున్న చేతుల మీదకు ముఖాన్ని దించుకుంటుండగా అప్రయత్నంగా ఆమె చేతులమీద భాస్కర్ చెయ్యి పడడం, అతని చేతిమీద ఆమె కన్నీటి బొట్లు రాలడం జరిగిపోయింది.

చటుక్కున తలెత్తి, కన్నీటి తెరల వెనగ్గా భాస్కర్ ముఖంలోకి చూసిందామె. భాస్కర్ చలించిపోతున్నాడు. ఆవేశ పడ్తున్నాడు. ఆమెనే చూస్తున్నాడు... మంటల్లో కాలిపోతున్న ఓ గంధపు చెట్టులా... వరదలో కొట్టుకుపోతున్న ఓ లేగదూడలా... లారీ చక్రాల కింద నలిగిపోతున్న పసిపిల్ల ... గుర్తుకువచ్చి అతని గుండెలు ఎగిసిపడ్తున్నాయి... ఆవేశంలో ఏదో నిర్ణయం తీసుకోబోతున్నాడు.. నోరు విప్పబోతున్నాడు...

'నో- ఆ నిర్ణయం తనకిష్టంలేదు. ఓ బంగారు భవిష్యత్తు నాశనం కాకూడదు. తన కారణంగా తన కోసం మరొకరి జీవితం పాడవకూడదు...' గబుక్కున అతని నోటికి చెయ్యి అడ్డుపెట్టి అందామె. "ఆరిపోయే దీపాన్ని. నా మీదిప్పుడు జాలిపడడం వృథా తమ్ముడూ" అని.

అదిరిపడ్డాడు భాస్కర్ - 'తమ్ముడూ' అనే సంబోధన ఆమె నోట వింటూనే.

ఆమె కళ్లల్లోకి ఆశ్చర్యంగా చూశాడు.

'అదంతే' అన్నట్లుగా కనురెప్పలు మూసి తెరిచిందామె.

భాస్కర్ అసహనంగా ఊగిపోయాడు.

"ఇంక నాతో నీకు పనేంటీ?" అంటూ జేబులోంచి పన్నెండు రూపాయలూ విసురుగా బయటకు లాగి, ఆమె చేతిలో కుక్కి లేవబోయాడు.

చటుక్కున అతని చేతినందుకుంది ఆమె. కనుబొమలు ముడిచి చూశాడు.

డబ్బుని అతని చేతిలో ఉంచి గుప్పిట మూసి, తట్టుతూ, "నీ దగ్గరే వుంచు. తిన్నగా ఇంటికి వెళ్లిపోమ్మా" అంది ఆత్మీయంగా.

"వెళ్లను. నా మనసు మరింత అల్లకల్లోలం అయింది" లేచాడు.

ఆమె కూడా లేచి నిలబడ్తూ సూటిగా, "అయితే ఏంచేస్తావు? చచ్చిపోతావా?" అని అడిగింది.

అగమ్యగోచరంగా ఫీలవుతూ నిట్టూర్చాడు.

హుసేన్‌సాగర్ వైపు చూపిస్తూ అందామె, "చావాలనే సరదాగా ఉంటే చచ్చిపో. కాని నీతోబాటు నీ సైన్యాన్ని చంపే హక్కు నీకు లేదు. భగవంతుడు క్షమించడు."



# షడ్రుచుల ఉగాదికి స్వాగతం ! సుస్వాగతం!!

ఉ గా ది

తీపి, వగరు, పులుపు, చేదు, కారం, ఉప్పు.
షడ్రుచుల సమ్మేళనమే ఉగాది.
తెలుగు సంవత్సరానికి ఆది ఈ ఉగాది.

ఉ గా ది

2007వ సం॥లో వచ్చేసే **సర్వజిత్తు** నామ ఉగాదికి స్వాగతం! సుస్వాగతం!!

షడ్రుచుల ఉగాదిని జరుపుకొను శుభవేళ మానవునిలోని అరిషడ్వర్గాలను (కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు) పారద్రోలి హృదయ మందిరమును దేదీప్య మానంగా వెలుగొందేలా తీర్చిదిద్దుకోవాలి. అప్పుడే భగవంతుని కరుణా కటాక్ష వీక్షణాలు మనపై ప్రసరించి పాప పరిహారం గావింపబడి స్వర్గతుల్యమైన శాశ్వతానందము చేకూరును. యుగానికే ఆది 'ఉగాది' అని పండితుల భావన. అంతటి మహత్తర పర్వదినాన ప్రజలందరూ మానసిక దౌర్బల్యములను దూరం చేసుకొని నిశ్చల మనస్సుతో భగవంతుని ప్రార్థించాలి. దేవుని ప్రార్థించటం వలన మనస్సు తేలికయి ప్రశాంతతను పొందుతుంది. ప్రశాంత చిత్తముతో మనము ఏ కార్యము తలపెట్టినా అది దిగ్విజయమవుతుంది. అందుకే "సాటి మనిషిని మనిషిగా ప్రేమించు - భగవంతుని ధ్యానించు" అని ఎందరో ఆధ్యాత్మిక గురువులు ప్రబోధిస్తున్నారు. ఉగాది పర్వదినం ఏ దేవుడికీ ప్రత్యేకించినది కాదు. ప్రకృతికి సంబంధించిన పండుగ. పంటలు పండి రైతు సోదరులు ధాన్యరాశులను ధనరాశులుగా మార్చుకునే శుభసమయం. అందమైన ప్రకృతిని చూచి సంతోషించే ఆనందక్షణం. అంతటి ప్రాముఖ్యత కలిగినది ఉగాది పర్వదినం. ఈ శుభదినాన ప్రజలందరూ సుఖ సంతోషాలతో ఉండాలని, ఆయురారోగ్య ఐశ్వర్యాలతో తుల తూగాలని, బంగారు పంటలు పండించాలని మనసా, వాచా, కర్మణా త్రికరణశుద్ధిగా కోరుకుంటూ తెలుగు ప్రజలందరికీ **ఉగాది పర్వదిన శుభాకాంక్షలు** తెలుపుకుంటున్నాను.

ఇట్లు,

**షిరిడిసాయి గ్లోబల్ ట్రస్ట్**
**శివసాయి మందిరం**
పెనుకొండ
అనంతపురం జిల్లా
ఆంధ్రప్రదేశ్



**కాళేశ్వర్**

## ఇదో రకపు వేదన...



ప్రసవం తర్వాత సహజంగా తల్లులు డిప్రెషన్‌కి లోనవుతారు. ఇది సహజం. కానీ తండ్రులు కూడా మానసిక వత్తిడికి లోనవుతారట.

ఇది మాత్రం 'అసహజం' అనుకోకండి. ముమ్మాటికీ నిజం. ఇలా తండ్రులు మానసిక వత్తిడికి లోనవడాన్ని "పోస్ట్ నేటల్ డిప్రెషన్" అంటారు.

ఇటీవల అమెరికా, ఇంగ్లాండు దేశాల్లో 8,431 మంది కొత్తగా తండ్రులైన వ్యక్తులపై పరిశోధనలు జరిపి ఈ విషయం కనుగొన్నారు. పిల్లలు పుట్టిన ఎనిమిది వారాల తర్వాత వీరిలో అత్యధికులలో మానసిక వత్తిడి, యాంగ్జైటీ, మూడ్స్ మారటం, చికాకు కలగడం ఏదో కోల్పోయినట్టుండటం వంటి లక్షణాలు ప్రస్ఫుటంగా కన్పించాయట. అలాగే మూడున్నర సంవత్సరాల పిల్లలపై జరిపిన పరిశోధనల్లో కూడా అదే రకమైన బాధ, విచారం, అధికోత్సాహం వంటివి కన్పించాయంటున్నారు శాస్త్రవేత్తలు. తండ్రులలో ఉండే డిప్రెషన్ కంటే రెండు రెట్లు అధికంగా పిల్లలలో- అదీ స్కూల్లో చేర్చబోయే ముందు వాళ్ల ప్రవర్తనలో మార్పు కన్పిస్తుందట. పోస్ట్ నేటల్ డిప్రెషన్ స్త్రీల కంటే పురుషుల్లోనే అధికంగా ఉంటుంది. స్త్రీలలో పదిమందిలో ఒకళ్లు మాత్రమే ఈ డిప్రెషన్‌కి గురవుతున్నారు.

పిల్లల్లో కూడా ముఖ్యంగా అబ్బాయిల్లోనే ఈ డిప్రెషన్ ఎక్కువగా కన్పిస్తోంది. దీనికి కారణమైన జన్యువులని కనుగొనే ప్రయత్నాలు చేస్తున్నట్లు శాస్త్రవేత్తలు తెలిపారు.

అయోమయంగా తలెత్తి చూశాడు.

"యస్. ఈ ఆరడుగుల పర్సనాలిటీ, రెండుపదుల యవ్వనం, సంపూర్ణ ఆరోగ్యం, ఆలోచించే మెదడు, కష్టపడే ఓపిక, ఆవేశంతో పొంగే రక్తం అన్యాయాన్ని చూడలేని కళ్లు... ఇవన్నీ... ఇవన్నీ నీ సైన్యాలే. నీ ఖర్మకొద్దీ ఓ పిరికి మనసు నీ సైన్యాధిపతి. సైన్యాధిపతిని అదుపు చేస్తే ఈ సైన్యంతో వింతలే సృష్టించగలవు నువ్వు. జీవితాన్ని పూదోటగా మార్చుకోగలవు. ఈ సైన్యం లేకనే బతుకుమీద ఆశవుండీ ఈ లోకంలో అనేకమంది జీవచ్ఛవాల్లా బతుకుతున్నారు. ఇంతటి సైన్యాన్ని నీకిచ్చిన ఆ భగవంతుడు మూర్ఖుడా? తప్పు చేశానని భగవంతుడే లెంపలేసుకునేట్లు చేస్తావా...?" సూటిగా ప్రశ్నిస్తోందామె.

తెల్లబోయి చూస్తున్నాడు భాస్కర్. ఏదో అతీతశక్తి తన రక్తంలోకి, తన కళ్లల్లోకి, తన గుండెల్లోకి, తన మెదళ్లోకి ప్రవేశించి తనని నిటారుగా నిలబెడ్తోంది. యస్, తను బలవంతుడు! ఈ సమాజంలో అనేకమంది కంటే బలవంతుడు! ఎంతో విలువైన సైన్యమున్న రాజ్యానికి రాజు తను! తన నుంచి



ఎంతో ఆశించి భగవంతుడు ఈ భూమ్మీదకు పంపిన జీవమున్న ప్రసాదం తను!

అప్రయత్నంగానే ఆమెవైపు చేతులు జోడించాడు భాస్కర్.

ఆమె కళ్లు మెరిశాయి. అభినందిస్తూ నిజాయితీగా చూసింది.

"నేను చెడిపోయిన దాన్నేగాని- నీ వయసు కుర్రాళ్లని నేనెప్పుడూ పాడు చెయ్య లేదు. గాడ్ బ్లెస్ యు, మై బ్రదర్..." చర చరా నడుచుకుంటూ వెళ్లిపోతోందామె.

భాస్కర్‌కి ఆమెని ఆపాలనిపిస్తోంది.

నోరారా కృతజ్ఞతలు చెప్పుకోవాలనిపిస్తోంది.

కాని, గద్గదిక విడివడి మాటలు బయటకు రావడంలేదు. మమకార బంధంతో దిశానిర్దేశం చేసిన పాశం తన కరచరణాలను కదలనియ్యడంలేదు. బహుశా ఆమెను ప్రయత్నపూర్వకంగా ఆపకపోవడమే మంచిదేమో. ఇంకా ఎంతమంది తనలాంటి పిరికివాళ్ల జీవితాలను ఆమె బాగుచేయాలని రాసుందో...?!

మరికొద్ది నిమిషాలకు భాస్కర్ తేరుకున్నాడు.

చుట్టూ లోకమంతా అందంగా కనిపిస్తోంది. ఎంతో ఆనందం అనుభవించడానికి ఆకుపచ్చని భవితవ్యం తన భావి జీవితంలో పరుచుకుని ఉందనిపిస్తోంది. విధి వంచితురాలైన ఓ స్త్రీయే తనలాంటి వాడి జీవితానికి ఓ అర్థం కలిపిస్తే, మంచి వయస్సులో, ఆరోగ్యంతో ఉన్న తనలాంటి యువకుడు ఎంతోమంది జీవితాలకు వెలుగుల్ని ప్రసాదించొచ్చు అనిపిస్తోంది... కదిలాడు...

భాస్కర్ అడుగులు వేగంగా పడుతున్నాయి.

తనుంటున్న బస్తీలోని మురికి వీధి, కూలిపోతున్నట్లున్న తమ ఇల్లు, ఓ వారగా కాళ్లతో మట్టి తవ్వుకుంటూ గోతిలో పడుకుంటున్న ఊరకుక్క, అన్నీ ఈ సృష్టిలోని భాగాలే. అన్నీ ఉండాల్సిందే అనిపిస్తోంది- సృష్టి పరిపూర్ణం అనిపించుకోవడానికి.

మనస్సు ఆహ్లాదంగా వుంది.

మెదడు చురుగ్గా వుంది.

గుండెల్లో హుషారుగా వుంది.

గొప్పగా చదువుకోవాలనే ఆలోచన వుంది.

నిటారుగా బోరవిరుచుకు నడుస్తూ ఇంటిలోకి అడుగుపెట్టాడు భాస్కర్.

## 2



విజయవాడలోని ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజి స్టాఫ్ రూంలో, కుర్చీలో వెనక్కివాలి, కళ్లు మూసుకుని, అయిదు సంవత్సరాల క్రితం తన జీవితానికి దిశానిర్దేశం చేసిన సోదరి కాని సోదరిని తలుచుకుంటూ, మనసా ధన్యవాదాలు తెలియజేసుకుంటున్నాడు భాస్కర్-ద లెక్చరర్ ఇన్ ఇంగ్లిష్.

ఆరోజు ఆ సోదరి తనని రక్షించి ఉండకపోతే- ఈనాడు ఇన్ని వందలమంది విద్యార్థుల అభిమానాన్ని తను మిస్ అయ్యేవాడు కదా! విద్యాదానంలోని అలౌకిక ఆనందం ఇలా జుర్రుకునే భాగ్యం పోయేది కదా! తన శిక్షణలో ఉత్తమ శ్రేణిలో విజయాలు పొందిన అనేకమంది విద్యార్థులు కురిపించే కృతజ్ఞతా విరుల వానల్లో మునిగిపోయి తన్మయుడయ్యే అదృష్టం చేజారిపోయేది కదా! అసలు తను బతికి ఉండేవాడేనా? బతికున్నా సమాజానికి ఇలా ఉపయోగపడే





వాడేనా? !

సాక్షాత్ సరస్వతీ స్వరూపం గాదూ ఆమె! ఎన్ని జన్మలెత్తినా ఆమె రుణం తీర్చుకోగలడా తను? ఆమె ఆ రోజున తనకు తారసపడడం ఎంత అదృష్టం! ఆ తర్వాత ఆమె ఏమైందో తెలుసుకోలేకపోవడం ఎంత దురదృష్టం!

ఆ తర్వాత, ఆమె పాదాలను తన కన్నీటితో కడిగి కృతజ్ఞతలు చెప్పుకోవడం కోసం ఎన్నిసార్లు హైదరాబాద్, సికింద్రాబాదుల్లోని పార్కులు, పబ్లిక్ ప్లేసులూ కళ్లల్లో ఒత్తులేసుకుని కాళ్లరిగేలా తిరిగాడు తను? !

ఆమె ఎందుకు కనిపించలేదు? మహానుభావులు మార్గం చూపిస్తారు గానీ, కృతజ్ఞతలు చెప్పుకుని, వెయ్యోవంతైనా రుణాన్ని తీర్చుకునే అవకాశం ఇవ్వరా?

భాస్కర్ కనుకొలకుల్లో నీళ్లూరాయి.

అవి చెంపలమీదకు జారకుండా రెప్పలతో అదుముకుంటున్నాడు.

ఇంతలో-

"ఛీఛీఛీ! ఈ కాలేజీలో లెక్చరర్‌గా ఉద్యోగం చెయ్యడం కన్నా, యాయవారాలు చేసుకు జీవించడం మనశ్శాంతి గానూ, గౌరవప్రదంగానూ వుంటుంది. ఛీ..ఛీ.." అంటూ, దుఃఖం నిండిన గొంతుతో ఛీత్కరించుకుంటూ విసవిస నడుస్తూ విసురుగా వచ్చి కుర్చీలో కూలబడ్డారు మాధవాచార్యులు గారు. కళ్లజోడు తీసేసి పైకండువాతో కళ్లొత్తుకుంటున్నారు.

చటుక్కున కుర్చీలోంచి లేచి ఆయన దగ్గరకు నడిచి, "ఏమయ్యింది ఆచార్యులు గారూ? " అనడిగాడు భాస్కర్ కొంచెం కంగారుగానూ, సానునయంగానూ.

"ఏంలేదులెండి" అంటూ తల అడ్డంగా ఆడిస్తూ దించుకుని, తన్నుకొస్తున్న దుఃఖాన్ని ఆపుకోవడానికి ప్రయత్నిస్తున్నాడాయన. ఆయన ఎంతటి దుఃఖాన్ని ఆపుకో ప్రయత్నిస్తున్నాడో అదురుతున్న ఆయన వీపు భాగం తెలియజేస్తోంది.

అంత పెద్ద మనిషి అలా దుఃఖిస్తుంటే భాస్కర్ గుండె చెరువైపోయింది. చనువుగా ధైర్యం చేసి ఆయన భుజాల చుట్టూ చేతులేసి చిన్నపిల్లాడిని అనునయిస్తున్నట్లుగా మృదువుగా, "ఏమయ్యిందో నాకు చెప్పరూ? " అన్నాడు ఆత్మీయంగా.

ఆ ఆత్మీయతకు ఆచార్యులుగారిలో దుఃఖం చెలియలికట్ట తెంచుకుంది. ధ్వని బయటకు రాకుండా ప్రయత్నిస్తూ, తల బల్లమీదకు వాల్చుకుని రోదిస్తున్న ఆయన్ని ఓ రెండు నిముషాలు స్వేచ్ఛగా వదిలిపెట్టాడు భాస్కర్. వరండాలోంచి చూసి, ఏమయ్యిందో అని గాభరాగా రాబోతున్న ప్యూనుని చేత్తో సంజ్ఞ ద్వారా వారించి వెనక్కి పంపించేశాడు.

రెండు నిముషాలపాటు లోపలి దుఃఖాన్ని బయటకు పోనిచ్చాక, మాధవాచార్యులు గారికి గుండెలు తేలికయినట్లనిపించింది. అలా బేలగా దుఃఖించినందుకు బిడియపడ్తూ, కండువాతో ముఖం తుడుచుకుని, "క్షమించాలి భాస్కర్- నిన్ను కంగారుపెట్టాను నాయనా" అన్నారు.

గబుక్కున ఆయన రెండు చేతులూ అందుకున్నాడు భాస్కర్.

"మీరు నన్ను శాసించండి, ఆశీర్వదించండి. అంతేగాని, పెద్దవారు మీరు ఇలా మాట్లాడితే నా శరీరం సిగ్గుతో చచ్చుపడిపోతుంది" అన్నాడు నమ్రతగా, కచ్చితంగా. ఆయన చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని, కళ్లకద్దుకున్నాడు.

జేవురించుకున్న మాధవాచార్యులుగారి ముఖం సహజ వర్ణానికి మారుతోంది క్రమేపీ, భాస్కర్ మాటలతో, అనునయంతో.

"ఇప్పుడు చెప్పండి ఆచార్యులుగారూ- ఏమయ్యింది? " అన్నాడు భాస్కర్ కొంచెం తీవ్ర స్వరంతో.

"ఏం లేదులే నాయనా- మా బోటి

తెలుగు లెక్చరర్లకి ఇలాంటి అనుభవాలు మామూలే..." అంటూ మాట దాటవేయడానికి ప్రయత్నిస్తున్న ఆయన్ని మధ్యలోనే అడ్డు కుంటూ, "అదేం కుదర్దు- ఏం జరిగిందో నాకు కావాలి. మీ వంటి మహా పండితుల కాలి స్పర్శతో ఈ కాలేజీ పునీతం కావాలిగానీ, మీకంటి మంటతో భస్మ సామ్రాజ్యం కాకూడదు" అన్నాడు ఆవే శంగా.

"వదిలెయ్ నాయనా- అల్లరి మూకలతో తలపడలేం"

"ఇప్పుడు మీరు ఏ క్లాసునుంచొస్తున్నారూ...? " సూటిగా చూస్తూ ప్రశ్నించాడు భాస్కర్.

"పోనియ్యమన్నాకదా నాయనా- నీ వంటి ఉత్తముడయిన లెక్చర ర్‌తో కలిసి పనిచేస్తున్నానే- అదే నాకానందం, నా పాండిత్యానికి సన్మానం. దా ఇలా కూర్చో చెబుతాను" చెయ్యి అందుకుని ఆత్మీ యంగా గుంజాడు ఆచార్యులుగారు.

భాస్కర్ కూర్చోలేదు.

మరింత బలంగా ఆయన్ని లేవదీస్తూ, "నేను కూర్చోవడం కాదండి- మీరు లేవాలి. లేచి నిలబడాలి, నిటారుగా నిలబడాలి. ధైర్యంగా నిలబడాలి. మీలోని విద్వత్తుకి విద్యార్థిలోకం దాసోహమ నాలి. లెండి, పదండి. నేనొస్తున్నా మీతో..." అన్నాడు ఆవేశంగా.

భాస్కర్ కళ్లలోని తీక్షణతని గమనిస్తున్న మాధవాచార్యులుగారు మరేం మాట్లాడలేకపోయారు. మరబొమ్మలా లేచి భాస్కర్ వెంట నడుస్తుండగా బి.ఎ. ఫస్టియర్ క్లాసువైపు బయలుదేరాడు.

"ఒరేయ్-ఆచారి మళ్లీ వస్తున్నాడ్రోయ్..." అంటూ సకిలించాడో బి.ఎ. ఫస్టియర్ కుర్రాడు వరండాలోంచి, క్లాసు రూము వైపుకి తిరిగి.

మ్యావ్‌లు, బౌభౌలు, సకిలింపులతో క్లాసు రూం దద్దరిల్లిపో యింది.

వెంటనే మరో కుర్రాడు హడావుడిగా, కంగారుగా చప్పట్లు చరిచి అందర్నీ హెచ్చరిస్తూ, లోపలికి పరుగెత్తుకొస్తూ, "ష్షూ- వెనకే భాస్కర్ కూడా వస్తున్నాడ్రా బాబూ..." అని అరిచాడు. అంతే!

క్షణాల్లో అంతరిక్షంలో ఉన్నంత నిశ్శబ్దం.

లెక్చరర్ చైర్లో కూర్చున్నవాడు, లెక్చరర్ టేబుల్ మీద మఠం వేసు క్కూర్చున్న వాళ్లు, కిటికీల్లో వేళ్లాడుతున్నవాళ్లు, వరండాలో సిగరెట్లూ దుతున్న వాళ్లు... తోసుకుంటూ, తొక్కుకుంటూ, ఎవరి సీట్లలో వాళ్లు... అందరూ రాముళ్లే... అందరూ మంచి బాలురే... కాని ఆ మంచి బాలురు హడావుడిలో, కంగారులో బ్లాక్ బోర్డుమీద తాము గీసిన కార్టూన్‌ని, దానికింద రాసిన వ్యాఖ్యని చెరపడం మరచిపో యారు. తీరా సీట్లలో కూర్చున్నాక చూసుకున్నారుగాని, వెళ్లి చెరు

**లెక్చరర్ చైర్లో కూర్చున్నవాడు, లెక్చరర్ టేబుల్ మీద మఠం వేసుక్కూర్చున్న వాళ్లు, కిటికీల్లో వేళ్లాడు తున్నవాళ్లు, వరండాలో సిగరెట్లూదుతున్న వాళ్లు... తోసుకుంటూ, తొక్కుకుంటూ, ఎవరి సీట్లలో వాళ్లు... అందరూ రాముళ్లే... అందరూ మంచి బాలురే...**





పుతూ భాస్కర్ దృష్టిలో పడడానికి ఎవ్వరూ సాహసించలేకపోయారు.

మాధవాచార్యులుగారు భయపడుతూనే తెచ్చి పెట్టుకున్న ధైర్యంతోనూ, భాస్కర్ మిలిట్రీ కమాండర్ ఠీవితోనూ క్లాసు రూములోకి ప్రవేశించారు.

చాక్‌పీస్ కిందపడితే టపాకాయ పేలినట్లు వినిపించేంత నిశ్శబ్దం.

"తమరలా కుర్చీలో కూర్చోండి ఆచార్యులు గారూ" అన్నాడు భాస్కర్.

"ఫరవాలేదులెండి" అన్నారాయన మొహమాటపడ్తూ. భాస్కర్‌ని తెచ్చినందుకు స్టూడెంట్స్ ఏం కత్తి కడతారోనని భయపడ్తూ.

"మీరు కూర్చోకపోతే, నేను మోకాళ్లమీద నిల్చుని మాట్లాడతా" అన్నాడు భాస్కర్, ఆయన్ని సున్నితంగా బెదిరిస్తూ.

కుర్చీలో కూర్చున్నారు మాధవాచార్యులుగారు.

నిటారుగా స్టేండ్ ఎట్ ఈజ్ పొజిషన్లో నిలబడి, ఒక్కొక్క విద్యార్థినీ పరికించి చూడ సాగాడు భాస్కర్.

తమ ఉచ్ఛ్వాస నిశ్వాసాల ధ్వని కూడా బయటకు రాకూడదన్నంతగా ఉగ్గబెట్టుకుని, గుడ్లప్పగించి చూస్తున్నారు విద్యార్థులు.

"కమాన్! ఇప్పుడు గోల చేయండి" అన్నాడు భాస్కర్ ఆహ్వానిస్తున్నట్లుగా.

విద్యార్థులలో చలనం లేదు.

"అరె, చేయండయ్యా! నా చేతిలో కత్తో, తుపాకోలేదుకదా? నేనేం ఇన్‌స్పెక్టర్ జనరల్ ఆఫ్ పోలీస్‌ని కాదుకదా? భయం దేనికీ, చెయ్యండి" రెచ్చగొట్టాడు.

ఏ మార్పూ లేదు క్లాసు రూములో.

"మహా అయితే నేను మీలో చాలామంది కంటే ఏడెనిమిది ఏళ్లు పెద్దవాణ్ణేమో. నన్ను చూసి ఎందుకు భయపడాలి మీరు? తెలుసుకోవాలని అడుగుతున్నానంతే!" అంటూ, ఎవరైనా నోరు విప్పుతారేమోనని అందర్నీ



మరొకసారి పరికించి చూసి, మాధవాచార్యులు గారి వైపు చెయ్యి చూపిస్తూ, "అంత పెద్ద వయస్సున్న ఆయనకే కంటనీరు తెప్పించారే-అంతటి శక్తున్న మీరు,ఆఫ్టరాల్ ఆయన్లో సగం వయస్సు కూడా లేని నన్ను..." అంటూ ఆగి, ముక్కులు ఎగబీల్చాడు.

వాసన... సిగరెట్ వాసన... కాల్తున్న సిగరెట్ వాసన.

ప్లాట్‌ఫారం దిగాడు భాస్కర్

స్టూడెంట్స్ టేబుల్స్ క్రిందకు చూసీ చూడనట్లు చూస్తూ, గ్యాలరీ మెట్లు ఒక్కొక్కటే నెమ్మదిగా ఎక్కసాగాడు వెనకనుంచి రెండవ లైన్లో వున్న కుర్రాళ్లలో కంగారు మొదలయ్యింది.

మరో రెండు మెట్లెక్కాడు భాస్కర్.

వెనక నుంచి రెండవ లైన్లోని మధ్య కుర్రాడికి చెమటలు పోయసాగాయి.

మరో మెట్టెక్కాడు భాస్కర్.

ఆ కుర్రాడికి చలి కూడా మొదల



య్యింది సన్నగా.

మరో మెట్టెక్కాడు భాస్కర్

మొద్దుబారుతున్న కుర్రాడి మెదడు కొద్దిగా పనిచేయసాగింది. వెనక్కి తన్ని పెట్టుక్కూర్చుని, కాలుని నిటారుగా జాపి, నేలమీద ఆడించసాగాడు- తన బూటు కాలుతో, తను ఏర్పాటు చేసిన 'క్షిప ణి'ని తనే ధ్వంసం చేసేసి, తప్పించుకుందా మని. క్షిపణి అందలేదు. ఈసారి మడిచి తిప్పుతున్నాడు.

ఈ కుర్రాడి కదలికలు, అతనికి తోడ్పడ్డా నికి ఏమీ తెలియనట్లు నటిస్తూనే అతని పక్కవాళ్లు పడ్తున్న హడావుడి- భాస్కర్ గ్రహించేశాడు. గబగబా మిగిలిన మెట్లెక్కి, సెంటర్ కుర్రాడి వైపు గుడ్లురిమి చూస్తూ "స్టాండప్" అని హుంకరించాడు.

తటాలున లేచి నిలబడ్డాడు ఆ కుర్రాడు.

మిగిలిన వాళ్లను బయటకు వచ్చేయ్యమ న్నాడు భాస్కర్.

క్షణం ఆలస్యం చెయ్యకుండా ఆ కుర్రాడికి అటు యిటు ఉన్న వాళ్లంతా బయటకొచ్చే శారు.

ఒంగి ఆ కుర్రవాడి సీటు కిందకు చూశాడు భాస్కర్.

ఒక కాల్తున్న సిగరెట్ పీక, దాని వెనక భాగానికి గుచ్చివున్న హవ్వాయి జువ్వ తాలూకు వత్తి. ఆ జువ్వ అటువైపు లైన్లలో ఉన్న గర్ల్ స్టూడెంట్స్ వైపుకి డైరెక్ట్ చేయ బడి వుంది. ఈ సిగరెట్ పీక పూర్తిగా కాల గానే జువ్వవత్తి అంటుకుని, సర్రున పోయి లేడీస్ సీట్లకో, వాళ్ల కాళ్లకో గుద్దుకుని, ఢాం అని పేలితే.. ఎంత ఆనందం (!? ). ఒక్కోసారి ఆ జువ్వల డైరెక్షన్ లెక్చరర్ వైపుకి కూడా వుంటుంది. జువ్వలు వీలు కాకపోతే దీపావళి ఆటంబాంబులు పేలాక అమాయకత్వం నటించే ఏర్పాటు చేసిన కుర్రవాళ్లు, వాళ్లకు హీరో వర్‌షిప్.

తలవంచుకు నిల్చున్నాడా కుర్రాడు - తను కాదని బుకాయించే ధైర్యం కూడా చెయ్యలేక.

ఆ కుర్రాడి 'మిసైల్' వైపొకసారి చూసి, చూపుని అతని ముఖం వైపుకు మరల్చాడు భాస్కర్.

నెమ్మదిగా కనురెప్పలెత్తాడు కుర్రాడు. అంతమంది ముందు ఓ కుర్ర లెక్చరర్‌కి భయపడ్తున్నందుకు లోనుండి అవమాన భావం తన్నుకొస్తున్నా, ధిక్కరించి నిలబ డేంత ధైర్యం చిక్కడం లేదు. చూపులు చలించిపోతున్నాయి.

చల్లగా, చందనంలా నవ్వాడు భాస్కర్.

తెల్లబోయాడు కుర్రాడు.

ఏం జరుగుతుందోనని గుడ్లప్పగించుకు చూస్తున్నారు మిగిలిన విద్యార్థినీ, విద్యా ర్థులు.

మెత్తగా అన్నాడు భాస్కర్, "నాన్నా! నీ మిస్సైల్‌ని జాగర్తగా ఏజ్ ఇటీజ్‌గా రెండు చేతుల్తో పట్టుకుని, కిందకు రామ్మా..." అని ఆర్డరిచ్చి, లెక్చర్ ప్లాట్ ఫారం దిక్కు మెట్లు దిగసాగాడు భాస్కర్.

మారుమాట లేకుండా యాంత్రికంగా, రెండు చేతుల్తో సిగరెట్ పీకని, అందులో గుచ్చిన వత్తితో సహా హవాయిజువ్వని పొందిగ్గా కదలకుండా పట్టుకుని, భాస్కర్‌ని అనుసరించాడు ఆ కుర్రాడు.

"గుడ్, కింద పెట్టు" అన్నాడు, జువ్వ డైరె క్షన్‌ని బయటకు గ్రౌండ్ వైపు నిర్దేశిస్తూ భాస్కర్.

ఆ కుర్రాడు అలాగే చేశాడు.

"వెల్... మైడియర్ బోయిస్. చూశారా ఇన్వెన్షన్ స్టార్ట్స్ ఫ్రం క్లాస్‌రూం ఆల్సో- అఫ్ కోర్స్ సమ్‌టైమ్స్ విత్ మిస్చివస్ ఇన్‌టెన్షన్. ఎనీ హౌ- ఐ కంగ్రాట్యులేట్ దిస్ స్టూడెంట్ ఫర్ హిజ్ ఇన్వెన్షన్" అంటూ, ఆ కుర్రాడి వైపు చేయి చాపాడు భాస్కర్. అది పొగడ్తో, వెక్కిరింపో అర్థంగాక అయోమ యంగా చేయి కలిపాడు ఆ కుర్రాడు.



మాధవాచార్యులుగారూ, మిగిలిన స్టూడెంట్స్ తెల్లబోయి చూస్తున్నారు.

"నౌ-న్యూ మిస్సైల్ తయారీ చూశాం. కంగ్రాచ్యులేట్ చేశాం. ఇప్పుడింక త్వరగా దీన్ని మనం ధ్వంసం చెయ్యాలి. ఎందుకంటే ఇహనో, ఇప్పుడో ఇది కదిలి అగమ్యంగా పోయి, మన తోటివాళ్లకే ఎవరికయినా హాని చెయ్యొచ్చు" అని ఆ కుర్రాడితో, "ఏమంటావ్ మైడియర్?" అనడిగాడు భాస్కర్.

ఆ కుర్రాడికి కొద్దిగా ధైర్యమొచ్చింది. "యస్సర్" అంటూ చిన్నగా తల ఊపాడు- అపరాధ భావనతోనే.

"గుడ్ ఇప్పుడు దీన్ని... ఈ సిగరెట్ పీకని... నువ్వు కాలితో నలిపి ఆర్పెయ్యమ్మా..." అన్నాడు భాస్కర్.

ఆ కుర్రాడు వెంటనే తన బూటు కాలుని ఆ సిగరెట్ పీకమీద పెట్టబోయాడు గాని- భాస్కర్ వారిస్తూ. "ఆఁ.. నొనొనో... బూటు తీసేయాలమ్మా"అన్నాడు నవ్వుతూ.

అదిరిపడి చూశాడు ఆ కుర్రాడు.

విద్యార్థులు విస్తుపోయారు.

"సార్- కాల్తుంది" అన్నాడు ఆ కుర్రాడు బెదురుగా.

"తెలుసు. తెలుసు నాన్నా. ఉత్పత్తి మంచిదైనా, ఉద్దేశం చెడ్డదైనప్పుడు ఫలితం ఇబ్బందికరంగానే ఉంటుంది. మరో నిమిషం నీ సీటు దగ్గరే దీన్ని ఉంచి వుంటే- దీని గమ్యం నీతోటి లేడీ స్టూడెంట్స్ మీదకు కాదూ? ప్రమాదం ఏ స్థాయిలో ఉండేదో చెప్పలేం కదా? కానీ... కానీ... వత్తి అంటుకోబోతుంది.. క్విక్..." భాస్కర్ గొంతులో తీవ్రత హెచ్చింది.

ఊపిరి బిగపట్టి, గుడ్లప్పగించి చూస్తున్నారంతా. వారించడానికి మాధవాచార్యులుగారికి క్కూడా ధైర్యం చాలడం లేదు.

భాస్కర్ గొంతులోనూ, చూపులోనూ ఉన్న తీవ్రతకి భయపడ్డ ఆ విద్యార్థి బూటు తీసేసి, కాల్తున్న సిగరెట్ పీకమీద కాలుంచి ఒత్తాడు.

## త్రిపురనేని చతురోక్తులు

త్రిపురనేని రామస్వామి చౌదరి నాస్తికవాది. అనర్గళంగా కవిత్వం చెప్పగల సత్తా ఆయన సొంతం. అందుకే 'కవిరాజు' బిరుదు పొందారు. సూతాశ్రమం పేరిట ఒక ఆశ్రమం ఏర్పాటు చేసుకుని రచనల ద్వారా తన భావాలను ప్రచారం చేసేవారాయన. వివిధ సందర్భాలలో ఆయన సమయోచిత స్పందనలు, చతుర వ్యాఖ్యలు మీకోసం..



### కృతజ్ఞతలు

కవిరాజును ఎవ్వరైనా మీ 'ఖూనీ' నాటకం గురించి చెప్పమంటే- ఆ ఘన తంతా సాక్షాత్తు విశ్వనాథకే దక్కుతుందని చెప్పేవారు. నాతో ఇంత మంచి నాటకం రాయించిన విశ్వనాథకు కృతజ్ఞతలు అనేవారు.

అసలు విషయం ఏమంటే- విశ్వనాథ 'వేనరాజు' నాటకం ఓ మిత్రుడి ఇంట్లో చూసి చదివారు త్రిపురనేని. అందులో 'వేనరాజు'ను కిరాతకుడిగా వర్ణించడం చూసి మరీ ఇంత క్రూరమా అనుకున్నారు. వెంటనే భాగవతంలో వేనుడి వృత్తాంతాన్ని చూశారు. విశ్వనాథ వేనుడికి అన్యాయం చేస్తున్నారని భావించి దానికి ప్రతిగా 'ఖూనీ' నాటకాన్ని రాశారు. అందుకే తనతో ఈ నాటకం విశ్వనాథే రాయించారని వ్యంగ్యంగా చెప్పేవారాయన.



వెంటనే "అమ్మా" అన్నాడు, అరికాలు మండిపోతుండగా.

"అదీ-శబ్బాష్! ఆ అమ్మే గుర్తుకు రావాలి. ఇంటి వద్ద అమ్మ, విద్యాలయంలో చదువుల తల్లి! ఎవరయినా మన అమ్మే. బాధలోనయినా ఆ తల్లిని గుర్తు చేసుకుంటే, ఇతరుల్ని బాధ పెట్టకుండా వుంటాం. బూటు తొడుక్కుని, జాగ్రత్తగా నీ సీట్లోకి పోయి కూర్చోమ్మా..." ఆ కుర్రాడికి డైరెక్ట్ చేశాడు భాస్కర్, జువ్వని క్లాసరూం బయట పడవేస్తూ.

ఎర్రబడ్డ ముఖంతో, కాలిన కాలుని అన్చి అన్చి వేస్తూ, గ్యాలరీ మెట్లెక్కి, తన సీట్లోకి పోయి కూర్చున్నాడు ఆ కుర్రాడు. ఆ బెంచీలోని మిగిలిన కుర్రాళ్లు భయం తీరక, బుద్ధిమంతుల్లా నటిస్తూ, కొద్దిగా ఎడంగా కూర్చున్నారు.

జువ్వని పడేసి తిరిగి ప్లాట్‌ఫారం దగ్గరకు వస్తున్న భాస్కర్ దృష్టి బోర్డుమీది కార్టూన్ మీద, దాని కింద వ్యాఖ్యమీద పడింది.

మాధవచారిగారి మీద కార్టూన్ అది. ఆయన పోలికలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. పొడుగు ముక్కు, తుట్ట పెదిమలు, మిటకరించిన కళ్లు, నిటారుగా నిలబడ్డ పిలక,.. కింద 'సాంబారులో ఎలక, మాధవాచారి పిలక' అని రాసి వుంది.

కార్టూన్‌ని పరికించి చూశాడు భాస్కర్. అటు తర్వాత క్లాసు వైపుకి తిరిగి, నెమ్మదిగా ప్రారంభించి, పకపక నవ్వాడు.

ఊపిరి బిగపట్టి చూస్తూన్నారంతా, మళ్లీ ఎవడికి మూడిందో అని.

"ఎవరు వేశారయ్యా ఈ కార్టూన్?" అన్నాడు మెచ్చుకోలుగా కనుబొమలెగరేస్తూ, చిరునవ్వు సాయంతో.

ఆలస్యం చెయ్యకుండా ఒప్పేసుకోవడమే ఉత్తమమేమో, భయంతో ఎలాగూ ఎవడో ఒకడు చెప్పేసినా చెప్పేస్తాడు. అప్పుడు శిక్ష మరిన్ని రెట్లు కఠినంగా ఉండొచ్చని భయపడి, ఓ కళ్లజోడు కుర్రాడు లేచి నిలబడి, తడబడుతూ, "న్నె..నేనే... వేశాను సార్ ఆ బొమ్మ" అన్నాడు, ముందు నుంచి మూడవ వరసలో ఉన్నాడతను.

"గుడ్... టైం వేస్టు చెయ్యకుండా చెప్పేశావు. సంతోషం వాటీజ్ యువర్ నేమ్?"

"మురళి సర్"

"మురళీ- ఇలారా" పిలిచాడు భాస్కర్.

భయపడుతూనే వచ్చాడు మురళి భాస్కర్ దగ్గరకు.

భాస్కర్ డస్టర్ వెనక్కి దాచుకుని "మురళీ-తుడిచెయ్" అన్నాడు.

డస్టర్ దాచేసి, తుడిచెయ్యమంటే దేంతో తుడవాలో అర్థం కాలేదు మురళికి. జేబులో చెయ్యి పెట్టుకుని రుమాలు తీయబోయాడు.

వారిస్తూ అన్నాడు భాస్కర్, "అహఁ ..హాఁ! సార్ కండువాతో తుడవవయ్యా" అని.

తెల్లబోయి, భయంభయంగా చూశాడు మురళి.

మాధవాచార్యులుగారు కూడా విస్తుపోయారు.

స్టూడెంట్సు అందరూ మతులుపోయి చూస్తున్నారు.

"తీసుకో ఫరవాలేదు. మీరేం చేసినా ఏమీ చెయ్యలేని ఆచార్యులుగారు, ఆయన కండువాతో బ్లాక్ బోర్డు మీద కామెంట్సుని, అందులోనూ తనమీదే రాసిన వాటిని తుడుస్తామంటే వద్దంటారా? మీ అల్లరికి మరీ మనసు బాధపడ్తే కేవలం కన్నీళ్లు తుడుచుకోవడానికి ఉపయోగిస్తుందని మాత్రమే ఆయన ఆ కండువా మోసుకొస్తున్నారు గాని- ఆయనకి మీ నుంచి గౌరవం లభిస్తుందన్న ఆశతో కాదయ్యా, కండువా భుజాన వేసుకుంటున్నది. తీసుకోమ్మా ఫర



ఉగాది శుభాకాంక్షలు



# APGVB

We are with you!

# ఆంధ్రప్రదేశ్ గ్రామీణ వికాస్ బ్యాంక్

ఆపన్న రైతన్నకు అండదండలు అందించడంలో అగ్రగామి

సమాజ శ్రేయస్సుకై కొంగ్రొత్త పథకాల అమలులో నిత్య కృషీగామి

బ్యాంకింగ్ రంగ ప్రగతిపథంలో పురోగామి, సిబ్బంది శ్రేయో పథంలో నిరంతర స్నేహగామి

ఎ. అనంతకృష్ణ
చైర్మన్

**The First-Best in aiding the afflicted Farmers**
**The ever-Struggling-Best in Executing the Novel Schemes**
**The Propellent-Ever-Best in the Advancement of Banking System**
**The Friend-Best in Needs and in the weal of Banking Personnel**

**Head Office : WARANGAL**

Head Office : H.No: 2-5-8/1, Ramnagar, Hanamkonda
Warangal Dist. Pin: 506 001 A.P.
Ph: 0870-2563662, 2577256, 25777744, 2577755, 2577766,
2577977, 2566633, 25636633m, Fax: 0870-2550370
e-mail : apgvikasbank2006@yahoo.co.in



వాలేదు..."

మురళి చలించిపోయాడు.

కళ్లల్లో సన్నటి నీటి పొర. గబ గబా తన చొక్కా విప్పేసి, దాంతో ముందు బోర్డుమీది కామెంట్సుని బరబరా తుడిచేశాడు. ఆ తర్వాత కార్టూన్‌ని తుడవబోతుంటే చెయ్యి పట్టుకుని ఆపాడు భాస్కర్, "ఆ బొమ్మని చెరపకు. రియల్లీ ఇట్స్ ఎ గుడ్ కార్టూన్. ఇదుగో చాక్‌పీస్. నా కార్టూన్ వెయ్యి" అన్నాడు.

"తప్పయ్యింది సార్- నేను యింక యిలాంటి బొమ్మలు వెయ్యను" తలదించుకున్నాడు మురళి.

"లేదయ్యా బాబూ... నేను నిజంగానే అంటున్నాను. నీలో మంచి కార్టూనిస్టు ఉన్నాడు. ఏం ఆచార్యులుగారూ- సరిగ్గా చూడండి. ఈ బొమ్మలో మీ పోలికలు చక్కగా కుదర్లేదూ? "

కుర్చీలోంచి లేచారు మాధవాచార్యులుగారు.

భాస్కర్ వ్యంగం లేకుండా నిజంగానే తన అభిప్రాయం అడుగుతున్నాడని గ్రహించి, బొమ్మని పరికించి చూశారు.

"అద్భుతంగా వుంది" అన్నారు మనస్ఫూర్తిగా.

"చూశావా... నా బొమ్మ గియ్యి" మురళిని ఉత్సాహపరిచాడు భాస్కర్.

రోటిలో తల దూర్చాక రోకటి పోటుకి భయపడ్డం ఎందుకు అనుకున్నాడో ఏమో, మురళి తెగించి భాస్కర్ క్యారికేచర్‌ని చకచక రెండు నిమిషాల్లో గీసేశాడు బ్లాక్‌బోర్డు మీద. ముడివడిన కనుబొమలు, బుసలు కొడ్తున్న ముక్కుపుటాలు, విచ్చుకున్న చెవి డొప్పలు, బిగుసుకున్న దవడ ఎముకలు... రెండు నిమిషాల్లో పూర్తయిపోయిన తన కార్టూన్‌ని చూస్తూనే భాస్కర్ చప్పట్లు చరుస్తూ "సూపర్బ్-సింప్లీ సూపర్బ్! ఏమయ్యా బాబూ- ఇంత ఆర్టు నీ దగ్గర పెట్టుకుని, పిచ్చి పిచ్చి రాతలు రాస్తూ చెడిపోతున్నావెందుకయ్యా? డెవలెప్ చేస్కో. ఏం చెప్పగలం, రేపొద్దున్న నువ్వు ఓ బాపువవుతావో, ఓ ఆర్కె లక్ష్మణ్ వవుతావో, ఓ శంకర్‌వవుతావో... ఏ కళయినా చదువేనయ్యా. అందరూ కాలేజీల్లో చదువుకున్న చదువుతో డాక్టర్లు, ఇంజనీర్లు, బ్యాంకు ఆఫీసర్లు, లెక్చరర్లూ కానక్కర్లేదు. ఓ గొప్ప కళాకారుడు కూడా కావచ్చు కళాకారుడు చదువుకున్నవాడు కూడా అయితే ఆ కళకి సంస్కారం అబ్బుతుంది. ప్రపంచ పోకడలు తెలుసుకోవడానికి అవకాశం ఉంటుంది. కొట్టండయ్యా చప్పట్లు మన కాలేజీ గర్వించదగ్గ కార్టూనిస్టు మురళీ కోసం" అంటూ అందర్నీ ఉత్సాహపరిచాడు భాస్కర్.

టెన్షన్‌తోనూ, భయంతోనూ బిగుసుకుపోతున్న స్టూడెంట్ కుర్రవాళ్లకి ఆ మాత్రం ప్రోత్సాహం ఇస్తే ఇంక వేరే చెప్పాలా? ! క్లాసు రూముపై రూపు ఎగిరిపోయే ధ్వనితో మారు మోగిపోయాయి చప్పట్లు.

మురళి షర్టుని తన చేతుల్లోకి తీసుకుని, చాక్‌పీస్ డస్ట్ దులుపుతూ, "మురళీ- నీ బుర్రని కూడా యిలాగే దులపాలి నువ్వు. దుమ్ముని చేరనీకు ఇంక ఫ్యూచర్‌లో. పోయి కూర్చో" అంటూ పంపించాడు భాస్కర్, షర్టుని అతనికి అందించి.

మురళి, మాధవాచార్యులుగారికి 'సారీ' చెప్పి, తన సీట్లోకి పోయి కూర్చున్నాడు.

భాస్కర్ గొంతు సవరించుకున్నాడు. "చూడండి- మై డియర్ స్టూడెంట్స్! చదువుకోవడంతోబాటు అల్లరి చెయ్యడం మీ హక్కు. దాన్నెవరూ కాదనలేరు. వయసులో ఉన్న కుర్రవాళ్లు గోల చెయ్యకపోతే అందం ఉండదు. అయితే ఆ అల్లరి కారణంగా ఇతరులు నొచ్చుకోకూడదు. ముఖ్యంగా మనందరికి తండ్రి సమానులైన మాధవాచారిగారి



లాంటివారు. మీలో ఆటలు ఎంతమంది ఆడుతున్నారు? డ్రామాలు ఎంతమంది వేస్తున్నారు? ఆటల్లో ఎంత అల్లరుంది? డ్రామాల్లో ఎంత అల్లరుంది? ప్రత్యర్థులని, ఇతర ఆటగాళ్ళని ఓడించడానికి గాని, ఇతర నటులకంటే మనం అందరి దృష్టినీ ఆకర్షించడానిగ్గాని, ఎన్ని తమాషాలు చేయాలి? ఎన్ని వింత పోకడలు పోవాలి? అంతెందుకు- సరదాగానూ, ఆనందంగానూ గడపడానికి, ఎన్నో చక్కటి విషయాలు తెలుసుకోవడానికి మీకు తెలుగు క్లాసుని మించిన అనువైన చోటెక్కడుంది? మాధవాచార్యులు గారిని గురించి మీలో ఎంతమందికి తెలుసు అసలు? పెద్దవారు కాబట్టి, సంప్రదాయ బద్ధంగా ఆయన వేసుకొస్తున్న దుస్తుల్నీ, తలకట్టునీ ఎగతాళి చేసి రాక్షసానందం పొందుతున్నారే గాని, ఆ అవతారం లోపల ఓ పుంభావ సరస్వతి ఉందని మీలో ఒక్కరికయినా తెలుసా? మీరు మీ పాఠాలని పక్కన పెట్టండి- మరేం ఫరవాలేదు. చెప్పండి- మీకే రసం కావాలి? హాస్యం కావాలా? సరసం కావాలా? రౌద్రం కావాలా? చెప్పండి. ఏ రసం గురించయినా అనర్గళంగా మాట్లాడి మిమ్మల్ని ఆనందింపజేసే శక్తి ఉంది ఆయన్లో. కాలేజీ ఆవరణ దాటి బయటకెళ్తే, అక్షరం ముక్క వచ్చిన ఎవర్నడిగినా చెబ్తారు ఆయన గొప్పదనం గురించి.

మీకు విజ్ఞానంతో బాటు, మానసిక వికాసాన్ని కూడా కలిగించడానికే మాకు కాలేజీవాళ్లు జీతాలు ఇస్తున్నారు. మమ్మల్ని మీ కోసం ఉపయోగించుకోండి. మీ ఎదుగుదల కోసం, మీ వికాసం కోసం, మీ ఆరోగ్యం కోసం, సమాజంలో మీ గౌరవం కోసం ఉపయోగించుకోండి.

కాలేజీలన్నాక ఎవరో ఒకరో, ఇద్దరో చీడపురుగులు ఉంటూనే ఉంటారు. ఎన్ని రకాలుగా ప్రయత్నించీ వాళ్ళని మంచి దారికి మార్చలేం. కాని వాళ్ళ కారణంగా అందరూ చెడిపోవడాన్ని సహించం. మంచికి మంచి. చెడుకి చెడు" ఆగాడు భాస్కర్ వాచీ చూసుకుంటూ.

బెల్ మోగింది.

"అదుగో బెల్ మోగింది. ఆచార్యులుగారి క్లాసు తర్వాత నా క్లాసు కదా, కాని వారి క్లాసు టైంలో వారి పాఠం జరగలేదు. నేను ఆ టైంని వినియోగించుకున్నాను. కనుక ఈ నా పిరియడ్‌ని ఆచార్యులుగారు తీసుకుంటారు. ఒక్కరు కూడా కదలడానికి వీలు లేదు" అని హెచ్చరించి, మాధవాచార్యులు గారితో, "మీరు మీ క్లాసు తీసుకోండి సార్. నేను ప్రిన్సిపాల్ గారికి చెబ్తానిప్పుడే" అని బయటకు నడిచాడు భాస్కర్.



**పెద్దవారు కాబట్టి, సంప్రదాయ బద్ధంగా ఆయన వేసుకొస్తున్న దుస్తుల్నీ తలకట్టునీ ఎగతాళి చేసి రాక్షసానందం పొందుతున్నారే గాని, ఆ అవతారం లోపల ఓ పుంభావ సరస్వతి ఉందని మీలో ఒక్కరికయినా తెలుసా?**



ప్రిన్సిపాల్ గారి రూముకి వెళ్లడానికి మెట్లెక్కుతూంటే, పోస్ట్‌మెన్ ఎదురై, "సార్! మీకో ఉత్తరం ఉంది" అని ఓ కవర్ అందించాడు.

కవర్ మీద ఫ్రమ్ అడ్రస్సు ఉందేమోనని, అటు ఇటు తిప్పి చూసి కవరు చింపాడు భాస్కర్. 'ఎక్కడ్నుంచబ్బా? ' అనుకుంటూ.

లోపల పొందిగ్గా మడత పెట్టిన గులాబీ రంగు పేపర్ మీద ఆకుపచ్చ అక్షరాలు-పచ్చలు పేర్చినట్లు. భాస్కర్ కనుబొమలు ముడిపడ్డాయి. కళ్ళు చకచక అక్షరాల వెంట పరుగెత్తాయి.

"డియర్ హీరోగారూ!

అందమైన విగ్రహం, ఆకర్షించే కళ్ళు ఉండగానే చాలదు. ఆ కళ్లకు అందమైనవాటిని చూసి ఆనందించే అలవాటూ ఉండాలి. అవునూ మీ బట్టలు మీరే ఉతుక్కుంటారా? మీ వంట కూడా మీరే చేసుకుంటారేమో కదూ? చ్చ్‌చ్చ్... మీకెందుకండీ అంత శ్రమ? సొల్యూషన్ ఏమిటంటారా? రోజూలాగే రేపొద్దున సరిగ్గా ఎనిమిది గంటలకి మీ డాబా గదిముందు బట్టలు ఆరవేసుకుంటూ, మీ చూపుని మాత్రం రోడ్డు మీదకి ఉంచండి సార్. మీ మనసే చెబ్తుంది పరిష్కారం. ఇప్పటికి సెలవు. బైబై.

ఇట్లు

కు-మాం-లి"

అయిష్టంగా నిట్టూర్చాడు భాస్కర్. 'ఏమిటీ పజిల్ నాకూ? నాకే సొల్యూషన్లూ అక్కర్లేదు. మీనింగ్‌లెస్ రాతలూ, పని పాట లేని మాటలూ' అని విసుక్కుంటూ లెటర్‌నీ, కవర్‌నీ ముక్కలుముక్కలుగా చింపి గాలిలోకి ఊదేసి, చక చక మెట్లెక్కేశాడు.

## 3

ఎంత మరచిపోదామన్నా ఆ లెటర్‌లోని మాటలే గుర్తొస్తున్నాయి. ప్రిన్సిపాల్‌తో మాట్లాడుతున్నా, తర్వాత స్టాఫ్ రూంలో ఇతర లెక్చరర్స్‌తో కబుర్లు చెబుతున్నా, సాయంత్రం షటిల్ బాడ్మింటన్ ఆడుతున్నా, తర్వాత రూముకొచ్చాక కూడా... ఆ మాటలే...



బట్టలు విప్పుకొని, తువ్వాలు చుట్టుకుని, బాత్‌రూంలోకి వచ్చాడు. తల స్నానం చేసేస్తే సరి, బ్రెయిన్ ఖాళీ అయిపోతుంది అని పించింది.

షవర్ ఓపెన్ చేసి, షాంపూబాత్ చేశాడు. ఓ అరగంటసేపు తలకి ఉన్న జిడ్డంతా కరిగిపోయింది. కాని తలలోకి దూరిన ఆ మాటలు మాత్రం బయటకు పోవే?!

ఆ రైటింగు, రాసిన విధానం ఎవరో ఆడపిల్ల రాసిన లెటర్‌లా ఉంది.

నిజమే! తన బట్టలు తను ఉతుక్కుంటాడు. తన వంట తను చేసుకుంటాడు. అందులో తనకి ఆనందం వుంది. బాధేం లేదే?

నాన్న చనిపోయాక, చెల్లాయికి పెళ్లిచేసి పంపించేశాక, ఒంటరిగాడికి చాల్లే అని సింగిల్ రూం విత్ అటాచ్‌డ్ బాత్ తీసుకుని, తను హ్యాపీగా ఉంటున్నాడు.

తను ఎలిజిబుల్ బ్యాచిలరే గాని, పెళ్ళి కోసం, పెళ్ళాం కోసం తనేం పరితపించడం లేదే? అసలు పెళ్లంటేనే తనకి ఇష్టం లేదు.





తన ధ్యేయం వీలైనంత కృషి చేసి విజ్ఞానాన్ని సంపాదించడం, వీలైనంత మందికి ఆ జ్ఞానాన్ని పంచడం, అంతే!

మధ్యలో తనకులేని బాధని తనదిగా భావిస్తున్న ఈ 'కుమాంలి' ఎవరూ? పక్కనో పూవు బొమ్మొకటీ!

సిల్లీ - ఐ డోన్ట్ లైక్ ఆల్ దిస్ తమాషా.

రేపొద్దున్న ఎనిమిది గంటలకి బట్టలు ఆరవేసుకుంటూ, చూపుని మాత్రం రోడ్డు మీదుంచాలిట. ఈవిడ గారెవరు నాకు



చెప్పడానికి? అసలు రేపొ ద్దున్న ఆరు గంటలకే బట్టలు ఉతికేసుకుని, ఎనిమిది గంటలకు రూములో తలుపులు బిగించుక్కూర్చుంటా. బోడి సలహా ఇచ్చిన పూబోడి తిక్క కుదుర్తుంది అప్పుడు.

మనసు తేలిక అయినట్లయింది భాస్కర్‌కి.

టేప్ రికార్డర్‌లో జిక్కీ పాడిన పాటల కేసెట్ పెట్టి ఆన్ చేసి, ఆరుబయట వెన్నెల్లో పడక్కుర్చీలో వాలాడు భాస్కర్.

'పులకించని మది పులకించూ...' వింటూండగా, సన్నజాజి పందిరిమీదుగా వీచిన మలయ మారుతం పూలచెండుతో నిమిరినట్లు భాస్కర్ ఛాతీని ఓ సారి స్పృశించి ముందుకు సాగింది.

మామిడి చెట్టు మీంచి ఏవో జాతి పక్షులు అందంగా కూస్తూ, ఆకాశంలోకి లేచాయి.

మబ్బు చాటునుంచి, చందమామ కొద్దికొద్దిగా దాక్కుంటూ, బయట కొచ్చాడు.

భాస్కర్ మనసుని ఎన్నడూ ఎరుగని ఏదో హాయి ఆవహించసాగింది...

* * *

"రేయ్ భాస్కర్! బయటకు రారా"

"భాస్కరొరేయ్! నువ్వో పెద్ద హీరో వనుకుంటున్నావా? బయటకురా. నీ హీరోయిజం దిగిపోద్ది"

"రే..య్ భాస్కర్‌గా, రా బయటకు రా" పెద్ద పెద్ద గావుకేకలు.

పాటలు వింటూ, చల్లగాలిలో ఆరుబయట పడక్కుర్చీలో వాలిన భాస్కర్ తనకు తెలియకుండానే మత్తుగా నిద్రలోకి జారిన వాడల్లా, ఈ కేకలకి ఉలిక్కిపడి మేల్కొన్నాడు.

కేకలు, అరుపులు, ఛాలెంజులూ వినిపిస్తూనే వున్నాయి.

కుర్చీ చేతులమీద తన చేతులదిమి, గభాలున లేచాడు భాస్కర్. ఇంతలో ఓ రాయి వచ్చి అతన్ని రాసుకుంటూ పక్కగా పడింది. కొంచెం పక్కగా వచ్చుంటే అది భాస్కర్ కణతలకు తగిలేది. మరుక్షణం మరో రాయొచ్చి రూము తలుపులకి తగిలింది.

"భాస్కర్! బయటకు రారరేయ్. లేకపోతే రాళ్ల వర్షం కురిపిస్తాం" మళ్లీ బెదిరింపు కేకలు.

భాస్కర్ జాగ్రత్తగా గోడవారగా నడుస్తూ, చప్పుడు కాకుండా రూములోకి పోయి, ప్యాంటు షర్టు తొడుక్కున్నాడు గబగబా. ఆ తర్వాత తను ప్రయాణాల్లో ఉపయోగించే సన్నపాటి గజం పొడుగు ఇనుపగొలుసుని బయటకు కనబడకుండా మొలలో దోపుకున్నాడు. ఒక టవల్‌ని రెండు చేతుల్తో పట్టుకున్నాడు. రాళ్లు పడ్తే అడ్డుపెట్టుకోవడానికి. రూము బయటకొచ్చి పిట్టగోడ దగ్గర నిల్చుని, "ఎవర్రా అదీ? " అని హూంకరించాడు, తన సహజ గంభీర కంఠంతో ధైర్యంగా.

జవాబు లేదు.

రోడ్డుమీద చెట్ల నీడల్లో నలుగురైదుగురు శాల్తీలు మాత్రం తిరుగాడుతున్నారు. ఇంటి గేటుకి దగ్గరగా ఉన్న వాళ్లల్లా, వెనకడుగులు వేస్తూ ఎదురింటి గోడపక్క నీడలోకి నడుస్తున్నారు. కొద్దిగా బెదిరినట్లున్నారని గ్రహించాడు భాస్కర్.

చెప్పులు టకటక మనిపిస్తూ, ధైర్యంగా నిటారుగా కమాండర్‌లా నడుస్తూ మెట్లు దిగసాగాడు.

భాస్కర్ గొంతు, అడుగుల చప్పుడూ వినబడింది కాబోలు- ఇంటాయన బయట గదిలో లైటు వేసి, గ్రిల్ దగ్గరకొచ్చి నిల్చున్నాడు.

భాస్కర్ మెట్లు దిగాడు.

"భాస్కర్ గారూ... ఎవరండీ వాళ్లు,



అలా గొడవ చేస్తున్నారేమిటండీ బాబూ? "
అన్నాడు భయం భయంగా.

"అదే చూసొస్తానండి" అంటూ ముందడుగు వేశాడు భాస్కర్.

"ఎవరో రౌడీ మూకలా ఉన్నారండీ బాబూ... వెళ్లకండి ప్రమాదం. పోలీసులకు ఫోను చేస్తేనో..." అంటున్నాడాయన.

ఏమీ అవసరం లేదన్నట్లుగా చెయ్యి ఊపుతూ, కాంపౌండు గేటు తలుపులు తీసుకుని బయటకు నడిచి, "ఎవరయ్యా మీరు-సరే బయటకొచ్చానూ, ఏంకావాలి మీకు చెప్పండి? " అన్నాడు రోడ్డవతల ఉన్న వాళ్ల నుద్దేశించి.

అట్నుంచి సమాధానం లేదు.

అటు చివరనున్నవాడు వెనక్కి తిరిగి గబగబా అడుగులేస్తూ నడిచి, పరుగు లంకించుకున్నాడు.

మరొకడు, "పోదాం పదండ్రా గొడవెందుకూ? " అంటూ గొణుగుతున్నాడు భయంగా- దూరంగా జరుగుతూ.

చీకట్లో ఉన్నవాళ్లని పరికించి చూశాడు భాస్కర్, "అరె, అన్ని అరుపులు అరచి, తీరా నేనొస్తే మాట్లాడరేం? " అంటూ. వాళ్ల తలలకి మంకీ క్యాప్‌లున్నట్లు గమనించాడు. అప్పుడర్థమైంది- కచ్చితంగా వాళ్లు తను గుర్తుపట్టగలిగే వ్యక్తులే అయివుంటారని. బహుశా తన కాలేజీ స్టూడెంట్లయి వుండొచ్చు ఒకళ్లిద్దరు బయట రౌడీలు కూడా ఉండొచ్చు

"ఏంటయ్యా... మొహమాటమా, సిగ్గా! మాట్లాడరేం? పైగా వేసవికాలంలో ఆ మంకీ టోపీలెందుకు? మొహాలు కనబడకుండానా? అంత పిరికి గొడ్లా మీరు? " అంటూ హేళనగా నవ్వాడు భాస్కర్.

తలకి వున్న మంకీ క్యాప్‌ని తొలగించుకుంటూ పౌరుషంగా ముందుకొస్తూ, అన్నాడొక యువకుడు- "పిరికి గొడ్డులమేం కాదు సార్! పౌరుషం ఉన్నవాళ్లమే. అందుకనే మీతో తేల్చుకోవడానికొచ్చాం. అసలు నన్ను అవమానపరచడానికి మీకు అధికారం ఎవరిచ్చారని? "

అతని ముఖంలోకి గుచ్చి గుచ్చి చూశాడు భాస్కర్.

ఉదయం మాధవాచార్యులుగారి క్లాసులో వెనక బెంచీల్లో కూర్చుని అల్లరి చెయ్యడానికి రాకెట్ పేల్చబోయి, తనచేత శిక్షించబడ్డ కుర్రాడు.

అతని ముఖం జేవురించుకునుంది.

చెంపలు అదురుతున్నాయి.

ఎందుకో జాలి వేసింది భాస్కర్‌కి అతన్ని చూస్తుంటే.

చివాట్లు తిని, ఏడుస్తూ ఎదురు తిరిగిన చిన్న తమ్ముడిలా కనిపిస్తున్నాడతను.

అయితే గ్యాంగుని తెచ్చుకున్నాడే? ! వాళ్ల సంగతి కూడా దృష్టిలో పెట్టుకోవాలి. సాత్వికంగా మాట్లాడితే, వాళ్లు రెచ్చిపోవచ్చు

గొంతులో తీవ్రత తగ్గకుండా అన్నాడు భాస్కర్, "ఓకే మిస్టర్! నువ్వు నా స్టూడెంటువి, నీ బాధ అర్థమయ్యింది. ఈ రోజు

## తెలివైనవాళ్లు

ఓ మిత్రుడు త్రిపురనేని రామస్వామి చౌదరితో మాట్లాడుతూ '..ఇటీవల తంజావూరు వెళ్లానయ్యా! అక్కడివాళ్లు చాలా తెలివైనవాళ్లు.. చక్కగా అంతా కలిసిమెలిసి ఉంటున్నారు.' అన్నాడు.

'నువ్వు చెప్పిందాన్ని బట్టి వాళ్లు తెలివైనవాళ్లని అన్పించడంలేదు. కలిసిమెలిసి ఉంటున్నారంటున్నావ్.. అలాంటప్పుడు వాళ్లు తెలివైన వాళ్లెలా అవుతారు? తెలివైనవారు ఎప్పుడూ కలిసిమెలిసి ఉండరు. కావాలంటే రామాయణం చూడు.. భారతం చూడు.. నీకే తెలుస్తుంది' అన్నారు త్రిపురనేని సాలోచనగా.





కాకపోతే రేపైనా మనిద్దరం ఒక సెటిల్‌మెంటుకి వద్దాం. ఈ ముసుగు వీరులెవరయ్యా బాబూ... కిరాయిరౌడీలా? వాడెవడు అలా ఉత్తరకుమారుడిలా పారిపోయాడు? ఇప్పుడే మిటి, కొడతారా వీళ్లు నన్ను? అయ్ బాబోయ్, భయమేస్తోందయ్యా"

"వెటకారం చెయ్యక్కర్లేదు సార్... మేమేం మిమ్మల్ని కొట్టడానికేం రాలేదు" అన్నాడు స్టూడెంటు కుర్రాడు.

"మరింకెందుకొచ్చారు? మంచి నిద్ర చెడ గొట్టడానికా? భలేవాళ్లయ్యా బాబూ మీరు?" నవ్వాడు భాస్కర్.

సర్రుమని కాలేజీ స్టూడెంటు వెనక నుంచి ముందుకొచ్చాడొక ముసుగు మనిషి, భాస్కర్‌తో, "ఏం బే జోకులేస్తున్నావు? ఒక పచి కాట్ ఇచ్చిన్నంటె మొగం చెంబైపోద్ది" అంటూ చెయ్యి విసిరాడు. "అరె, ఒద్దు" అంటూ స్టూడెంటు కుర్రాడు వాడిని అడ్డుకో బోయాడు గాని, రెండో చేత్తో ఆ కుర్రాణ్ణి పక్కకు నెట్టేశాడు వాడు.

భాస్కర్ ఒడుపుగా ఆ రౌడీ చేతిని అందుకుని, మెలితిప్పి, వాడి ముక్కుమీద తన పిడికిలి బిగించి బలంగా గుద్దాడు. కళ్లు బైర్లు కమ్మాయి వాడికి. వాడి కాలర్ పట్టుకుని దగ్గరకు లాక్కుని, వాడి పాదాన్ని తన పాదంతో అదిమిపెట్టి, వాడి గడ్డంమీద మోచేతి ఎముకతో పొడిచాడు భాస్కర్.

అంతే! వాడు అదుపుతప్పి వెల్లకిలా పడ్డాడు రోడ్డుమీద. వాడి తల నేలకి బలంగా తగిలింది. "అమ్మా" అన్నాడు వాడు రెండు చేతుల్తో తల పట్టుకుని.

వాడి గుండెల మీద కాలు తొక్కిపెట్టి, మిగిలిన ముసుగు మనుషుల్తో, "ఇంకెవర్రా- రండి" అని హూంకరించాడు. వాళ్లు భయంగా పరుగు లంకించుకున్నారు.

కింద పడ్డవాడి గుండెలమీంచి కాలు తీసి, "నువ్వు కూడా పో, రాస్కెల్. ఇంకెప్పుడన్నా ఈ చుట్టుపక్కల కనిపించినా, మా కాలేజీ కుర్రాళ్లతో కనిపించినా, వాళ్ల జోలికొచ్చినా ఎముకలు విరగ్గొడతాను, ఇడియట్" అని ఒక్క తన్ను తన్నాడు వాణ్ణి. వాడు ప్రయత్నం మీదలేచి స్టూడెంట్ కుర్రాడితో, "పద పోదాం - రేపు సత్యం అన్నకు జెబ్దాం" అన్నాడు.

"వాడి తాతకు చెప్పు- పోరా స్కాండ్రల్" అని మరో తన్ను తన్నాడు వాణ్ణి భాస్కర్. స్టూడెంట్ కుర్రవాడి చెయ్యి అందుకుని, "నువ్వుండు" అంటూ.

ఆ రౌడీ తూలుకుంటూ, కుంటుకుంటూ పారిపోయాడు.

స్టూడెంట్ కుర్రాడితో, "నువ్వింట్లోకి పద" అంటూ మెట్ల మీదుగా తన రూములోకి తీసుకొచ్చాడు భాస్కర్, భుజంమీద చేయి వేసి.

భాస్కర్ ధైర్యసాహసాలకు అబ్బురపడుతున్నాడా కుర్రాడు. ఇంటాయన సంగతి సరేసరి. అర్ధరాత్రివేళ- కొట్టడానికి కొంప మీదికొచ్చిన నలుగురైదుగురు రౌడీలని ఎదుర్కోవడానికి ఓ కాలేజి లెక్చరరు ఒంటరిగా జబ్బలు ఊపుకుంటూ వెళ్లాడంటే... వెళ్లిన వాడు వాళ్లని తరిమికొట్టి విజేతగా తిరిగి వస్తున్నాడంటే... కల కాదుకదా అనిపిస్తోంది ఆయనకి.

'కొట్టడానికొచ్చిన తనని, భుజంమీద చెయ్యేసి మరీ తన రూములోకి భాస్కర్ ఎందుకు తీసుకెళ్తున్నాడో? కొంపదీసి తలుపులు వేసి తోమడు కదా? పోలీసులకి ఫోనుచేసి అరెస్టు చేయించడు కదా?' ఆలోచిస్తూ భయపడుతున్నాడు స్టూడెంటు.

"నీ పేరేంటి తమ్ముడూ?" అనడిగాడు భాస్కర్, మంచంమీద కూర్చుంటూ, ఆ కుర్రాడికి గాడ్రెజ్ ఫోల్డింగ్ ఛెయిర్ చూపిస్తూ.

"నేతాజీ సర్". ఛెయిర్ వాల్చుకుని కూర్చుంటూ చెప్పాడు కుర్రాడు.




# శుభాకాంక్షలతో...

# భద్రాద్రి కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ లిమిటెడ్

రిజిష్టర్ నెం. 1108/T.E.

2-2-57, గాంధీచౌక్, ఖమ్మం-507 003, ఫోన్స్: 220005, 233903

*బ్రాంచిలు:* గాంధీచౌక్, మయూరి సెంటర్ మరియు భద్రాచలం

| | | పాత వడ్డీ రేట్లు | సవరించిన వడ్డీ రేట్లు |
|---|---|---|---|
| 30 రోజుల నుండి | 90 రోజుల వరకు | 6.0 | 6.5 |
| 91 రోజుల నుండి | 180 రోజుల వరకు | 6.5 | 7.0 |
| 181 రోజుల నుండి | సంవత్సరంలోపు | 7.5 | 8.0 |
| 1 సంవత్సరాల నుండి | 3 సంవత్సరాలలోపు | 8.0 | 9.0 |
| 3 సంవత్సరాల నుండి | 5 సంవత్సరాలలోపు | 8.5 | 9.5 |
| 5 సంవత్సరముల మరియు ఆపైన | | 9.0 | 10.0 |

"సీనియర్ సిటిజన్స్" కు (60 సం॥ల వయసు దాటిన వారికి) 1 సం॥ ఆపైన డిపాజిట్ చేసిన వారికి 1 శాతం వడ్డీ అదనం.

**పాలకవర్గ సభ్యులు**

**చెరుకూరి కృష్ణమూర్తి**, చైర్మన్

**రేఖల భాస్కర్**
వైస్ చైర్మన్

**వేములపల్లి వెంకటేశ్వరరావు**
వైస్ చైర్మన్

**దేవత రాజారావు**
డైరెక్టర్

**గుర్రం ఉమామహేశ్వరరావు**
డైరెక్టర్

**పసుమర్తి మధుసూదనరావు**
డైరెక్టర్

**అర్వపల్లి నిరంజన్**
డైరెక్టర్

**మద్ది వెంకట లక్ష్మీనర్సింహారావు**
డైరెక్టర్

**సన్నె ఉదయ్ ప్రతాప్**
డైరెక్టర్

**వేల్పూరి సాంబశివరావు**
డైరెక్టర్

**యాదా కృష్ణమూర్తి**
డైరెక్టర్

**ఛీఫ్ ఎగ్జిక్యూటివ్ ఆఫీసర్ మరియు సిబ్బంది**
భద్రాద్రి కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్ లిమిటెడ్



కనుబొమలు ఎగరవేస్తూ మెచ్చుకోలుగా అన్నాడు భాస్కర్, "నేతాజీయా? ఎంత చక్కటి పేరయ్యా. సుభాస్‌చంద్రబోస్‌ని స్వాతంత్రం రోజుల్లో అలా అభిమానంగా, ఆరాధనగా పిలుచుకునేవాళ్లు దేశభక్తులంతా"

"మా తాతగారు బోస్ స్థాపించిన ఆజాద్ హింద్ ఫౌజ్‌లో పనిచేశార్ట సార్. ఆయనే ఆ పేరు పెట్టించారు నాకు"

"మరిదేమిటయ్యా బాబూ... అంత గొప్ప నాయకుడి పేరు పెట్టుకుని, దౌర్జన్యం చేసే వాళ్లమీద, దుర్మార్గులమీద చూపించాల్సిన ప్రతాపాన్ని ఇలా మాలాంటి పంతుళ్ల మీద చూపిస్తున్నావు. పైగా పోకిరీలు, రౌడీలు, రెఫ్రాఫ్ గాళ్లూనా నీ సైన్యం? సుభాష్ బాబు సైన్యంలో ఎలాంటి వాళ్లుండేవారో తెలుసా నీకు? వాళ్లకు ప్రాణాలంటే తల వెంట్రుకలతో సమానం. అధర్మం, అన్యాయం, దోపిడీ, దౌర్జన్యాలు పునాదిగా గల సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా పోరాడేవాళ్లు వారు."

"ఆ రోజులు వేరు సార్... ఇప్పుడు తప్పు మాదయినా, ఎవరైనా మందలించినప్పుడు ఊరుకొంటే తక్కినవాళ్లంతా ఏడిపిస్తారు"

"తప్పు మనదైనప్పుడు ఒప్పుకోవడానికి ఎంతో ధైర్యం కావాలయ్యా. గొప్ప మనసు కావాలయ్యా. ఇన్‌స్టెంట్‌గా కాకపోయినా ఆ ధైర్యం, మనసు ఉన్నవాడికి అందరూ జేజేలు పలికేరోజు తప్పక వస్తుంది. సరే, వదిలెయ్, ఇంతకీ భోజనం చేశావా నువ్వు?"

"చేశాను సార్" ప్రయత్నపూర్వకంగా తల ఊపుతున్నాడుగానీ, అతను భోజనం చెయ్యలేదని గ్రహించాడు భాస్కర్.

"లే... భోంచేద్దాం" అన్నాడు భాస్కర్ తను లేస్తూ.

"లేదు సర్... నేను నిజంగానే భోంచేశాను" అతని ముఖంలోని నీరసమే చెబ్తోంది, అతను అబద్ధం చెబుతున్నాడని.

"సర్లే, చేస్తే చేశావులె. నాకు కంపెనీ ఇద్దువుగాని. నేను దొండకాయ వేపుడు అద్భుతంగా చేస్తాను నేతాజీ. వంట చేసేసి ఓ గంట విశ్రాంతి తీసుకుని భోంచేద్దామనుకుని, అలా ఆరుబయట పడక్కుర్చీలో వాలాను. చల్లగాలికి నిద్ర పట్టేసింది. నీ పుణ్యమా అని మెలకువ వచ్చింది. లేకపోతే తెల్లారే దాకా మెలకువ వచ్చేది కాదూ, పొద్దున్నే వచ్చే మా పనిపిల్ల నేచేసిన దొండకాయ వేపుడు నా కళ్లెదుటే ఎగరేసుకుపోయేది. తీసుకుపొమ్మనలేక, ఉంచమనలేక చాలా ఇబ్బంది పడేవాణ్ణి. శిష్యుడంటే నీలా ఉండాలయ్యా... ఎ శిష్యా ఈజ్ ఇన్ నీడ్ ఈజ్ ఎ మనుష్య ఇన్‌డీడ్ కదూ?" అంటూ నవ్వుతూ రెండు ప్లేట్లలో తను వండినవి వడ్డించసాగాడు భాస్కర్.

"మీరు కూర్చోండి సార్... నేను వడ్డించేస్తాను" బిడియపడ్తూనే లేచాడు నేతాజీ.

"అమ్మా... ఎంతాశ? వడ్డించే అవకాశం దొరికితే నా దొండకాయ వేపుడు నీ పళ్లెంలో ఎక్కువ వడ్డించేసుకోవచ్చునా? అదేం కుదర్దు..." అంటూ ఎడంచేత్తో తన భుజం మీద చెయ్యి ఉంచి వత్తి, కుర్చీలో కూర్చోబెడ్తూ, కుడిచేత్తో ప్లేట్ భాస్కర్‌కి అందిస్తూంటే నేతాజీ కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

చేతుల్తో ముఖాన్ని కప్పుకుని, దుఃఖాన్ని ఆపుకోలేక బావురుమన్నాడు.

చేతిలోని ప్లేట్‌ని టేబిల్‌మీదుంచి, స్టూలుని నేతాజీ కుర్చీ దగ్గరగా జరుపుకుని, అతని భుజాల చుట్టూరా చేయివేసి,"ఏంటిది నేతాజీ... అబ్బే, నేతాజీ అంటే ఎలా ఉండాలి? ఉక్కుగుండె. బ్రిటిష్ సైన్యంలో వీరాధివీరులుగా పేరొందిన వాళ్లు, పరమ కర్కోటకులుగా ఖ్యాతి పొందినవాళ్లూ సైతం నేతాజీ పేరు చెబ్తే పంట్లాం తడుపుకునే వారు. నువ్వూ అంతటి ధైర్యవంతుడివి కావాలని భావించి మీ తాతగారు నీకు ఆ



# తెలంగాణాలో ఏకైక Stroke Unit (బ్రెయిన్ అటాక్)
# న్యూరో ఫిజీషియన్... డాక్టర్ మధుసూదన ప్రసాద్

మెదడు, వెన్నుపాము, నరముల చికిత్సలో 7సం॥ల అనుభవంతో (Manipal Osmania Niloufer, M.G.M) హాస్పిటల్స్‌లో వైద్య సేవలు అందించి ప్రస్తుతం వరంగల్‌లో అత్యుత్తమ మధున్యూరో కేర్ ద్వారా ఉత్తర తెలంగాణా ప్రజలకు అత్యుత్తమ సేవలందిస్తున్న ప్రముఖ న్యూరో ఫిజీషియన్ డా॥ మధుసూదన ప్రసాద్ M.D. D.M (న్యూరో ఫిజీషియన్) పాఠకులకు కొన్ని జాగ్రత్తలు తెలియజేస్తున్నారు.


డా॥ జి. మధుసూదన ప్రసాద్
యం.డి. డి.యం.(న్యూరో ఫిజీషియన్)

మెదడులో రక్త ప్రసరణ అకస్మాత్తుగా తగ్గడం వలన లేకా రక్త నాళాలు చిట్లడం వలన పక్షవాతం (స్ట్రోక్, బ్రెయిన్ అటాక్) వస్తుంది. అకస్మాత్తుగా మాట తడబడడం, శరీర భాగాలు కాలు, చేయి పని చేయకపోవడం, తిమ్మిరి ఎక్కడం, మొద్దు బారి పోవడం, తల తిరగడం, వంటి లక్షణాలు ఉన్నవారు ఏమాత్రం నిర్లక్ష్యం చేయకుండా అత్యవసరంగా న్యూరో ఫిజీషియన్స్‌ను సంప్రదించి తగు వైద్యం తీసుకోవడం తప్పనిసరి. కొన్ని సందర్భాలలో ఈ లక్షణాలను నిర్లక్ష్యం చేసి అంగవైకల్యం, మరణాలు కూడా కోరి తెచ్చుకుంటారు.

సాధారణంగా ఎక్కువసార్లు ప్రజలు గుండె జబ్బుపై ఉండే అవగాహన బ్రెయిన్ అటాక్ పై లేదు. దీనికి అవగాహన లేకపోవడం ఎక్కువ మరణాలు అంగవైకల్యం సంభవిస్తాయి.

డయాబెటిస్, అధిక రక్తప్రసరణ, ఆల్కహాల్ సేవించడం, స్మోకింగ్ ఇవన్నీ బ్రెయిన్ అటాక్ రావడానికి ముఖ్య కారణాలు.

అందువలన ఆల్కాహాల్, పొగ త్రాగడం ఆపివేయాలి. షుగర్, బిపి ఎప్పటికప్పుడు కంట్రోల్ చేసుకోవాలి. సాధారణంగా వచ్చే మెదడు జబ్బులలో ఫిట్స్ (Epilepsy) ఒకటి. మెదడులోని కంతులు, మచ్చలు (పి.బి., పురుగు కంతులు) వలన ఎక్కువగా వస్తుంది. దీనికి రెండు సంవత్సరములు మూడు సంవత్సరముల వరకు సక్రమంగా క్రమం తప్పకుండా మందులు తీసుకుంటే ఈ వ్యాధిని నివారించవచ్చును. కాని అవగాహన రాహిత్యం వలన , మూఢనమ్మకాల వలన సరైన సమయంలో డాక్టర్లను సంప్రదించక, సక్రమంగా మందులు వాడక ఈ వ్యాధితో చాల సంవత్సరములుగా బాధ పడుతున్నవారు నేటికి కూడా ఉన్నారు.

**తలనొప్పి:** తలనొప్పి అనేది చాలా సులువుగా తీసుకుంటాము. కాని కొన్ని సందర్భాలలో సాధారణ వ్యాధుల నుండి ప్రమాదకరమైన వ్యాధులకు (మెదడు కంతుల, రక్తస్రావం) కూడా లక్షణంగా కనిపిస్తుంది. అందువలన తలనొప్పి కదా అని నిర్లక్ష్యం చేయకుండా న్యూరో ఫిజీషియన్ సంప్రదించవలెను.

వెన్నుపూసల మధ్య ఉండే డిస్క్‌లు తొలగి, వెన్ను నరాలను ఒత్తిడి చేయడం వలన మెడ నొప్పి, నడుము నొప్పి సంభవిస్తాయి. ఆ ఒత్తిడిని బట్టి చికిత్స సరైన సమయంలో చేయడంద్వారా ఆ వ్యాధిని నివారించవచ్చును.

**షుగరు:** ఆల్కహాలు సేవించే వారికి, షుగర్ జబ్బు చేసిన వారికి, న్యూరోపతి అనే వ్యాధి రావడానికి అవకాశం కలదు. దానివలన కాళ్ళు, చేతులలో మంటలు, తిమ్మిర్లు పుట్టడం, పట్టు తగ్గిపోవడం వంటి లక్షణాలు కనిపిస్తాయి.

ఈ లక్షణాలు ఉన్నవారు ఆ అలవాటుకు దూరంగా ఉండి సక్రమంగా మందులు వాడి రోగాలను దూరం చేసుకోగలరు.

మరిన్ని న్యూరో సమస్యల పరిష్కారం కోసం సంప్రదించండి.

**డా॥ జి. మధుసూదన ప్రసాద్,**
యం.డి. డి.యం.(న్యూరో ఫిజీషియన్)
మెదడు, వెన్నుపాము, నరముల వైద్యనిపుణులు

## మధు న్యూరో కేర్

II బస్‌డిపో ఎదురుగా, విజయటాకీస్ రోడ్, హన్మకొండ.
**ఫోన్: 2540213, సెల్: 9390112596**

# సంతానం లేని దంపతులకు
# శైలశ్రీ సంతాన సాఫల్య కేంద్రం ఒక గొప్ప వరం

డా॥ వి. శైలశ్రీ యం.డి., డి.జి.ఓ. సంతాన సాఫల్య వైద్య నిపుణులు గారు, సంతానం కలుగకపోవడానికి గల కారణాలు వివరిస్తూ ఇలా చెప్పారు సాధారణంగా గర్భం అనేది వివాహం తర్వాత 80% 1 సం॥ లోపు వస్తుంది. ఒక సం॥లో గర్భం రాని యెడల అటువంటి దంపతులు సంతాన సాఫల్య వైద్య నిపుణులను సంప్రదించవలెను.

సంతాన లేమికి స్త్రీలలోని లోపాలే కారణం అనేది అపోహ. దీనికి పురుషులలో ఉండే లోపాలు కూడా 3వ వంతు కారణం. 10% వరకు కారణాలు తెలియవు.


డా॥ వి.శైలశ్రీ, యం.డి., డి.జి.ఒ.
సంతాన సాఫల్య వైద్య నిపుణులు
శైలశ్రీ సంతాన సాఫల్య కేంద్రం

**సంతాన లేమికి స్త్రీ లలో ప్రధాన కారణం:**

- అండ విడుదల కాకపోవడం, హార్మోను సమతుల్యంగా లేనందువలన, (స్థూలకాయం) ఒబిసిటీ మరియు పాలిసిస్టిక్ ఒవేరియస్ సిండ్రోమ్ (అండాశయములలో నీటి బుడగల వంటివి రావడం) థైరాయిడ్ లోపం, ప్రొలాక్టిన్ హార్మోను లోపం వలన ఇటువంటి వారిలో అండం విడుదల సరిగా ఉండదు. ఇటువంటివారికి ఋతుక్రమ సమస్యలు కూడా ఉంటాయి. దీనికి రక్తపరీక్షలు, హార్మోన్ల పరీక్షలు మరియు స్కానింగ్ చేయించుకొని దానికి సరియైన చికిత్స పొందాలి.
- ఫైబ్రాయిడ్ (గర్భసంచి కంతులు) ఎండోమెట్రియోసిస్, గర్భసంచి లోపాలు, గర్భసంచి మరియు అండ నాళాలకు టి.బి. ఉన్నా ఇన్‌ఫెక్షన్ వంటివున్నా, అండ నాళాలు మూసుకుపోవడం వలన. ఈ కారణాల వలన గర్భం రాదు
- స్కానింగ్, లాపరోస్కోపి, ఎండోమెట్రియల్ బయాప్సి, హిస్టరోస్కోపి ద్వారా తెలుసుకోవచ్చు. వీటి సరియైన చికిత్స (శస్త్రచికిత్స, మందులు) చేయించుకుంటే గర్భం వచ్చే అవకాశము ఉంటుంది.

మగవారు సంతానం లేనివారిలో వీర్యకణముల పరీక్ష అనేది చాలా ముఖ్యమైన పరీక్ష. మామూలుగా 60 మిలియన్స్ నుండి 120 మిలియన్స్ వరకు ఉంటాయి.

- 20 మిలియన కంటే తక్కువగా ఉంటే ఒలిగోస్పెర్మియా అంటారు. ఆల్కహాలు, పొగత్రాగేవారిలో, వెంకోసిల్ ఉన్నా డ్రైవర్స్‌లో ఎక్కువగా ఈ కారణం కనిపిస్తుంది.
- అసలు వీర్యకణాలు లేకపోవడం (అజూస్పెర్మియా): జన్యుపరమైన లోపాలు ఉన్నవారికి మరియు వారికోసిల్ (Varicocele) టి.బి. ఉన్నా ఇలా ఉంటుంది. వీరి టెస్టికులార్ బయాప్సి, మరియు క్రోమోజోమల్ అనాలిసిస్ చేయించుకోవాల్సి వస్తుంది.
- వీర్యకణాల లోపం ఉండటం. (అస్థినోస్పెర్మియా)

పైన కారణాలు అన్నింటికీ సరియైన చికిత్సలు చేయించుకొంటే సంతానభాగ్యం కలిగే అవకాశం ఉంటుంది.

- మొదట అండము విడుదల కావడానికి (Ovulation Induction) మందులు వాడుకోవాలి. 3-6 నెలల వరకు వాడాల్సి వస్తుంది.
- అప్పటికీ రాకపోతే ఐయుఐ (వీర్యకణాలు గర్భాశయములోనికి ఎక్కించుట). ఇది కూడా 3 సార్లు వరకు చేయించుకోవచ్చు.
- అప్పటికీ కానియెడల, ఐవిఎఫ్ (టెస్ట్‌ట్యూబ్ బేబి) అండాలను సేకరించి వీర్యకణాలతో ఫలదీకరణ చేసి గర్భాశయంలోనికి ప్రవేశపెట్టడం.
- **ఐసిఎస్ఐ:** అతితక్కువ స్పెర్మ్ కౌంట్ ఉన్నవారికి టెస్టిస్ లోపల వీర్యకణాలను తీసి అండంలోకి పంపడం.

(పైన చెప్పిన చికిత్సల వలన సంతానం కలిగే అవకాశం వుంటుంది.)

సంతానలేమితో బాధపడుతున్న దంపతులు సరియైన అవగాహన కలిగి నిరుత్సాహపడకుండా, చికిత్సలు చేయించుకుంటే సంతానం కలగడానికి అవకాశం వుంటుంది.

**సదుపాయములు:** అల్ట్రాసోనోగ్రఫీ, హార్మోన్ల స్టడీ, ఐయుఐ (వీర్యకణములు శుద్ధి చేసి గర్భాశయములోకి ఎక్కించడం)

**డా॥ వి.శైలశ్రీ,** యం.డి., డి.జి.ఒ.
సంతాన సాఫల్య వైద్య నిపుణులు

## శైలశ్రీ సంతాన సాఫల్య కేంద్రం

C/o. మధున్యూరో కేర్
II బస్‌డిపో ఎదురుగా, విజయటాకీస్ రోడ్, హన్మకొండ.

ADVERTISEMENT



వీరుడి పేరు...” అంటూండగానే భాస్కర్ మాటలను కట్ చేస్తూ, హిస్టీరిక్‌గా అరుస్తూ అన్నాడు నేతాజీ, “దేనికి సార్ ఆ పేరు నాకు? అన్నయ్యలాంటి మీ మీదకు రౌడీలను వదలడానికి, తండ్రిలాంటి మాధవాచార్యులుగారి మీదకు హవ్వాయి జువ్వలు వదలడానికీనా?” అదుపు తప్పి వెక్కుతున్నాడతను.

నేతాజీ పశ్చాత్తాపంతో ఎమోషనల్‌గా ఫీలవుతున్నాడని గ్రహించాడు భాస్కర్.

“చూడమ్మా నేతాజీ... తప్పు చెయ్యని వాడు ఈ భూప్రపంచంలో ఉండడు. ఉంటే వాడు మనిషి కాడు. మన జాతిపిత మహాత్ముడు కూడా చిన్నతనంలోనూ, వయసులోనూ అనేక తప్పులు చేశానని ఆత్మకథలో రాసుకున్నాడు. అంతెందుకు- ఇంత సంయమనంతో మాట్లాడుతోన్న నేను జీవితాన్ని అర్థం చేసుకోక ఓ స్టేజిలో అప్రయోజకుడిలా మారిపోయి, ఆత్మహత్య చేసుకుందామని రెడీ అయిపోయాను తెలుసా?”

చటుక్కున ఆశ్చర్యంగా, కంగారుగా తలెత్తాడు నేతాజీ.

ధైర్యం వచ్చి తాపీగా అన్నాడు నేతాజీ, "సార్... ఓ నిజం చెప్ప మంటారా? " అని.

"హార్నీ!? నిజం చెప్పమనీ, ధైర్యంగా ఉండమనేకదయ్యా మగడా! గత అరగంటనుంచీ నిన్ను సుభాష్ బాబుతోటీ, మహాత్ముడితోటీ పోల్చి పొగిడేస్తున్నది. అంతా విని, నా దొండకాయ వేపుడు తినేసి, ఇప్పుడు మళ్లీ మొదటి కొచ్చి పాతాళభైరవి తోటరా ముళ్లా 'నిజం చెప్పమంటారా, అబద్ధం చెప్పే ఛాన్సుందా' అని ఆప్షన్స్ అడుగుతావా? అన్యాయ మయ్యా..." అమాయకత్వం నటిస్తూ, తల అడ్డంగా ఊపసా గాడు భాస్కర్.



ఆపుకోలేనంతగా నవ్వేశాడు నేతాజీ.

"యు ఆర్ రియల్లీ గ్రేట్, సర్" అన్నాడు సిన్సియర్‌గా.

"అదుగో మళ్లీ... నిజం చెబ్తానని మాటిచ్చి, అబద్ధం చెబ్తావేం? "

"నిజమే చెబ్తున్నాను సర్. నిజం ఒక్కటే చెబ్తున్నాను సర్. మీ ప్లేస్‌లో ఇంకొక రుంటే తనయినా నష్టపోయే వారు, నన్నయినా పోలీసులకి పట్టించే వారు. గురువనిపించుకున్నారు సర్. ఇంకో విషయం సర్. పుట్టి బుద్ధెరిగాక ఆప్యాయంగా నాకు అన్నం పెట్టిన మొట్ట మొదటి వ్యక్తి మీరే సర్..." నేతాజీ గొంతు వణికింది.

ఆశ్చర్యంగా చూశాడు భాస్కర్.

"రియల్లీ సర్... మేం డబ్బున్నవాళ్లమే. మా ఇంట్లో భోజనంలో రెండు మూడు కూరలు, రెండు మూడు చెట్నీలు, పులు

"ఔను! ఇది నిజం. కాబట్టి జరిగినదానికి చింతిస్తూ కూర్చోవడం చేతకాని వాళ్ల పని. మరిచిపో, ఇక దీన్ని ముగిద్దాం" అంటూ నవ్వుతూ అతనికి పళ్లెం అందించి, తన పళ్లెం చేతుల్లోకి తీసుకున్నాడు భాస్కర్.

ఇద్దరూ భోజనం చేసేశాక, నేతాజీ చేతి లోని ఎంగిలి పళ్ళాన్ని బలవంతంగా లాక్కుని, బయట బాత్‌రూం దగ్గర గిన్నెల తోపాటు పడేసి వచ్చాడు భాస్కర్.

చేతులు కడుక్కున్నారిద్దరూ.



సులు, సాంబారు, అప్పడాలు, వడియాలు, పాయసాలు, పులిహోర్లు... అన్నీ... అన్నీ ఉంటాయి సర్... ఒక్క ఆప్యాయంగా వడ్డించే మనసు తప్ప. అన్నీ డైనింగ్ టేబుల్ మీద వంటవాడు సర్ది పెడ్తాడు. ఎవరికి వీలయినప్పుడు వాళ్లు ఒంటరిగా తినడమే. తిన్నారా లేదా అని ఎవరి గురించెవ్వరూ ఆలోచించరు. నన్ను కన్న తల్లి కంటికి, టివి సీరియళ్లు కనిపించినంత క్లియర్‌గా, నా కళ్లనీళ్లు కనిపించవు సార్. అందుకే... అందుకే సార్... నాలో ఎవ రిమీదో కసి. అల్లరో, న్యూసెన్సో చేసి, అందరి దృష్టినీ నావైపు తిప్పుకోవాలనే ధ్యాస! అందుకే క్లాసులో అల్లరి చెయ్యడం, రౌడీలతో తిరగడం, వాళ్లనీ వీళ్లనీ ఏడిపిం చడం, కొట్టడం... ఇల్లాంటి పనులు చేసి ఓ విధమైన రాక్షసానందాన్ని పొందు తుంటాను సర్. అర్ధరాత్రి ఒక్కోసారి ఉలి క్కిపడి నిద్రలో లేచి ఏడుస్తుంటాను సర్. నన్ను నేను తిట్టుకుంటాను సర్..."

భాస్కర్ అతని వీపుమీద రుద్దుతూ, 'నేతాజీ... ఈజీ... ఈజీ... ఫర్‌గెట్ ద పాస్ట్. నౌ ఆన్‌వార్డ్స్- యు ఆర్ ఎ వెరీ గుడ్ బోయ్. నాటోన్లీ ఎ గుడ్‌బోయ్- ఎ గుడ్ లీడర్. మంచి నాయకుడు కావడా నికి అవసరమైన మంచి మంచి బుక్స్ ఇస్తాను. మనస్సు పెట్టి చదువు. ఓకే" అన్నాడు ఉత్సాహపరుస్తూ.

"ఓకె సర్. నౌ ఆన్‌వార్డ్స్... యు ఆర్ మై గాడ్, గైడ్ అండ్ ఫిలాసఫర్, సర్... అయాం వెరీ మచ్ గ్రేట్‌ఫుల్ టు యు, సర్"

"అంతంత పెద్దమాటలొద్దుగానీ ఇంత రాత్రివేళ ఏం వెళ్తావు ఒంటరిగా. ఇక్కడ పడుకో, పొద్దున్నే వెళ్దువుగాని"

"గుడ్ లీడర్ కాదలచున్నవాడికి రాత్రే మిటి, పగలేమిటి, ఒంటరేమిటి, తోడేమిటి సర్?"

"దట్స్ గుడ్...పోయిరా... గుడ్ నైట్"

"గుడ్ నైట్ సర్"

నిటారుగా, ధైర్యంగా, ఆనందంగా మెట్లు దిగి చకచక నడుస్తూ రోడ్డు మీదకు వెళ్లి పోయాడు నేతాజీ.

నేతాజీ వెళ్లినదిక్కే చూస్తున్నాడు భాస్కర్.

ఆ రోజు ట్యాంక్‌బండ్ మీద తనకు బతుకు పాఠం నేర్పిన శారద గుర్తొస్తోంది. ఆ రోజు తనూ నేతాజీలాగే...

ఏమయ్యిందో ఆమె?

పూజకు పనికిరాని పుష్పంగా రాలిపో యిందో...?

మరికొందరు తనలాంటి అభాగ్యులకు బతుకు భాగ్యం కలిగిస్తోందో?

ఛీత్కరించబడుతోందా?

పూజలందుకుంటోందా?

ఏమో? !!!

## 4



ఈ సంవత్సరం కాలేజి యూనియన్ ఇనాగ్యురల్ ఫంక్షన్‌కి హైకోర్టు జడ్జిగారినొక రిని చీఫ్ గెస్ట్‌గా పిలవాలని నిర్ణయించి, అడ్వాన్సుడుగానే వారి అప్పాయింట్‌మెంట్ తీసుకోవడం మంచిదని, ఆ బాధ్యత భాస్క ర్‌మీద పెట్టారు ప్రిన్సిపాల్ గారు.

రెండ్రోజులకు సరిపోయే బట్టలు సూట్‌కేస్‌లో పెట్టుకుని, హైదరాబాద్ ప్రయాణమయ్యాడు భాస్కర్.





పొద్దుటి నుంచీ అకాలవర్షంతో తడిసి ముద్దయిన విజయవాడ బస్టాండు, వరద బాధితుల తాత్కాలిక శిబిరంలా ఉంది. సెలవులు కూడా కలిసిరావడంతో ప్రయాణికుల రద్దీ విపరీతంగా ఉంది.

సింగిల్ టిక్కెట్టే కాబట్టి భాస్కర్ తేలిగ్గానే సంపాదించుకున్నాడు సీటు. స్పెషల్ బస్సులు అంటూ షెడ్డులో తుప్పట్టిపోతున్న డకోటాలన్నింటినీ రోడ్లమీద కొదిలినట్లున్నారు. ఏదయితేనేం... కావేవీ ప్రయాణానికనర్హం. ఒక్కోసారి గరుడాలు, హైటెక్కులు కంటే కూడా అవే బావుండొచ్చు

క్షణాల్లో బస్సు నిండిపోగానే, కంట్రోలర్ వచ్చి కసరగానే డ్రయివరొచ్చి స్టార్ట్‌చేసి, బస్సుని బ్యాక్‌చేసి, సైడుకు తిప్పి, ముందుకి ఉరికించాడు. కొద్దిగా ముందుకి వెళ్లాక, ఓ పక్కగా ఆపు చేశాడు. "ఇంత హుషారుగా ఉరికించి ఇక్కడ ఆపుచేసేశాడేంటండి బాబూ? " అన్నాడొకాయన.

"అక్కడ పాయింట్. గరుడ కోసం ఖాళీ చేయాల్సొచ్చిందండీ- మీకు టిక్కెట్లివ్వద్దు మరీ? " అన్నాడు డ్రైవరు.

టిక్కెట్ల కార్యక్రమం పూర్తయ్యేసరికి అర గంట పట్టింది. మళ్లీ కదిలింది రథం.

బస్సులో లైట్లు ఆరాయి.

"టి.వి. ఉంటే బాగుండేది" అన్నాడు పక్కసీటాయన.

భాస్కర్ జవాబు చెప్పలేదు అతడికి. రాత్రివేళ ప్రయాణంలో టివి సినిమాలు పెడ్తే ఒళ్లుమంట. మర్నాడు అటెండ్ కావలసిన అనేక పనుల మీద కొందరు రాత్రి ప్రయాణం పెట్టుకుంటారు. కొందరు ఉద్యోగస్థులు కూడా ఉంటారు. బస్సులో అర్ధరాత్రి ఛండాలపు ఫైటింగ్ సినిమాలు పెడ్తుంటారు. సినిమా అయ్యేంతవరకూ తలనొప్పి, ఆ తర్వాత నిద్ర పట్టి చావదు. మర్నాడు పగలంతా 'అనీజీ'గా ఉండి, పనులు సక్రమంగా చేసుకోలేకపోవడం జరుగుతుంది. కొందరు ప్రయాణికులు టివి సినిమా లేకపోతే, జీవితంలో ఏదో కోల్పోయినంతగా బాధపడిపోతుంటారు. వాళ్లని చూస్తే భాస్కర్‌కి చికాకు. పగటి ప్రయాణం మెలకువగానే వుంటారు కాబట్టి, బయట ఎండని, రాళ్లని రప్పని చూస్తూ కూర్చోవడం బోరు కాబట్టి, టివి చూడాలనుకోవడం ధర్మం. అంతే గాని... 'ఏదయితేనేం టివి పెట్టక ఈ రాత్రి ప్రయాణం సుఖంగానే సాగేలా చేశారు ఆర్టీసీవాళ్లు...' అనుకున్నాడు.

బస్సు వేగం పుంజుకుంది.

పగలంతా వర్షం కురిసి ఉండడంతో సన్నని ఈదురుగాలి లోనికి చొరబడుతోంది.

మాగన్నుగా నిద్రపట్టేసింది భాస్కర్‌కి.

మధ్య మధ్యలో ఏవో ఊళ్ల దగ్గర బస్సు ఆగడం నిద్రలో తెలుస్తూనే వుంది. కానీ డ్రైవర్ చక్కగా నడుపుతున్నాడు బస్సుని. బస్సు కూడా పాతదైనా కండిషన్‌లో ఉంది. ఎక్కువగా జంపులు, జర్కులు లేవు. ఒక్కో బస్సులో, ఒక్కో డ్రయివర్‌గారి 'నైపుణ్యం' పుణ్యమాని, ప్రయాణమైన రెండ్రోజులదాకా మెడనొప్పి సర్దుకోదు. వెన్నెముక నిటారుగా నిలబడదు, కూర్చోలేం, నిల్చోలేం. మోకాళ్ల నొప్పులు... నరకంలో ఖాళీ లేక కొన్ని శిక్షలు ఈ బస్సు ప్రయాణం రూపంలో అమలు చేస్తున్నారేమోననిపిస్తుంది.

పక్క ప్రయాణికుడు కూడా టివి విషయంలో తన ఒపీనియన్‌ని టాలీ చేయనందుకు అలిగి, అటు జరిగి పడుకున్నాడు. హాయిగా ఉంది భాస్కర్‌కి.

వేగంగానే కాకుండా, నైపుణ్యంగా నడుపుతున్నాడు డ్రైవరు బస్సుని.

బస్సులో డ్రైవరు తప్ప, అందరూ జోగుతున్నారు.

అంతలోనే... ఏం జరిగిందో... పెద్ద పెద్ద కుదుపులతో, కీచుమనే శబ్దంతో ఈడ్చుకుపోతున్నట్లు, రోడ్డుమీద జారుతూ ఆగింది







బస్సు ఆదమరిచి నిద్రపోతున్న ప్రయాణికులు సీట్లలోంచి ముందుకు తూలారు. కొందరు ముందు సీట్లకు గుద్దుకున్నారు. ఇద్దరు ముగ్గురు కింద పడ్డారు బస్సులోనే. తల్లి ఒడిలో నిద్ర పోతున్న ఓ పాప జారిపోయి, ముందు సీటు కిందకు ఒరిగిపోయి, గుక్కపెట్టి ఏడ వసాగింది. పెద్దవాళ్లు కూడా కొందరు కంగారుగా, కొందరు కోపంగా, కొందరు ఆ త్రుతగా అరవసాగారు.

ముందు సీట్లవాళ్లు అద్దంలోంచి, బస్సు ముందు నిల్చుని బస్సుని ఆపిన వ్యక్తుల్ని చూస్తూనే భయంతో గాభరాగా కీచుమ న్నారు. దాంతో వెనక సీట్లవాళ్లకీ భయం పెరిగింది. "ఏవిటీ ఏం జరిగిందీ" అంటూ కేకలు పెట్టారు. కొందరు సీట్లలోంచి లేచి ముందుకు పరుగెత్తారు.

డ్రైవరు బిగుసుకుపోయి, కదిల్తే ఏం ప్రమాదమో అని మాట్లాడకుండా గుడ్లప్ప గించి చూస్తున్నాడు.

బస్సు లైట్ల వెలుతుర్లో ఓ అరడజను మంది మగాళ్లు, ఇద్దరు ఆడవాళ్లు, చేతుల్లో తుపాకులు ఎక్కుపెట్టి తీవ్రంగా చూస్తూ కనిపిస్తున్నారు. అందరూ ముదురు సిమెంటు కలర్ దుస్తుల్లో వున్నారు.

అందులో ఒకతను బస్సు హెడ్ లైట్లని ఆర్పమన్నట్లుగా సంజ్ఞ చేశాడు.

హెడ్‌లైట్లని ఆర్పి, పార్కింగ్ లైట్లు వేశాడు డ్రైవరు.

ఒక స్త్రీ, ఒక పురుషుడు బస్సు లోపలికి వచ్చి, "మేము మావోయిస్టులం. ఇప్పుడీ బస్సుని హైజాక్ చేసి, ఇటు మైదానాల్లోకి ఓ కిలోమీటర్ దూరం తీసుకెళ్తాం. అక్కడ మీరు చప్పుడు చెయ్యకుండా, అరవకుండా మీ సామాన్లతో దిగాలి. మిమ్మల్ని మేం ఏమీ చెయ్యం. మీ నగలు, డబ్బు లాక్కోం. ఈ బస్సుని మాత్రం కాల్చేస్తాం. ఎవ్వరైనా అడ్డుకోవడానికి ప్రయత్నిస్తే వాళ్లనీ కాల్చేస్తాం" అన్నారు.

భయంతో బస్సులో ఓ స్త్రీ కీచుమని మూలిగింది.

"అదే... అదే చెప్పేది. ఎటువంటి శబ్దం గానీ, అడ్డుకోవడానికి ప్రయత్నంగాని చెయ్య కూడదు. ప్రాణాలు పోతాయి. జాగర్త" హెచ్చరించింది తుపాకీ పట్టుకున్న స్త్రీ. ఆమె తలకి ఎర్రని బట్టని చుట్టుకుంది.

"డ్రైవరూ! బస్సుని ఇటు లెఫ్ట్ డౌన్‌లోకి పోనియ్" అని ఆర్డరిచ్చాడు తుపాకీ పట్టు కున్న పురుషుడు.

డ్రైవరు బుద్ధిగా వాళ్లు చెప్పినట్లే బస్సుని డౌన్‌లోకి పోనిచ్చాడు. నెమ్మదిగా, చిరుకాం తిలో కనిపిస్తున్న మైదాన ప్రదేశంలో పోని వ్వసాగాడు.

బస్సుని ఆపిన విప్లవకారుల్లో మిగిలిన వాళ్లు మోటారు సైకిళ్లమీద బస్సుని ఫాలో అవుతూ వస్తున్నారు.

భాస్కర్ ఆలోచిస్తున్నాడు. కొద్దిసేపట్లో ఇంత చక్కగా ఇంతమంది ప్రయాణికుల్ని గమ్యానికి చేర్చడానికి ఉపయోగపడుతున్న ఈ బస్సు కాలి బూడిద కాబోతోంది. ఈ బస్సు- తనని ఉపయోగించుకుంటే ఉపయో గపడ్తుంది. ఓ మూల పడేస్తే అలా పడుం టుంది. వాడకపోతే జరిగే నష్టాన్ని కూడా తనే భరిస్తుందిగాని, ఎవరిమీదా ఎదురు తిరగదు. ఏకీలుకాకీలు ఊడబీకేస్తున్నా ఏం మాట్లాడదు. తీవ్రవాదులయినా, స్ట్రయిక్ చేసే విద్యార్థులయినా, బంద్‌లు చేయించే రాజకీయవాదులయినా, ఆకతాయిలయినా, అల్లరి మూకలయినా, ఎవరికి ఎవరిమీద కోపమొచ్చినా మొట్టమొదటిగా నిరసనకి గురయ్యేది తనే! మళ్లీ ఆ వ్యక్తుల్లో చాలా మంది తమ నిరసన ప్రదర్శనలు విజయ వంతంగా ముగిశాక, అలసి సొలసి, ఇళ్లకు చేరాల్సింది తనలాంటి నోరువావి లేని ఇతర బస్సుల మీదే!





-బస్సుని ఒకచోట ఆపారు.

తీవ్రవాదులు ఇంతదాకా వచ్చాక, తాము అనుకున్నది చెయ్యక మానరని భాస్కర్‌కి తెలుసు.

డ్రైవరు దిగాడు.

"ఊc ఇక అందరూ త్వరగా దిగండి. టైము లేదు. అడ్డుగా ఉన్న సూట్‌కేసుల్ని ఎవరివయినా సరే పట్టుకు దిగండి. తర్వాత ఎవరివి వాళ్లు తీసుకోవచ్చు" అని ఆర్డరిచ్చింది తుపాకీ స్త్రీ.

అందరూ దిగిపోయారు.

భాస్కర్ త్వరపడ్డాడు. 'తను దిగదలుచుకోలేదు- బస్సుని కాలి పోనివ్వదలచుకోలేదు అంతే! ఏమైనా కానీ...!' తన ఒళ్లో పెట్టు కున్న చిన్న సంచీలోకి చేతిని పోనిచ్చాడు.

"బస్సులో ఇంకెవరూ లేరు కదా... సామాన్లన్నీ తెచ్చేసుకు న్నారా? అలా దూరంగా పోయి నిల్చోండి" కమాండ్స్ యిస్తు న్నారెవరో.

జనం బిలబిలమంటూ దూరంగా పోయి, భయం భయంగా బస్సునే చూస్తూ నిలబడి వున్నారు.

భాస్కర్ సంచీలోంచి తనకి కావలసినవి తడిమి చూసుకు న్నాడు. అతని ముఖం ఉద్విగ్నంగా ఉంది. కణతలు అదురుతు న్నాయి.

"ఊc... అందరూ దిగిపోయారు. తగలబెట్టండి" ఆర్డర్స్ అందాయి.

టైర్లమీద పెట్రోలు జల్లారు.

బస్సు చుట్టూరా గడ్డి వేసి, దానిమీద పెట్రోలు జల్లారు. అగ్గి పెట్టె తీసుకుని ముందుకొచ్చాడో తీవ్రవాది.

పెట్టెలోంచి పుల్లని తీసి గీయబోతూండగా... "బస్సులో యింకా ఎవరో ఉన్నారూ..." అన్న భయంతో కూడిన కేక విని పించింది, దూరంగా నిల్చున్న ప్రయాణికుల గుంపులోంచి.

"అవునవును"

"నిజమే... ఎవరో వున్నారు"

"త్వరగా దిగమనండి"

"దిగలేకపోతున్నారేమో పాపం... కొంచెం చూడండి"

అరుపులు, విన్నపాలు, వేడుకోళ్లు...

"లోపల ఎవరో ఉన్నార్ట యింకా... చూడండి" ఆర్డరు.

ఇద్దరు యూనిఫారం వ్యక్తులు చకచకా లోపలకి వచ్చారు. "ఏయ్! ఎవరివయ్యా నువ్వు? బుద్ధిలేదూ... అందరూ దిగి పోయారు కదా! రాతి బొమ్మలా యింకా అలా కూర్చు న్నావేం? ఎవరో చూశారు కాబట్టి సరిపోయింది. లేకపోతే బస్సుతోపాటే కాలి బూడిదయ్యేవాడివి"

**బస్సు చుట్టూరా గడ్డి వేసి, దానిమీద పెట్రోలు జల్లారు. ఓ తీవ్రవాది అగ్గిపుల్లను గీయ బోతూండగా... "బస్సులో యింకా ఎవరో ఉన్నారూ..." అన్న భయంతో కూడిన కేక వినిపించింది, దూరంగా నిల్చున్న ప్రయాణికుల గుంపులోంచి**



"నాకదే యిష్టం" నిబ్బరంగా అన్నాడు భాస్కర్.

అదిరిపడ్డారిద్దరూ.

ఒకతనన్నాడు, "ఏంవన్నా పిచ్చా నీకు. దిగుదిగు"

"నా పేరు భాస్కర్. కాలేజీ లెక్చరర్ని. విద్యార్థులకు పాఠాల్ని, మంచి విషయాల్ని చెప్పే పంతుల్ని. మీకు కూడా చెబ్తున్నాను. మీరు ఈ బస్సుని తగలబెట్టడం మంచిపని కాదు. మీ సిద్ధాంతాల జోలికి పోవడంలేదు నేను. మీ లక్ష్యం నెరవేరడానికి ఈ బస్సు దహనం ఏమాత్రం ఉపయోగపడదని చెబుతున్నాను"

"అవన్నీ తర్వాత తీరిగ్గా చెబుదువుగాని... ముందు దిగు" అంటూ రెక్కపుచ్చుకుని లేప బోయాడు ఒకతను. వీలు పడలేదు.

అప్పుడు చూశారిద్దరూ.

ఇందాక చీకట్లో కనిపించలేదు. ఇప్పుడు భాస్కర్ కప్పుకున్న దుప్పటీ జారి..., కిటికీ గొట్టానికి మెలితిప్పి, తన కంఠం చుట్టూ తిప్పుకున్న గొలుసుకి తాళం వేసుకుని ఉన్నాడు భాస్కర్.

తల తిరిగిపోయింది ఇద్దరికీ.

"ఏమిటా గొలుసేమిటీ?" అన్నారు అయోమయంగా.

"తిరుగు ప్రయాణంలో రైల్లో వెళ్దామని, లగేజ్‌ని లాక్ చేసుకోవడానికి ఈ గొలుసుని దగ్గరే పెట్టుకుంటాను. ఇప్పుడు దీన్ని బస్సు కిటికీ ఊచకీ నా కంఠానికి లింకు చేసుకుని లాక్ చేసి, తాళం ఇందాక నీటి గుంటలోకి గిరవాటు వేశాను. బస్సుని కాల్చ దలుచుకుంటే నిరభ్యంతరంగా కాల్చండి. నా గురించిన ఆలోచన మీకు అనవసరం. ప్లీజ్, కేరీ ఆన్"

తెల్లబోయిన ఇద్దరూ గబగబా బస్సు దిగి, వాళ్ల కమాండర్ దగ్గరకు వెళ్లి విషయం వివరించారు.

దూరంగా ఉన్న జనం ఏం జరుగుతోందో తెలియక గుడ్లప్పగించుకుని చూస్తున్నారు.

విషయం వింటూనే వాళ్ల కమాండర్ ముందు విస్తుబోయాడు. ఆ తర్వాత కోపంతో ఉగ్రుడయ్యాడు. "ఎవడయ్యా వాడు... పిచ్చోడా?" అన్నాడు కోపంగా.

"కాలేజీ లెక్చరర్ట కామ్రేడ్"

'ఒక కాలేజీ లెక్చరర్... ఇంత ధైర్యంగా... లేక ఇంత మూర్ఖంగా... తమ కార్యక్రమాన్నే అడ్డుకుంటాడా?' అనుకుంటూ, చర చరా బస్సులోకి నడిచి, తుపాకీ ఎక్కుపెట్టి, "ఏం డ్రామా ప్లే చేస్తున్నావా?" అంటూ దగ్గరగా వెళ్లి, భాస్కర్ ముఖాన్ని చూసి తడబడుతూ, "సార్ భాస్కర్‌గారూ... మీరా సార్?" అన్నాడు కమాండర్.

అతణ్ణి గుచ్చిచూస్తూ, "ఎవరూ... ఓ నువ్వా విశ్వం?!" అన్నాడు భాస్కర్ గుర్తుపట్టి.

"అవును సర్, విశ్వాన్నే..." అని ఏదో తెలియని దుఃఖం గొంతుకి అడ్డంపడగా ఇక మాట్లాడలేకపోయాడు అతను.

విశ్వాన్నే బాధగా చూస్తున్నాడు భాస్కర్.

ప్రయత్నపూర్వకంగా గొంతు సవరించుకున్నాడు విశ్వం.

"సార్... మాకు టైము చాలా తక్కువ ఉంది. నాలుగయిపోయింది. మరో గంట గంటన్నరలో తెల్లారిపోతుంది. మేం చాలా దూరం పోవాలి. బస్సు దిగిపోండి సర్. ప్లీజ్" అన్నాడు.

భాస్కర్ తల అడ్డంగా ఊపాడు.

"లేదమ్మా విశ్వం. నా కళ్లెదుటే ఈ బస్సుని కాలిపోనివ్వను. పైగా మీ ఆశయాలకు, ఈ బస్సు తగలబెట్టడాలకీ నా దృష్టిలో ఎటువంటి పొంతన లేదు"

"సార్... టైములేదు సార్. మేం ఒక నిర్ణయం తీసుకున్నాక అది నెరవేర్చాల్సిందే. ఇప్పుడీ అటెంప్ట్ మానుకోలేం సర్"

"సరే, అయితే... కానీండి. ఆలస్యం

ఖమ్మం పట్టణంలో అతి పెద్ద హోమ్ అప్లైయన్సెస్ షోరూం

# శ్రీ వెంకటసాయి ఎలక్ట్రానిక్స్

కస్పాబజార్, మున్సిపల్ ఆఫీస్ దగ్గర;

ఖమ్మం, ఫోన్: 325866

ప్రొ॥ శెర్విరాల భాస్కర్, సెల్: 98490 65341

డీలర్స్: అన్ని ప్రముఖ కంపెనీల ఎలక్ట్రానిక్

ఐటమ్స్ & హోమ్ అప్లైయన్సెస్



ప్రొ॥ శెర్విరాల భాస్కర్

ALL MAJOR BRANDS UNDER ONE ROOF

SONY LG igo Preethi ECO Chef

VIDEOCON SAMSUNG Whirlpool HOME APPLIANCES

Godrej

USHA Panasonic ideas for life ONIDA MAY CAUSE ENVY

అన్ని ప్రముఖ కంపెనీల టి.వి.లు, హోమ్ థియేటర్లు, రిఫ్రిజిరేటర్స్, వాషింగ్ మెషీన్స్, ఎయిర్‌కూలర్స్, మిక్సీలు, డి.వి.డి. ప్లేయర్స్ & వి.సి.డి. లు, ప్లాస్మా L.C.D. లు, వెట్‌గ్రైండర్స్, ఫ్యాన్స్ మరియు ఇతర అన్ని రకాల గృహోపకరణాలు సరసమైన ధరలలో లభించును.

బజాజ్ ఫైనాన్స్ మరియు శ్రీరామ్ సిటీ యూనియన్ ఫైనాన్స్ ద్వారా

**0% వడ్డీతో ఋణ సదుపాయం కల్పించబడును.**

★ క్రెడిట్ కార్డ్స్ కూడా అనుమతించబడును

(★ షరతులు వర్తించును)



దేనికీ? "

"మీరు దిగండి సర్"

"ఈ బంధం నుంచి వేరుపడలేను. మీ వాళ్లకు చెప్పాను. ఈ గొలుసులకు తాళం వేసుకుని తాళం చెవి నీటిగుంటలోకి పారేశానని. మీ పని మీరు కానీండి. మీ ఉద్యమంలో... మీలోనే అనేకమంది అమాయకులు, మీ సానుభూతిపరుల్లో అనేకమంది అమాయకులు, మీ చేతుల్లో అనేకమంది అమాయకులు ఆహుతి అయిపోయారు. అందులో నేనో కణ్ణి... కానీండి, ఫరవాలేదు. కేరీ ఆన్"

"సార్, మేం చాలా మొండిగా ప్రవర్తిస్తాం సార్... మా కార్యక్రమాలు నెరవేర్చేటప్పుడు" బతిమలాడుతున్నట్లు అన్నాడు విశ్వం మెత్తగా హెచ్చరిస్తూ.

"నీ గురువుని... నేనింకా మొండివాడినని తెలియదా విశ్వం? " సౌమ్యంగా నవ్వుతూ అన్నాడు భాస్కర్, తనూ మెత్తగా మొండితనాన్ని సవాల్ చేస్తూ.

తను మంచి అని తలచినదాన్ని చెయ్యడానికి, చేయించడానికి భాస్కర్ సర్ ఎంత నిక్కచ్చిగా, నిర్భయంగా, నిర్మొహమాటంగా ప్రవర్తిస్తాడో... అతనికి ఒక సంవత్సరం క్రితంవరకు శిష్యుడైన విశ్వానికి తెలిసినంతగా మరొకరికి తెలియదు.

భాస్కర్‌వైపే రెప్పార్పకుండా చూస్తుండిపోయాడు విశ్వం. కోపంగానూ, బెదిరింపు



చెందడా నికి మనస్క రించడం లేదు.

అప్రయత్నంగానే భాస్కర్‌లోని ధైర్యా నికి, నిస్వార్థ తత్వా నికీ, నాయకత్వ లక్ష ణానికి విశ్వంలోని విశ్వం శిరసు వంచి నమస్కరిస్తున్నాడు.

తననే కన్నార్పకుండా చూస్తున్న విశ్వాన్ని వాత్స ల్యంగా, ప్రేమగా, జాలిగా చూస్తున్నాడు భాస్కర్.

"ఓకే సర్... టైము లేదు మాకు. ఆఖరుసారిగా అడు గుతున్నాను. మీరు దిగడా నికి సిద్ధమా కాదా?" సూటిగా ప్రశ్నించాడు విశ్వం డాంబికంగా.

"నువ్వు ఎన్ని సార్లడిగినా నా జవాబు ఒక్కటే ఉంటుంది"

మళ్లీ నవ్వుతూనే జవాబిచ్చాడు పట్టు దలగా, ధైర్యంగా.

గానూ, తెగింపుగానూ చూద్దామన్నా, మన సుని రాయి చేసుకుందామన్నా అతని వశం కావడంలేదు. భాస్కర్‌లోని ఏదో శక్తి తన గుండెల్ని కరిగించేస్తోంది. ఏదో అనిర్వచనీ యమైన అపరాధ భావన అలుముకుం టోంది. గొలుసుల్ని పేల్చేసి, భాస్కర్‌ని బయటకు ఈడ్చేసిగాని, తమ కార్యక్రమాన్ని అడ్డుకుంటున్న అతణ్ణి బస్సులోనే ఉంచేసి గాని, బస్సుని దహనం చేసి, తమ కార్య క్రమం విజయవంతం అయ్యిందని తృప్తి

"గెలిచారు సర్. మీ దగ్గర చాలా విషయాలు జీవితంలో నేర్చు కున్నాను. మీకు నేను ఇవ్వగలిగిన గురుద క్షిణ ఇప్పుడు మీ మాటను నెగ్గించడమే. వెళ్తా సర్"

"వస్తా అను"

"అవకాశం లేదు సర్... ఒకసారి వెళ్లాక రావడం..." విశ్వం గొంతులో తడి.

"...." ప్రేమగా అతన్నే చూస్తున్నాడు భాస్కర్.



"మీ ధైర్యానికి లాల్ సలాం. విప్లవం వర్ధిల్లాలి" చకచక బస్సు దిగిపోయాడు విశ్వం.

మిగిలిన బృందంతో రెండు నిముషాలు తర్జన భర్జనలు పడ్డాడు విశ్వం. ఆ తర్వాత మోటారుసైకిళ్ల మీద చీకట్లో ఎటో వెళ్లిపోయారు వాళ్లు.

వాళ్లు అలా వెళ్లిపోతూంటే... పదిమంది దాహార్తిని తీర్చే మంచినీళ్లు, పంటలు పండించి క్షుద్బాధను తీర్చే జీవజలం, వృథాగా ఉప్పుటేర్లో కలిసిపోతున్న భావం కలిగింది భాస్కర్‌లో.

అప్రయత్నంగా కళ్లలో ఊరిన చెమ్మ రెండు కన్నీటి బొట్ల రూపంలో గుండెలమీదకు జారింది.

ఏం జరిగిందో, వాళ్లు బస్సుని తగలబెట్టకుండా ఎందుకు వెళ్లిపోయారో తెలియని జనం బిలబిలమంటూ బస్సులోకి పరుగెత్తికొచ్చి, గొలుసుల్లో ఉన్న భాస్కర్‌ని చూసి, ముందు తెల్లబోయి, ఆ తర్వాత క్రమేపీ తేరుకుంటున్నారు. బస్సు దహనం ఎలా ఆగిపోయిందో అర్థంగాని అయోమయంలోనే వున్నారు వాళ్లు.

"ఎవరు సార్ మీరు?"

"ఏమైంది సార్... ఈ గొలుసులేమిటి సార్?"

"వాళ్లు బస్సుని ఎందుకు వదిలిపెట్టారు సార్?"

"మళ్లీ వస్తారా సార్ వాళ్లు?"

ప్రశ్నలు... ప్రశ్నలు... ప్రశ్నలు... అందరిలో ఆత్రుత... తెలియని ఆనందం... భాస్కర్ గొలుసుల్లో బంధించి ఉన్నాడేమిటా అనే అయోమయం...

"ముందు డ్రైవర్ని బస్సుని రోడ్డెక్కించి, ముందుకు పోనియ్యమనండి. ఆలస్యం చెయ్యొద్దు. వాళ్లు మనసు మార్చుకుంటే ప్రమాదం" అన్నాడు భాస్కర్ తొందర పెడ్తూ.

"అమ్మో, డ్రైవర్ గారూ... పోనియ్యవయ్యా బాబూ" అరిచారెవరో.

బస్సు కదిలింది వేగంగా... బతికానన్న ఆనందంతో కూడా.

విశ్వం గురించే ఆలోచిస్తున్నాడు భాస్కర్. గుండె తడి అవుతోంది. ఎంత బ్రిలియంట్ స్టూడెంటో... ఎన్నో సౌఖ్యాలు అనుభవించే అవకాశం వున్న స్టూడెంట్... లక్షలమందిచే కీర్తించబడే ఫ్యూచర్ వున్న స్టూడెంట్... తన రక్తసంబంధానికి జరిగిన అత్యాచారాన్ని భరించలేక, ఇలా అడవితల్లి బిడ్డ అయిపోయాడు!

'సార్... మా అక్కని మా ఎమ్మెల్యే కొడుకూ, వాడి ఫ్రెండ్సూ కలిసి మానభంగం చేసి చంపేశార్ట సార్...' అంటూ, హాస్టల్ నుండి తన రూంకి రాత్రి పదకొండు గంటల వేళొచ్చి, బావురుమని ఏడుస్తూ, విశ్వం చెప్పిన క్షణాలు ఇంకా కళ్ల ముందు మెదులుతున్నాయి. అతన్ని ఓదార్చడం తనవల్ల కాలేదు. నిజానికి తన శరీరం కూడా ఉడికిపోయి ఆ ఎమ్మెల్యే కొడుకు, వాడి ఫ్రెండ్సు ఆ సమయంలో తన కెదురుగా వుంటే- 'తనే ఆపుకోలేని ఆవేశంలో వాళ్లని హతమార్చేసేవాడేమో! 'మా అక్క అంటే నాకు చాలా ఇష్టం సార్. చిన్నప్పట్నుంచీ కలిసి పెరిగాం సార్. అక్క కాదు సార్... ఆమె నాకు మంచి ఫ్రెండు సార్. మా ఇద్దరిదీ ఒక్కటే ప్రాణం సార్. మా అక్క లేకుండా నేను బతకలేను. చచ్చిపోతాను సార్..." అంటూ అతను ఆవేశపడ్తుంటే, కడుపు తరుక్కుపోయేలా ఆక్రోశిస్తూంటే, దేవుడిమీదే కోపం వచ్చింది తనకి.

ఆ తర్వాత అక్క శవాన్ని చూసిన విశ్వం, ఆపుకోలేని కోపంతో వెళ్లి ఎమ్మెల్యే కొడుకుని చంపేసి, ఎటో అడ్రస్సు తెలియనిచోటుకి వెళ్లిపోయాడని చెప్పారు విద్యార్థులు.

దరిదాపు రెండు సంవత్సరాల తర్వాత...



ఇప్పుడు ఇలా... మనసులో ఏదో మూగ బాధ... సుళ్లు తిరుగుతోంది.

బస్సు నడుస్తోంది.

భాస్కర్ మెడకు వేసుకున్న గొలుసుల తాళం ఎలా తీయాలో అని ఆలోచిస్తున్నారు చాలామంది. అసలు అతను ప్రమాదాన్ని ఎలా తప్పించాడో తెలుసుకోవాలని ఉవ్విళ్లూరుతున్నారు ఇంకొంతమంది.

ముందు సీట్లలోంచి ఓ తెల్లటి బట్టలాయన సడెన్‌గా లేచి నిలబడి, "బస్సుని పోలీసుస్టేషన్‌కి పోనిద్దాం వచ్చే ఊళ్లో... ఆ వెధవల గురించి పోలీసు రిపోర్టివ్వడం పౌరులుగా మన బాధ్యత" అన్నాడు ఆవేశంగా. బస్సులో గుసగుసలు.

"ఏమీ అక్కర్లేదు" అరిచాడు భాస్కర్.

ఒక్కసారిగా నిశ్శబ్దం.

"పోలీసు రిపోర్టేం అవసరం లేదు! ఒద్దు! అంతే!" అన్నాడు భాస్కర్ నిశ్చయంగా.

"అదేమిటండీ... మీరెంత సాహసం చెయ్యాల్సి వచ్చిందీ, ప్రాణాలకు తెగించి?! వాళ్లనలా వదిలిపెట్టెయ్యడమేనా? పౌరులుగా..."

"ఆc పౌరులుగా?! పౌరులుగా ఏమిటంటారు మన బాధ్యత? పోలీసు రిపోర్టివ్వడం ఒక్కటేనా? వాళ్లను అడ్డుకోవడం కాదా? ఇంత ఆవేశపడుతున్న మీరు ఎందుకు వాళ్లని వారించడానికి చిన్న ప్రయత్నం కూడా చెయ్యలేదు? ఒకే... పోలీసు రిపోర్టిద్దాం. ఆ కుర్రాళ్లని తరిమి తరిమి ఎన్‌కౌంటర్ చెయ్యమందాం. రేపొద్దున ఏ కేసు వచ్చినా ఈ విషయంలో గట్టిగా నాతోబాటు మీరూ నిలబడతారా? చెప్పండి" ఆవేశాన్ని కంట్రోల్ చేసుకోవడం కష్టంగా ఉంది భాస్కర్‌కి.

ఆ వ్యక్తి చప్పబడ్డాడు.

"పోనీలెండి. ఒద్దులెండి. ముందు మీ గొలుసులు..."

"రైల్లో ప్రయాణాల సమయంలో నా లగేజ్‌కి వేసుకునే గొలుసు, తాళం యివి. తాళంచెవి నిజంగానే పారేశాను నేను. వాళ్లు జేబుల్లో వెదికి గొలుసు విప్పి, నన్ను బయటకు తీసుకుపోతారేమోనని అనుమానించి"

"అయ్యో... మరెలా? ..."

"ఒకసారి రైలు ప్రయాణంలో ఓ ప్యాసింజరు తను దిగాల్సిన స్టేషన్ వచ్చాక లగేజ్‌కు వేసిన తాళం తీసుకోవడానికి జేబుల్లో వెదుక్కుని అది పోవడంతో లబోదిబోమన్నాడు. అప్పట్నుంచీ ఆ ప్రమాదం ఉందని, డూప్లికేట్



**భాస్కర్ మెడకు వేసుకున్న గొలుసుల తాళం ఎలా తీయాలో అని ఆలోచిస్తున్నారు చాలామంది. అసలు అతను ప్రమాదాన్ని ఎలా తప్పించాడో తెలుసుకోవాలని ఉవ్విళ్లూరుతున్నారు ఇంకొంతమంది**



తాళం నా పర్సు లోపలి అరల్లో ఉంచుకుంటుంటాను. ఒక్కసారి బస్సు ఆపితే, నాకు ఈ బంధాల నుంచి విముక్తి లభిస్తుంది" అంటూ నవ్వాడు భాస్కర్.

అందర్లో ఉత్సాహం వచ్చింది. "బస్సాపు బస్సాపు" అంటూ అరచి, బస్సుని ఆపు చేశారు. భాస్కర్ చెప్పినట్లు అతని జేబులోంచి పర్సుతీసి, తాళం విప్పి, గొలుసుని అతనికి నొప్పి కలగకుండా మెడనుంచి తప్పించారు.

రెండు చేతుల్తో మెడ చుట్టూ రుద్దుకుని, అందర్నీ చూస్తూ నవ్వాడు భాస్కర్.

అందరి ముఖాలూ వెలిగాయి.

బస్సు రెచ్చిపోతున్న ఉత్సాహంతో ముందుకు ఉరుకుతోంది.

## 5



హైదరాబాద్‌లో పని ముగించుకుని, ఉన్న రెండు రోజులు మళ్లీ ఆశ చావక, టాంక్‌బండ్, ఊళ్లో వున్న అన్ని పార్కులూ కళ్లల్లో వత్తులేసుకుని వెదికాడు భాస్కర్, శారద కనిపిస్తుందేమోనని. అతనికి నిరాశే ఎదురయింది.

పాత మిత్రులెవర్నయినా కలిసి, ఆమె గురించి చెప్పి, ఎక్కడయినా తారసపడితే తనకు తెలియజేయమంటేనో? ఆమెపట్ల తన ఆర్ద్రతని సరైన విధానంలో అర్థం చేసుకోగల మంచి మిత్రులు ఎవరూ లేరు తనకు. అసలు శారద తన జీవితాన్ని చక్కబెట్టే క్షణాల వరకూ తను ఎవరితోనైనా క్లోజ్‌గా ఫ్రెండ్‌షిప్ చేస్తేగా? ఆమె ఫోటో... దరిదాపుగా పోలికలుండే చిత్రం... తన స్టూడెంట్ మురళి స్ఫురణ కొచ్చాడు భాస్కర్‌కి. కొంత ఉత్సాహం అనిపించింది.

* * *

హైదరాబాద్ నుంచి విజయవాడ తిరిగి వచ్చాక, ఇనాగ్యురల్ ఫంక్షన్‌కి జడ్జిగారు చీఫ్ గెస్ట్‌గా రావడానికి కన్ఫర్మ్ అయిపోయిందని ప్రిన్సిపాల్‌గారికి చెప్పడానికి ఉత్సాహంగా మెట్లు ఎక్కబోయిన భాస్కర్ మెట్ల పక్కగోడమీద ఉన్న అక్షరాలని చదివి, కోపంతో ఉడికిపోయాడు.

'డియర్ హీరోజీ,

నీ మెరూన్ కలర్ షర్టుని ఉదయం ఎనిమిది గంటలకల్లా హ్యాంగర్‌కి తగిలించి ఆరేయవయ్యా మహానుభావా. ఓ అందమైన స్త్రీతో స్నేహం నీకిష్టమని అర్థం చేసుకుంటా ను. ఆపై గ్రంథం నడిపే బాధ్యత నాదేలే-

...సు...జ....'

ఓ అభిసారిక విరహవేదన భాస్కర్ సార్ కోసం. పాపం! ప్చ్‌ప్చ్..

మెట్లపైకి వెళ్లడం విరమించుకుని, గాయపడ్డ మనసుతో వెనుతిరిగి స్టాఫ్ రూంకి పోయి, తన టేబుల్ దగ్గర ఓ చింపిన కవర్ ఉండడం గమనించాడు భాస్కర్. దానివైపు చురచుర చూస్తూ లోపల్నుంచి కాగితాన్ని బయటకు లాగాడు. మళ్లీ గులాబీ రంగు పేపర్‌మీద ఆకుపచ్చ అక్షరాలు అందంగా పచ్చలు పేర్చినట్లు.

పోయినసారి కంటే పెద్ద ఉత్తరమే.

ఇందాక గోడమీద రాయబడ్డ పంక్తులూ వున్నాయి, పువ్వు బొమ్మతో సహా. కాని ఈసారి పేరులో అక్షరాలు మారాయి. తన వెంటపడిన ఈ రాక్షసి ఎవరు?

# సమగ్ర గిరిజనాభివృద్ధి సంస్థ, పార్వతీపురం అభివృద్ధి నివేదిక 2006-07 (తే. 31.01.2007)

**ఎ. వ్యవసాయము (ఖరీఫ్)**

1. వరి మరియు మొక్క జొన్న విత్తనముల పంపిణీ (50% రాయితీపై)

| | | |
|---|---|---|
| మొత్తము లబ్ధిదారులు | : | 4918 |
| విస్తీర్ణము ఎకరములలో | : | 4918 |
| విత్తనములు టన్నులలో | : | 131.04 |
| మొత్తము విలువ | : | 18.47 లక్షలు |
| రాయితీ విలువ | : | 10.27 లక్షలు |

**రబీ:**

1. వేరుశనగ విత్తనముల పంపిణీ (1 కేజికి రూ.8/- వ్యవసాయశాఖ మరియు రూ.12/- ఐ.టి.డి.ఎ. రాయితీపై)

| | | |
|---|---|---|
| లబ్ధిదారులు | : | 1619 |
| విస్తీర్ణము ఎకరములలో | : | 1619 |
| విత్తనములు టన్నులలో | : | 91.14 టన్నులు |
| మొత్తం విలువ | : | 28.11 లక్షలు |
| రాయితీ | : | 18.22 లక్షలు |
| లబ్ధిదారుని వాటా | : | 9.88 లక్షలు |

2. మొక్క జొన్న విత్తనములు పంపిణీ (1 కేజికి రూ.25/- వ్యవసాయశాఖ మరియు రూ.20/- (సి-1921) & రూ॥ 19/- (సిరి) కేజికి ఐ.టి.డి.ఎ.. మ్యాచింగ్ గ్రాంటు)

| | | |
|---|---|---|
| లబ్ధిదారులు | : | 1449 |
| విస్తీర్ణము ఎకరములలో | : | 1449 |
| విత్తనములు టన్నులలో | : | 11.588 టన్నులు |
| మొత్తం విలువ | : | 6.30 లక్షలు |
| రాయితీ | : | 5.19 లక్షలు |
| లబ్ధిదారుని వాటా | : | 1.11 లక్షలు |

3. ప్రొద్దుతిరుగుడు విత్తనముల పంపిణీ (అంతర పంట/ ఫెన్ సింగ్) (1 కేజికి రూ.105/- వ్యవసాయశాఖ మరియు రూ. 105/- ఐ.టి.డి.ఎ. మ్యాచింగ్ గ్రాంట్)

| | | |
|---|---|---|
| లబ్ధిదారులు | : | 278 |
| విస్తీర్ణము ఎకరములలో | : | 278 |
| విత్తనములు టన్నులలో | : | 0.559 టన్నులు |
| మొత్తం విలువ | : | 1.32 లక్షలు |
| రాయితీ | : | 1.16 లక్షలు |
| లబ్ధిదారుని వాటా | : | 0.155 లక్షలు |

**బి. ఉద్యానవనము**

1. జీడి మరియు మామిడి తోటల వివరములు

| | | |
|---|---|---|
| గ్రామముల సంఖ్య | : | 222 |
| మొత్తము లబ్ధిదారుల సంఖ్య | : | 2033 |
| విస్తీర్ణము ఎకరములలో | : | 1590 ఎ॥ |

2. పసుపు సాగు

| | | |
|---|---|---|
| గ్రామముల సంఖ్య | : | 364 |
| మొత్తము లబ్ధిదారుల సంఖ్య | : | 6527 |
| విస్తీర్ణము ఎకరములలో | : | 400.00 |
| రాయితీ & లబ్ధిదారుని వాటా | : | 36.60 లక్షలు |

3. కూరగాయల మరియు పెరటి తోటల పెంపకము

| | | |
|---|---|---|
| మొత్తము లబ్ధిదారుల సంఖ్య | : | 10523 |
| గ్రామముల సంఖ్య | : | 80 |
| విస్తీర్ణము ఎకరములలో | : | 75.00 |
| ఖర్చు వివరములు | : | 1.12 లక్షలు |

**సి. ఆర్థికాభివృద్ధి పథకములు 2006-07** (E.S.S.)

| | | | |
|---|---|---|---|
| అంచనాలు | భౌతిక | : | 20546 |
| | ఆర్థిక | : | 603.608 లక్షలు |
| సాధించిన ప్రగతి | భౌతిక | : | 19177 |
| | ఆర్థిక | : | 169.988 లక్షలు |

**మత్స్య అభివృద్ధి**

చేప పిల్లల పంపిణీ పథకం (100% రాయితీపై)

| | | |
|---|---|---|
| మొత్తము లబ్ధిదారుల సంఖ్య | : | 144 |
| గ్రామముల సంఖ్య | : | 17 |
| విస్తీర్ణము ఎకరములలో | : | 90.50 |
| ఖర్చు వివరములు | : | 0.60 లక్షలు |

**డి. వైద్య ఆరోగ్య కార్యకలాపములు**

| | | |
|---|---|---|
| ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు | : | 16 |
| సంచార వైద్యశాలలు | : | 04 |
| ప్రభుత్వ ఆసుపత్రులు | : | 02 |

**ఇ. గిరిజన విద్యా సంస్థల సంక్షిప్త సమాచారము.**

1. మొత్తము పనిచేస్తున్న వసతి గృహములు : 69
   విద్యార్థినీ విద్యార్థులు — బాలురు : 8811, బాలికలు : 6149
2. ప్రభుత్వ ప్రాథమిక పాఠశాలలు : 349
   విద్యార్థినీ విద్యార్థులు — బాలురు : 3695, బాలికలు : 3614
3. మెట్రిక్ అనంతర ఉపకార వేతనము :
   విద్యార్థుల సంఖ్య : 5240
   విడుదలైన మొత్తం : రూ॥ 165.40
   మంజూరుకాబడిన మొత్తం : రూ॥ 156.65
4. కులాంతర వివాహాలు : లబ్ధిపొందిన జంటల సంఖ్య : 4
   విడుదల కాబడిన మొత్తము : 0.40 లక్షలు
5. ఉత్తీర్ణతలు

| ఉత్తీర్ణతలు | 10వ తరగతి | 7వ తరగతి |
|---|---|---|
| హాజరైనవారి సంఖ్య | 1549 | 2307 |
| పాసైన వారి సంఖ్య | 1423 | 2281 |
| ఉత్తీర్ణతా శాతము : | 91.86 | 99.00 |

6. కంప్యూటరు శిక్షణ
   ఉన్నత పాఠశాలలో 6, 7, 8వ తరగతి చదువుతున్న 4786 మంది విద్యార్థినీ విద్యార్థులకు కంప్యూటరు శిక్షణ ఇవ్వబడుచున్నది.
7. ఉత్తమ పాఠశాలలు విద్యాపథకము:

| | | |
|---|---|---|
| విద్యార్థుల సంఖ్య | : | 201 |
| విడుదలై మొత్తము | : | 8,290 |
| మంజూరు కాబడిన మొత్తము | : | 8,256 |

**జి. గిరిజన సంక్షేమ ఇంజనీరింగు విభాగము 2006-07**

| | | |
|---|---|---|
| భౌతిక లక్ష్యము | : | 228 |
| ప్రగతి | : | 162 |
| ఆర్థిక లక్ష్యము | : | 1059.77 లక్షలు |
| ప్రగతి | : | 377.63 లక్షలు |

**హెచ్. గృహనిర్మాణ సంస్థ**

ఎస్.పి.ఆర్ ఇందిరమ్మ పథకము
(గిరిజనులకు మంజూరుకాబడిన)
ఐ.ఎ.వై & ఆర్.పి.హె గృహములు : 3861+84+2318=6263

**ఐ. ఏజెన్సీ భూ బదలాయింపు చట్టము.**

| | | |
|---|---|---|
| మొత్తము నమోదు చేసిన కేసుల సంఖ్య | : | 1317 |
| విస్తీర్ణము | : | 7450.17 ఎ॥ |
| భూమి అప్పగించిన కేసులు | : | 847 |
| విస్తీర్ణము | : | 5476.55 ఎ॥ |

**జె. ఇందిరా క్రాంతి పథం.**

| | | |
|---|---|---|
| మొత్తం ఏర్పడిన స్వయం సహాయక సంఘములు | : | 4671 |
| మొత్తం గ్రామైక్య సంఘములు | : | 273 |
| బ్యాంకు ఋణము పొందిన స్వయంసహాయక సంఘాలు | : | 422 |
| పొందిన బ్యాంకు ఋణము | : | 216.56 లక్షలు |



**శ్రీ బి. కిషోర్ గారు**, I.A.S.
జిల్లా కలెక్టర్ మరియు
I.T.D.A. ఛైర్మన్, విజయనగరం (జిల్లా)

**శ్రీ A.K. సిన్హా గారు**, I.F.S.
ప్రాజెక్టు ఆఫీసర్, I.T.D.A.,
పార్వతీపురం, విజయనగరం (జిల్లా)





ఎందుకిలా హింసిస్తోంది. పైగా ఈసారి ఉత్తరం స్టూడెంట్స్ చేతుల్లో పడ్డట్టుంది. అందులోనూ ఎవడో కోతి చేతుల్లో. గోడమీదకి తనని లాగి ఎగతాళి పట్టిస్తున్నాడు. పళ్లు గిట్టకరిచి ఉత్తరాన్ని చింపేయబోయి, అంతలోనే ఏదో స్ఫురించి ఆగి ఉత్తరంతోబాటు విసురుగా ప్రిన్సిపాల్‌గారి రూము దగ్గరకు, మెట్ల దగ్గరకు నడిచాడు భాస్కర్.

అక్కడ అప్పటికే కొంతమంది స్టూడెంట్లు నిలబడి, గోడమీది రాతల్ని చదువుతున్నారు. వాళ్లు భాస్కర్ రాకని గమనించి, ఏమీ ఎరగని వాళ్లల్లా వెళ్లిపోబోయారు గాని, "వద్దు... ఎవ్వరూ వెళ్లొద్దు. ఒక్క రెండు నిముషాలుండండి" అని భాస్కర్ అరిచేసరికి, ఏం చేయాలో పాలుపోక అలాగే నిలబడిపోయారు.

మెట్లు దిగుతున్న ప్యూన్‌తో "వీరయ్యా - అర్జంటుగా గమ్ బాటిల్ పట్రా" అన్నాడు భాస్కర్.

"అట్లాగే సార్" అని, పరుగున ఆఫీసు రూములోకి పోయి గమ్ బాటిల్‌తో తిరిగొచ్చాడు వీరయ్య.

"వీరయ్యా... ఈ ఉత్తరాన్ని ఈ గోడ మీది అక్షరాల కింద అతికించు" అన్నాడు భాస్కర్.

"అట్లాగే సార్" అంటూ అతికిస్తూ గోడ మీద రాసున్న పంక్తుల్ని చదివి, స్థాణువై పోయాడు వీరయ్య. ఆపైన అయోమయంగా భాస్కర్‌వైపు తలతిప్పి, "ఇందేంది సార్... ఈ పిచ్చి రాతలేం మీ మీద? " అన్నాడు.

భాస్కర్ అభావంగా నిలువుగా తల వూపి, "చెబుతా... నువ్వు కూడా వీళ్లవైపుకు రా" అని దూరంగా అటుయిటు వెళ్తున్న స్టూడెంట్స్ అందర్నీ చప్పట్లు కొట్టి పిలిచి, "మై డియర్ స్టూడెంట్స్!" అంటూ గోడపైన రాతలమీద తర్జనితో చూపిస్తూ, "ఇవి ఈ కింది ఉత్తరంలోని రాతల్లోని ముఖ్యమైన పంక్తులు. ఈ ఉత్తరం అంతా చదివే ఓపిక లేని వారి కోసం, ఇతరుల ఉత్తరాలు చింపి చదివే అలవాటున్న ఓ పరోపకారి, ముఖ్యమైన వాక్యాలను మాత్రం ఇక్కడ పొందుపరిచాడు. ఇక ఈ ఉత్తరం గురించి, దీన్ని రాస్తూన్నదెవరో, వాళ్లు నానుంచి ఏమి ఆశిస్తున్నారో నాకు తెలియదు. మీ ఓపిక, ఆసక్తులని బట్టి ఈ రాతల్ని గాని, ఈ ఉత్తరాన్ని గాని, రెంటినీ గాని చదివి మీ అభిప్రాయాన్ని మీరు ఏర్పరుచుకోవచ్చు ఇంకో ముఖ్య విషయం. ఈసారి నాకు ఇటువంటి ఉత్తరం వస్తే, ఏ పుణ్యాత్ములయినా దాన్ని విప్పి చదివితే దయచేసి నాటేబుల్ మీద పెట్టకండి. ఇదుగో ఇక్కడ ఇలా అంటించండి. విడిగా మళ్లీ రాసే శ్రమ కూడా తప్పుతుంది. థేంక్యూ..." అని వడివడిగా భాస్కర్ వెళ్లిపోబోతూంటే...

"మిస్టర్ భాస్కర్... ప్లీజ్, జస్ట్ ఒన్ మినిట్" అన్న అభ్యర్థనతో కూడిన పిలుపు వినిపించి వెనుతిరిగాడు.

మెట్లు దిగుతూ ప్రిన్సిపాల్‌గారు.

ఆత్మీయంగా చూస్తూ, తనవైపు రమ్మని ఆహ్వానిస్తూ, ఆయన చేయి ఊపుతున్నారు.

ఆయన స్థానంలో మరెవరైనా ఉంటే భాస్కర్ ఆగకుండా వెళ్లిపోయేవాడేనేమో. భాస్కర్ వైపు నడుస్తూనే ఆయన గోడ మీది రాతల్ని చదివారు. భాస్కర్ దగ్గరకొచ్చి భుజం చుట్టూ చేయివేసి, "వాటీజ్ దిస్ మైడియర్ భాస్కర్! ఇలాంటి రాతలక్కూడా మీలాంటి డైనమిక్ పర్సన్ చలించిపోతే ఎలా? ఫర్‌గెట్ మై బోయ్! కమాన్,నా రూములోకి రండి మీరసలు" అంటూ తనవైపుకి హత్తుకుంటూ, మెట్ల



పైకి తీసుకెళ్తూ, వీరయ్య వైపు 'ఆ రాతల్ని చెరిపెయ్' అన్నట్లుగా చూశాడు.

వీరయ్య తలవూపి గోడవైపు నడిచాడు.

ప్రిన్సిపాల్‌గారి ఆత్మీయ లాలనకి వివశుడవుతూ భాస్కర్ బాధ నుంచి ఉపశమనం పొందుతూ, తల వంచుకుని మెట్లెక్కసాగాడు.

వీరయ్యకంటే ముందే కొందరు స్టూడెంట్లలో చలనం కలిగింది. కొందరు నీళ్ల కోసం పరిగెత్తారు. ఒకమ్మాయి లెటర్‌ని గోడ నుంచి పీకి ముక్కలుచేసి ఊదేసింది. నీళ్లు తెచ్చినవాళ్లు గోడమీది రాతల్ని చెరిపేశారు.

"సార్ కొచ్చిన లెటర్ చింపి చదవడమే కాకుండా, గోడ మీద ఇట్లా రాసే ధైర్యం ఉన్న లమ్డీకొడుకెవరో తెలుసుకుని, మక్కెలిరగదన్నాల్రా" అన్నాడో స్టూడెంట్.

అవునంటూ వంత పలికారు మిగిలినవాళ్లు.

* * *

ఉద్యోగస్థులు రోజులో ఇంటిముఖం పట్టే వేళ -

ప్రకాశం బ్యారేజ్ పొడవునా ఈవెనింగ్ వాక్‌చేస్తూ, ఆలోచిస్తున్నాడు భాస్కర్. 'అసలు ఎందుకొస్తున్నాయి ఈ ఉత్తరాలు నాకు? రాస్తున్నది మగా, ఆడా? ఆడపిల్ల రైటింగ్ లాగే, చిన్న చిన్న మొలకలొచ్చిన పెసరగింజలు పక్కపక్కన పేర్చినట్లు, ముద్దుగా ముచ్చటగా ఉన్నాయి అక్షరాలు. ఆమె ఉద్దేశం ఏమై ఉంటుంది? తనని ప్రేమిస్తోందా? తనను ప్రేమించమని ఆహ్వానమే కదా అది? తను అందగత్తెనని తనే నిర్ణయించేసుకున్నట్లుగా రాస్తోందే. తనని ఆహ్వానిస్తోందంటే తను ఆమెకు నచ్చినట్లే. నచ్చడం అంటే...?! ఆడగాని, మగగాని అందంగా ఉంటే చాలా?! లేక కుటుంబాన్ని పోషించుకునే సామర్థ్యం ఉంటే చాలా?! జీవితాన్ని మరో జీవితంతో ముడిపెట్టుకోవాలనే ఆసక్తి, చివరంటా బాధ్యతలు మోయగలనన్న ఆత్మవిశ్వాసం, ఒకరికొకరు కష్టాలెన్ని ఎదురైనా సంతోషంగా భరించగలమన్న నిస్వార్థ భావన ఉండక్కర్లేదా?! ఛట్- ఈ విషయం ఇక ఆలోచించడం అనవసరం.

'గత ఉత్తరంలో ఓ పువ్వు బొమ్మ, పక్కన 'కు-మాం-లి'ట. ఈసారి '-సు-జ'ట. ఓహో ఈ 'తెలివి ఎక్కువ' పిల్లగారి పేరు 'కుసుమాంజలి' అన్నమాట. అసలు తనంటే ఇష్టమో కాదో తెలుసుకోకుండానే క్విజ్ ఒకటా-నవలా నాయికలా?!హుం. ఫర్‌గెట్ యార్- లైఫ్ ఈజ్ నాట్ ఎ జోక్ టు ప్లే విత్'.

'గత ఉత్తరంలో
ఓ పువ్వు బొమ్మ,
పక్కన
'కు-మాం-లి'ట.
ఈసారి
'-సు-జ'ట.
ఓహో ఈ
'తెలివి ఎక్కువ'
పిల్లగారి పేరు
'కుసుమాంజలి'
అన్నమాట.
అసలు తనంటే
ఇష్టమో కాదో
తెలుసుకోకుండానే
క్విజ్ ఒకటా-
నవలా నాయికలా





రోడ్డు దాటి బ్యారేజ్ గేట్లని చూస్తూ నడుస్తున్నాడు. 'మనసు గేట్లని కూడా ఈ బ్యారేజ్ గేట్లలాగే అవసరమైనప్పుడే, అవసరమయినంతే ఎత్తి వదలాలి. స్వేచ్ఛగా వదిలేశామా, ఈ బ్యారేజ్ కి అర్థం ఉండనట్లే జీవితానిక్కూడా' అనుకున్నాడు. కాని అవసరమైనంతైనా వదలాలికదా, తప్పదు కదా? అందులో ఓ స్త్రీ తనంత తానుగా... 'వనిత తనంత తా వలచి వచ్చిన లోకువ కాదె' అన్నారు కదా... తనూ అదే చేస్తున్నాడా? రేపొద్దున తన మెరూన్ షర్టు ఆరవేస్తూ ఎనిమిది గంటలకి ఓ చూపు వీధి వైపు పారేస్తే ఏం కొంప మునిగిపోతుంది?

బ్యారేజ్ పూర్తిగా దాటి వచ్చేశాక రైట్ టర్న్ తిరిగి, ఓ సైడుకి పార్క్ చేసిన తన స్కూటర్ మీద బెంజ్ సర్కిల్ దగ్గరున్న తన గూటికి పయనమయ్యాడు భాస్కర్, ఏదో తెలియని ఆనందంతో...



* * *

"సార్... అన్యాయం జరిగిపోయింది సార్"

"మీరు వెంటనే రావాలి సార్"

చటుక్కున తల తిప్పాడు భాస్కర్ గుమ్మంవైపు.

తన కాలేజి స్టూడెంట్లు యేసేబు, కళ్యాణి.

ఇద్దరి ముఖాలు జీవురించుకుపోయి ఉన్నాయి. బాధతో, కోపంతో వాళ్ల గుండెలు ఎగిసిపడుతున్నాయి.

ఒక్క నిమిషంపాటు వాళ్లని చూస్తూ అలాగే నిలబడిపోయాడు భాస్కర్.

వాళ్ల వాలకాలను చూస్తుంటే ఏదో ఘోరమైన వార్తనే వాళ్లు మోసుకొచ్చినట్లున్నారు.

ఏం జరిగింది అని అడగడానిక్కూడా భాస్కర్‌కి ధైర్యం చాలడంలేదు.

"ముందు... ముందు మీరిద్దరూ ఇలా కూర్చోండి" అన్నాడు తనే తడబడ్తూ.

"లేదు సార్... కూర్చునే టైం లేదు. పతంజలి... పతంజలి... బ్రహ్మయ్య శాస్త్రి గారబ్బాయి..." ఇక చెప్పలేక కింద కూలబడిపోయింది కళ్యాణి.

"పతంజలి...?" భాస్కర్ పెదవులు





కళ్యాణి వాళ్లింటికి ఫోను వచ్చిందిట సార్... పతంజలి క్షేమం గురించి వాకబు చెయ్యమని. తను నాకు ఫోను చేస్తే, ఇద్దరం మెడికల్ కాలేజి హాస్టల్‌కి వెళ్లాం సార్. హాస్టల్ మేనేజిమెంటు మమ్మల్ని లోపలికి రానియ్యడంలేదు సార్. పతంజలికి ఏదో జరిగింది సార్. వాళ్ల చెప్పట్లేదు సార్. మాకు చాలా భయంగా ఉంది సార్..." బావురుమన్నాడు యేసేబు.

ఒక్కక్షణం కాళ్లు ఒణుకుతున్నట్లయి స్టౌ ఆర్పేసి, మంచం మీద కూలబడ్డాడు భాస్కర్.

"ఇప్పుడు బ్రహ్మయ్యశాస్త్రిగారు, రామదాసుగారు విజయవాడ వస్తున్నారు సర్, బస్సులో"

భాస్కర్ ఒక్కసారి తల విదుల్చుకున్నాడు.

తనే గాభరాపడ్తే లాభం లేదనుకున్నాడు.

కర్తవ్యం ఆలోచించాలనుకున్నాడు.

ముందు బస్టాండుకు వెళ్లి బ్రహ్మయ్యశాస్త్రిగారికి, వారి ప్రాణంలో ప్రాణం ఎమ్మెల్యే రామదాసుగారికి ధైర్యం చెప్పాలి. ఇద్దర్నీ తీసుకుని, మెడికల్ కాలేజీ హాస్టల్‌కి వెళ్లి మిగిలిన పరిస్థితులేమిటో చక్కబరచాలి.

వణికాయి. యేసేబు వైపు చూశాడు.

"అంటే... ప్రాణానికేం ముప్పున్నట్లు లేదు సార్. కాని ఏం జరిగిందో తెలియదు. మెడికల్ కాలేజి హాస్టల్ నుంచి బ్రహ్మయ్యశాస్త్రిగారి ఊరి పోస్టు మాస్టరుగారికి ఫోను వెళ్లిందిట సార్... శాస్త్రిగారిని వెంటనే బయలుదేరి రమ్మని. ఏం జరిగింది అంటే హాస్టలువాళ్లు ఏమీ చెప్పకుండా ఫోను పెట్టేశార్ట. ఆయన గాభరాగా వాళ్ల ఎమ్మెల్యే రామదాసుగారికి ఫోను చేశార్ట. రామదాసు గార్నుంచి



తనెదురుగా ఉన్న స్టూడెంట్సు ఇద్దరితో, "మీరు ఇలా గాభరాపడ్తే కాదు... ధైర్యంగా వుండాలి. లేచి మొహాలు తుడుచుకుని, మంచినీళ్లు తాగండి. బస్‌స్టేషన్‌కి వెళ్తున్నాం మనం" అన్నాడు ధైర్యం కలిగిస్తూ, మందలిస్తూ, కర్తవ్యం బోధిస్తూ.

స్టూడెంట్సిద్దరూ మొహాలు తుడుచుకుంటూ లేచారు.

## 6



కూచిపూడి నుంచీ, హైద్రాబాద్ నుంచీ వచ్చే బస్సుల కోసం ఎదురుచూస్తున్నారు భాస్కర్, కళ్యాణి, యేసేబు.

ముగ్గురూ చాలా అసహనంగా ఉన్నారు.

కళ్యాణి తల్లిదండ్రులకి ఎమ్మెల్యే రామదాసుతో బాగా పరిచయం. అందుకనే ఆయన తన స్నేహితుడి కొడుకు పతంజలిని మెడిసిన్‌లో జాయిన్ చేయడానికి తీసుకువచ్చినప్పుడు మొదట కళ్యాణి ఇంటికే తీసుకువచ్చాడు. ఎన్నడూ తల్లిదండ్రులని విడిచి వుండని ఆ కుర్రాడికి ధైర్యం చెప్పడానికి వాళ్లు అతన్ని భాస్కర్ దగ్గరకే తీసుకువచ్చారు. భాస్కర్, కళ్యాణి, యేసేబు ఆ కుర్రాడికి ధైర్యం కలిగించారు. ఎటువంటి అవసరం ఉన్నా, తమల్ని సంప్రదించమన్నారు.

కూచిపూడి నుండి వచ్చే బస్సొచ్చింది. ఆ బస్సు ఎలైటింగ్ పాయింట్ దగ్గర ఎదురుచూస్తున్న భాస్కర్ బస్సులోంచి దిగుతున్న ఒక్కొక్కరినే కన్నార్పకుండా చూస్తున్నాడు. ఇంక ఓ అరడజను మంది పాసింజర్లు మిగిలి ఉన్నారనగా, నెమ్మదిగా తడబడుతూ దిగుతున్న దంపతులమీద భాస్కర్ దృష్టి పడింది. ఒకరు పతంజలి తండ్రి బ్రహ్మయ్య శాస్త్రి, రెండవవారు ఆయన భార్య గాయత్రి.

భాస్కర్ వాళ్లకు ధైర్యం కలిగించడానికి సంసిద్ధుడవుతూ, "అయ్యా శాస్త్రిగారూ" అని పిలిచాడు. ఆయన ఇటు తిరగ్గానే, "నమస్కారం... నేను భాస్కర్‌ని. లెక్చరర్ని. అమ్మా, నమస్కారం. రండి... ఇటు రండి. ఆ బ్యాగులు ఇటివ్వండి" అన్నాడు ఏమాత్రం తడబడకుండా బ్యాగ్‌లు అందుకుంటూ.

"బాబూ మీరా... మీరొచ్చారా బాబూ బస్టాండుకి? " అన్నాడు బ్రహ్మయ్యశాస్త్రి మర్యాదగా, లోలోన ఏదో కీడు శంకిస్తూనే.

"నాయినా, మా అబ్బాయి పతంజలి...? " గాయత్రి గొంతు భయంతో పూడుకుపోయింది.

ఇద్దరి ముఖాలూ జేవురించుకుపోయి, కణతల నరాలు ఉబ్బిపోయి ఉన్నాయి.

"అబ్బాయి బాగానే ఉన్నాడమ్మా, ఏం కాలేదు" అన్నాడు భాస్కర్, ధైర్యం కలిగిస్తూ.

"ఏమో బాబు... మా పోస్టు మాస్టరుగారు 'అబ్బాయి హాస్టలు నుంచి ఫోను వచ్చిందండీ, మిమ్మల్ని వెంటనే బయలుదేరి రమ్మంటున్నారు. కారణం తెలియదు' అని చెప్పేసరికి గుండె జారిపోయింది. మా అబ్బాయి క్షేమమే కదా నాయినా! నీ అమ్మ కడుపు చల్లగా, మంచి వార్త చెప్పావు నాయనా...హమ్మా..."అంటూ నిట్టూర్చాడు శాస్త్రి.

"నిజమేనా నాయనా నువ్వు చెబుతున్నదీ... మమ్మల్ని మభ్యపెడుతున్నావా? " నమ్మకం చాలక గాయత్రి బేలగా చూస్తూ ప్రశ్నించింది.

నిజానికి పరిస్థితి కచ్చితంగా ఇదీ అని



భాస్కర్‌కి మాత్రం ఏం తెలుసు? కాని బాధ్యతగా, మానవ ధర్మంగా ధైర్యం చెప్పగలడంతే. అందుకనే "నిజం అక్కయ్య గారూ... ఎందుకూ, మనం ఇప్పుడు హాస్టల్‌కే వెళ్తున్నాం కదా! మీరే చూద్దురు గాని..." అన్నాడు తెచ్చిపెట్టుకున్న నవ్వుతో. 'భగవంతుడా! ఈ అమాయక దంపతుల కడుపులో చిచ్చుపెట్టకు. నీకు కోటి నమస్కారాలు' అని మొక్కుకున్నాడు కూడా.

హైద్రాబాద్ నుంచి వచ్చే బస్సుల ఎలైటింగ్ పాయింట్ దగ్గర రామదాసు రాక కోసం ఎదురుచూస్తున్న కళ్యాణి, యేసేబుల దగ్గరకు బయలుదేరారు ముగ్గురూ.

"మా రామదాసు మధ్యాహ్నమే హైదరాబాదులో బయలుదేరుతున్నానని చెప్పాడు. వాడూ వచ్చేస్తాడు ఇహనో, ఇప్పుడో. పతంజలికి ఏమీ కాలేదని తెలిస్తే మాకంటే వాడే యెక్కువ సంతోషిస్తాడు పాపం..." తనలో అనుకుంటున్నట్లే చెప్పుకుపోతున్నాడు బ్రహ్మయ్యశాస్త్రి.

వాళ్లతోబాటే మౌనంగా నడుస్తున్న భాస్కర్‌కి, కొన్ని రోజుల క్రితం పతంజలిని మెడిసిన్‌లో జాయిన్ చెయ్యడానికి, కూడా వచ్చిన రామదాసు చెప్పిన బ్రహ్మయ్యశాస్త్రి గారింటిలోని పరిస్థితులూ, వాళ్ల వ్యక్తిత్వాలు, పిల్లవాడిని మెడిసిన్ చదివించడానికి పడ్డ తర్జన భర్జనలూ కళ్లముందు బొమ్మకట్టి ఆడుతున్నాయి.

... ఊరి చెరువులో మొలబంటి నీట్లో ప్రత్యక్ష భగవానుడికి అభిముఖంగా నిలబడి, అర్ఘ్యం సమర్పిస్తూ, ప్రార్థన చేస్తున్న కొడుకు పతంజలిని ఒడ్డున నిలబడి తడిపంచె మార్చుకుంటూ, రెప్పార్పకుండా చూస్తున్నాడు బ్రహ్మయ్యశాస్త్రి. పతంజలి ముఖంలో దాచుకుంటున్నా దాగని మాటలకందని నిరాశ, నిస్పృహ. బ్రహ్మయ్యశాస్త్రి గుండెల్లో గానుగ మరల ఒరిపిడి...

సూర్య నమస్కారం అయ్యాక, కాళ్లను యాంత్రికంగా జరుపుతూ, ఒడ్డుకు వచ్చి మౌనంగా అంగవస్త్రం మార్చుకున్నాడు పతంజలి.

ఇద్దరూ మౌనంగానే ఇంటిముఖం పట్టారు.

దారిలో ఎదురయిన ఇద్దరు కుర్రాళ్లు శాస్త్రికి నమస్కరించి పతంజలితో, "ఏరా... మెడిసిన్‌లో జేరడానికి బెజవాడెళ్తున్నావా?" అని అడిగారు. ఏం చెప్పాలో తెలియని పతంజలి అవునన్నట్లో, కాదన్నట్లో అర్థం గానీయకుండా మధ్యస్థంగా తలాడించి, వెర్రి నవ్వు నవ్వి, తలొంచుకుని గబగబా ముందుకు సాగాడు. నరాలు తోడుకుపోతున్నట్లయినా శాస్త్రి కొడుకుని అనుసరించాడు. 'అవును... మా అబ్బాయి బెజవాడ మెడిసిన్‌లో జేరడానికి వెళ్తున్నాడూ' అని ఊరు ప్రకంపించేంతగా అరవాలనుంది గాని, తను అశక్తుడే! ఆర్థికంగా నిలదొక్కుకునే శక్తి భగవంతుడు తనకివ్వలేదు! స్కూలు మాస్టరుగిరి సంసారం ఈదడానికే బొటాబొటిగా సరిపోతోంది.

ఇద్దరూ మౌనంగా ఇంటికి చేరేసరికి, వరండాలో కుర్చీలో తమ కోసం ఎదురుచూస్తున్న రామదాసు కనిపించాడు.

"ఏం రామదాసూ... బాగున్నావా?" అన్నాడు శాస్త్రి.

"బాగానే ఉన్నాలే" అన్నాడు రామదాసు ముక్తసరిగా.

"ఏవిటి విశేషాలు రామదాసూ? అంచెలంచెలుగా ఎదిగావు. ఎమ్మెల్యేవయ్యావు. నాకు చాలా ఆనందంగా ఉందయ్యా" అన్నాడు శాస్త్రి, స్నేహితుడి చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ ఆనందంగా.

"నీకానందంగానే ఉంటుందిలే. నాకు మాత్రం మా సెడ్డ కోపంగానూ, బాధగానూ వుంది మరి" అన్నాడు రామదాసు, చేతులు





విడిపించుకుంటూ.

స్నేహితుడు కోపంతో ఉన్నట్లు నటిస్తూ పెట్టిన ముఖాన్ని చూస్తూ ఒళ్లు కుదుపుతూ నవ్వుతూ, "దేనికయ్యా కోపం? " అనడిగాడు శాస్త్రి.

సగ్రుమన్నాడు రామదాసు ఉడుకుమోత్త నంగా.

"ఉండదయ్యా మరి? నేనేమో పూరి గుడిసె లెవెల్నుంచి అద్దాలమేడ లెవెల్కి పెరిగాను. నువ్వేమో మారాజు స్థాయి నుంచి పూరిగుడిసె స్థాయికి దిగజారిపోయావు. నీకు మిగిలిన ఆస్తి ఏంటయ్యా అంటే ఆత్మాభిమానం ఒక్కటే. కాదంటే పిల్లకాయలకి నాలుగు ముక్కలు సదువు సెబ్తూన్న తృప్తి కూడా ఉంకోటుందంతే. కాదంటావా? "

స్నేహంతో స్వేచ్ఛగా కోప్పడుతూన్న రామదాసుని చిరునవ్వుతో చూశాడు శాస్త్రి. రామదాసు చిన్నప్పట్నుంచీ ఎంతో సంస్కారంతో మసులుకుంటున్నాడని, ఈనాడు భాషలో కూడా చాలా మట్టుకు యాసని జయించి, నాగరికతని అలవరచుకున్నాడని తను సంతోషిస్తుంటాడు.

"అట్టా నవ్వుతావేంటయ్యా తిడతాంటే? " రామదాసు కోప్పడ్డాడు.

శాస్త్రికి ఇంకా నవ్వొచ్చింది. "ఏవిటి రామదాసూ... ఈవాళ ఇట్లా విరుచుకుపడుతున్నావు నామీదా? " అనడిగాడు.

"కడుపుమంటయ్యా మరీ... ప్రేణానికి ప్రేణమయిన స్నేహితుడి కుటుంబం ఇట్టా ఎండిపోతున్న పూలతోటయిపోతుంటే, కడుపు రగిలిపోదంటయ్యా మరి? !"

"ఏవయ్యిందయ్యా ఇప్పుడూ? "

"ఏవయ్యిందా? నీ కొడుకుని ఎంబిబిస్ సదివించడానికి బెజవాడ పంపట్లేదంటగా? "

తల దించుకున్నాడు శాస్త్రి. "అవును రామదాసూ... ప్రస్తుత పరిస్థితుల్లో పంపలేను"

"అవును మరి! ఉన్న ఆస్తంతా నా బోటి గోళ్ల ఉద్ధారణకే సరిపోతే, కన్నబిడ్డల బాగోగులు సూసుకోడానికి ఏడ మిగులుద్దీ? "

స్నేహితులిద్దరి మధ్య ఆ తర్వాత ఓ నిముషంపాటు నిశ్శబ్దానిదే రాజ్యం.

శాస్త్రి తల నెమ్మదిగా కిందకు వాలుతుండగా, డగ్గుత్తికపడ్డ కంఠంతో బతిమాలుతూ అన్నాడు రామదాసు, "శాస్త్రీ! నిన్ను మందలించేపాటి గొప్పోణ్ణటయ్యా నేను, చెట్టంత స్నేహితుడికి నోరిప్పి సమస్య సెప్పుకోవన్న కోపం దహించేత్తాందయ్యా నన్ను. మీ తాతగారు, తండ్రిగారు మా కుటుంబానికి చేసిన సాయంలో వందోవంతయినా రుణం తీర్చుకునే శాన్సు నాకివ్వవయ్యా. ప్లీజ్... "

తలెత్తి రామదాసు కళ్లల్లోకి వివశుడై చూశాడు శాస్త్రి.

"నీ కొడుకు బెజవాడలో డాక్టరీ సదవడానికి అవుసరమైన సొమ్ము నేసర్దుతాను... కాదనకు. నీ స్నేహితం కారణంగానే నాలుగు ముక్కలు నేర్చుకున్నాను. పైకి ఎట్టా ఎదగాలో తెలుసుకున్నాను. ఈనాడు ఎమ్మెల్యేని కూడా అయ్యాను గదా! మీరు నిలబెట్టిన నిచ్చెన ఎక్కి, కిందకు ఎక్కొచ్చిన మెట్ల వేపు చూసుకోకపోతే... అన్యాయమైపోతాను. కొంతయినా రుణం తీర్చుకుంటానయ్యా... "

అవాక్కయిపోయి చూస్తున్నాడు శాస్త్రి.

రామదాసు చటుక్కున చేతులు జోడించాడు.

ఆ చేతుల్ని అందుకుని దించుతూ, "రామదాసూ... అప్పుగా అయితే... నాకు... సమ్మతమే... " అన్నాడు శాస్త్రి బలవంతాన గొంతు పెగల్చుకుని.

రామదాసు ముఖం చిచ్చుబుడ్డిలా వెలిగింది. మనసు తేలికయింది. 'నీ పిచ్చి నీది' అంటూ స్వేచ్ఛగా భారం తీర్చుకున్న తృప్తితో నవ్వేశాడు.

అప్పుడే లోపల్నుంచి బయటకొస్తూ, వీళ్ల సంభాషణ విన్న పతంజలి కళ్లు మిలమిల

# All that glitters is not gold

Similarly, all black tanks are not SINTEX



WORLD'S **Sintex** NO.1 WATER TANKS

MADE WITH VIRGIN PLASTIC







**Reno**

**WATER TANKS**



**INSULATED (ICE) BOXES**




**MILK CANS**




**DRUM**

**Bins**




KEERTIKAAR

# hindustan traders

VISAKHAPATNAM: 0891-2569727, 5566727

RAJAHMUNDRY : 0883-2471335

VIJAYAWADA : 0866-2576411

లాడాయి.

"ఆ దేవుడికి నమస్కరించు" రామదాసుని చూపిస్తూ కొడుకుతో అన్నాడు శాస్త్రి. పతంజలి రివ్వున వచ్చి రామదాసు కాళ్లకి నమస్కరించి, కళ్లకు అద్దుకున్నాడు.

బిత్తరపోయి, బిడియపడిపోయాడు రామదాసు.

"తయారవ్వమ్మా... బెజవాడెళ్దాం. కాలేజీలో జేర్దుగాని" అన్నాడు ఉత్సాహపర్చుతూ.

ఆనందంగా లోపలకు పరుగెత్తాడు పతంజలి.

భాస్కర్, శాస్త్రి, గాయత్రి హైదరాబాద్ బస్సుల ఎలైటింగ్ పాయింట్‌కి నెమ్మదిగా చేరుకుంటుండగానే హైదరాబాద్ నుంచి 'గరుడ' బస్సు వచ్చింది.

అందులోంచి మొదట దిగిన వ్యక్తి రామదాసే.

దిగుతూనే కళ్యాణిని చూస్తూ, "ఏమ్మా... ఎట్టావుంది బెమ్మయ్య శాస్త్రిగారబ్బాయికి?" అని ప్రశ్నించాడు గాభరాగా.

"ఏం కంగారుపడక్కర్లేదు. బాగానే ఉందట" అంది కళ్యాణి తడబడకుండా జాగ్రత్తపడుతూ.

"హమ్మయ్య... అసలేం జరిగిందంట?" మరో ప్రశ్న సంధించాడు రామదాసు.

సమాధానాన్ని ఏ విధంగా మాటలు పేర్చుతూ చెప్పాలా అని కళ్యాణి ప్రిపేర్ అవుతూండగానే భాస్కర్, శాస్త్రి, గాయత్రి వాళ్ల దగ్గరకు చేరుకున్నారు.

వాళ్లను చూస్తునే రామదాసు "నమస్కారం లెచ్చరర్‌గారూ" అని భాస్కర్‌తో అని, శాస్త్రితో "ఏం పర్లేదటయ్యా, అమ్మాయి సెబ్తోంది" అని, గాయత్రితో "కంగారు పడకండమ్మా. ఏంకాదు. నేనున్నాను, లెచ్చరర్ గారున్నారు" అన్నాడు ధైర్యం కలిగిస్తూ.

"ముందు మనం మెడికల్ కాలేజీ హాస్టల్‌కి వెళ్దాం పదండి. మన పిల్లాణ్ణి మనం కలిసి మాట్లాడితే, టెన్షన్ తగ్గి, మనసులకి హాయిగా ఉంటుంది. అప్పటిదాకా ఏమీ కాకపోయినా ఏదో కొద్దోగొప్పో కంగారు తప్పదు..." అని అందర్నీ బస్సుస్టేషన్ బయటకు నడిపించి, టాక్సీని మాట్లాడాడు భాస్కర్.

మెడికల్ కాలేజి హాస్టల్‌కి చేరింది టాక్సీ.

నాగుబాబు రూముకు చేరారందరూ, రామదాసు ఆదేశానుసారం.

కొడుకు రూము తలుపు తట్టాడు రామదాసు, గిజగిజలాడే గుండెల్తో.

వెంటనే తలుపులు తెరుచుకోలేదు.

అందరిలో ఆత్రుత, కంగారు, ఆందోళన.

రామదాసు తిరిగి దబదబా బాదాడు, కొడుకు గది తలుపుల్ని.

తలుపులు తెరుచుకున్నాయి, "ఎవరయ్యా అదీ" అన్నాడు నాగుబాబు విసుగ్గా. సెంటు వాసన గుప్పుమంది. చాలా ఫ్రెష్‌గా వున్నాడు నాగుబాబు. తండ్రినీ, వెనగ్గా ఉన్న ఇతరుల్నీ చూసి కంగుతిన్నాడు.

"నాన్నగారూ... మి...మ్మీరా...?" అన్నాడు తడబడ్తూ.

"పతంజలి కెట్టావుంది?" అనడిగాడు రామదాసు కంగారుగా.

"లోనికి రండి నాన్నా" అతి వినయం నటిస్తూ, ఆహ్వానించాడు నాగుబాబు.

"పతంజలెక్కడాని అడుగుతున్నా. ఆయబ్బాయి రూంలోనే ఉన్నాడా?"

"చెబుతా! ముందు మీరసలు లోనికి రండీ" నాగుబాబులో కంగారు.

"కాదెహె! కుర్రోడెక్కడున్నాడ్రా? ఎట్టా వున్నాడో అజ్జెప్పు ముందు"

నాగుబాబుకు చెమటలు పడ్తున్నాయి. "అసలు ఇప్పుడూ మీరింత అర్జెంటుగా ఎట్టా హొచ్చారు...?" మాటలు సాగదీస్తున్నాడు.

అరిచాడు రామదాసు కోపంగా, "నేనా కుర్రోణ్ణి ముందు సుడాల్రా గాడిదకొడకా..." అని.

"మీరు... మంచినీళ్లు..." అంటూ నాగు బాబు ఏదో చెప్పబోతూంటే, "నేనా కుర్రోణ్ణి సూసేదాకా పచ్చి మంచినీల్లు ముట్టనెహె, నడుముందు..." అని వాడి జబ్బ పట్టుకుని, బయటకు గుంజాడు రామదాసు.

బ్రహ్మయ్యశాస్త్రి వారించబోయాడు గాని, రామదాసు వినిపించుకోకుండా, కొడుకుని నెట్టుతూ ముందుకు సాగుతున్నాడు. మిగిలిన అయిదుగురూ వాళ్లని అనుసరిస్తున్నారు, అదిరే గుండెల్తో.

పతంజలి తల్లిదండ్రులు, నాగుబాబు తండ్రి, యింకో ముగ్గురు స్నేహితులు వచ్చారని విని, హాస్టల్ గదుల్లోంచి విద్యార్థులు ఒకరొకరుగా బయటకు రాసాగారు. వచ్చిన వాళ్లు దూరం దూరంగా వీళ్లని ఫాలో అవుతున్నారు.

ఓ మూలకున్న గదిని చేరుతుండగా, ఏవో పిచ్చి అరుపులు, కేకలు వినిపించసాగాయి.

నాగుబాబు మొహంమీద ధారలుగా చెమట కారుతోంది. భయం భయంగా, అసహనంగా నడుస్తున్నాడు.

తమ గుండె చప్పుళ్లు తమకే వినిపిస్తూండగా, దడదడలాడే గుండెల్తో అతని వెనకే నడుస్తున్నారంతా.

ఒక్కసారిగా అరుపులు, కేకలు ఆగిపోయాయి.

ఒక తాళం వేసున్న రూము దగ్గర ఆగి, బితుకుబితుకుమంటూ చూస్తూ, "ఇదే... పతంజలి రూము" అన్నాడు నాగుబాబు.

"తాళం వేసుందేట్రా? ఆయబ్బాయెక్కడ? "

"లొ...ల్లోపలున్నాడు" తడబడ్డాడు నాగుబాబు.

అదిరిపడి చూశారందరూ.

రామదాసుకి నోటమాట రాలేదు. మనిషి లోపలుంటే, బయట తాళం...?!

"తాళం చెవెక్కడ? వార్డెన్ ఎవరూ లేరా? " అరిచాడు భాస్కర్, ఆందోళనగా చుట్టూ చూస్తూ.

దూరంగా పరుగెత్తుకొస్తున్నాడు వార్డెన్, చేతిలో తాళాల గుత్తితో.

గుండెల్లో రైళ్లు పరుగెత్తుతుండగా, ఒకరి చేతులొకరు గట్టిగా పట్టుకుని, రాతిబొమ్మల్లా కనురెప్పలు వాల్చకుండా అలా నిల్చుండిపోయారు శాస్త్రి దంపతులు.

వార్డెన్‌కి ఎదురు పరుగెత్తాడు యేసేబు.

"కుర్రోణ్ణి లోపలెట్టి తాళం యెట్టిన గాడిద కొడుకు ఎవరయ్యా? " అని పెద్ద బొబ్బపెట్టాడు రామదాసు, వార్డెన్ వస్తూన్న వైపు చూస్తూ.

తాళం చెవి యేసేబు చేతికందించి గాభరాగా ఒగుర్చుతూ, "పరిస్థితి కంట్రోల్ దాటిపోతూంటే ఏం చెయ్యమంటారు? మీకు తెలియజేయడమే బెటర్‌గాని, పోలీసు రిపోర్టిస్తే మరీ ప్రోబ్లెంగదా? అందుకనే తాళం పెట్టాం..." అన్నాడు వార్డెన్.

విషయం అర్థమయ్యీ, అర్థం కానట్లుండడంతో యేసేబుని తాళం తీయమన్నారు.

తాళం తీసి గడియ తీస్తున్న ధ్వని అవుతూనే, మళ్లీ లోపలనుండి, పిచ్చికేకలు, భయంతో కూడిన అరుపులూ, వస్తువులు విసిరేస్తున్న చప్పుళ్లూ వినిపించసాగాయి.

## రామకోటి

ఒకానొక భక్తాగ్రేసరుడు కొన్నేళ్లపాటు కష్టపడి రామకోటి రాశాడు. రాసుకున్నవాడు ఏ భక్తుడికో చూపించక నేరుగా వచ్చి నాస్తిక శిఖామణి రామస్వామికి చూపించాడు.

ఆయన దానిని ఒకసారి తేరిపార చూసి, 'ఇన్నేళ్లు కష్టపడి రాసినా కనీసం రెండక్షరాలు కుదురుగా రాయడం నేర్చుకోలేక పోయావ్' అన్నారు చిరాకుగా.







తెరచుకోవడానికి తలుపులు కూడా భయపడ్డాయి.

లోపల చీకటి.

అరుపులు ఎక్కువ అయ్యాయి.

శాస్త్రి గుండె దడదడలాడుతోంది.

గాయత్రి పేగు కొట్టుకుంటోంది.

లోపలికి చీకట్లోకి తొంగిచూడ్డానికి చెయ్యెత్తు భారీ మనిషి రామదాసుకి సైతం ధైర్యం చిక్కడంలేదు.

అర్ధరాత్రి రౌడీలను ఎదుర్కోవడానికి మొండి ధైర్యంగా ఒంటిరిగా ఇంటి బయటకి రాగలిగిన భాస్కర్ అరుపులు గుండెని తాకుతుంటే కదల్లేక పోతున్నాడు.

చిన్నప్పట్నుంచీ ఏజెన్సీ ఏరియాలో, గుబురు అడవుల్లో, చీకట్లలో, ఎలుగుబంట్లు స్వేచ్ఛగా సంచరించే గూడెంలలో పెరిగిన యేసేబుకి కూడా కాళ్లాడడం లేదు.

మిగిలివాళ్ల పరిస్థితి గమనించిన కళ్యాణి తెగించి, ధైర్యంగా "తమ్ముడూ" అంటూ ప్రేమగా పిలుస్తూ, గది లోపలకి నడిచి, వరండాలోని లైటు నుంచి పడుతున్న చిరు కాంతిలో పతంజలిని గమనించి, 'కెవ్వు' మని కేకపెట్టి, ఆందోళనగా బయటకు పరుగెత్తుకొస్తూ, నేలమీద కూలబడి వెర్రిగా ఏడవసాగింది, ముఖాన్ని కప్పుకుని.

మోకాళ్ల మీద కూలబడి, "ఏంటి కళ్యాణీ ఏమయింది?" అన్నాడు యేసేబు భయం భయంగా

"మీరే...వెళ్లి...చూడండి..." అంది కళ్యాణి వెక్కుతూ, నోట మాట స్పష్టంగా రాక.

భాస్కర్, రామదాసు, యేసేబు ఒక్కసారిగానే రూము లోపలకి పరుగెత్తారు.

మళ్లీ భయంకరమైన పిచ్చికేకలు, ఆ ముగ్గురి మీద వచ్చి పడుతూన్న చిరిగిపోయిన పుస్తకాలు...

గోడమీద వెతుక్కుని లైటు వేశాడు యేసేబు.

మంచం అవతల... గోడకీ, మంచానికీ మధ్య... చిరిగిన పరుపులోంచి బయటపడే దూది పింజల్లో... నగ్నంగా పతంజలి!

కాళ్ల కింద భూమి కదిలిపోతున్నట్లయ్యింది ముగ్గురికీ.

లైటు వెలిగేసరికి, వచ్చిందెవరో తెలియక, భయంతో గజగజ ఒణికిపోతూ, కళ్లు మూసుకుని, కంఠనాళాలు తెగిపోయేలా పిచ్చి అరు





పులు అరుస్తున్నాడు పతంజలి.

బలవంతం మీద రామదాసే ముందు గొంతు పెగల్చుకున్నాడు... "బాబూ! నేను నాన్నా... రామదాసుని" అన్నాడు.

"ఏం భయలేదమ్మా... నేను భాస్కర్‌ని" అన్నాడు భాస్కర్.

అరుపులు ఆగిపోయాయి.

ముఖాన్ని కప్పుకున్న వేళ్ల సందుల్లోంచి వీళ్లని చూశాడు పతంజలి.

సునామీలా కెరటాలు కెరటాలుగా దుఃఖం నాభి దగ్గర ప్రారంభమై కట్ట తెంచుకుని బయట పడుతుండగా, కెరటంలాగే క్రమేపీ పైకి లేస్తూ, మంచం మీద కాలు మోపుకుని మీదకు గెంతుతూ, రామదాసు మెడకు చేతులు చుట్టి ఆయన్ని కరుచుకుపోతూ, "బాబాయి గారూ..." అంటూ బావురుమన్నాడు పతంజలి.

ఓ మూలగా పడివున్న దుప్పటిని గబగబా పతంజలికి చుట్టబెట్టి, రామదాసు భుజం మీదుగా వారిని పతంజలి ముఖం దిక్కుకి వచ్చి, అతని ముఖాన్ని రుమాలుతో తుడుస్తూ, అతని తల నిమురుతూ, ధైర్యం చెప్పాడు భాస్కర్.

వెక్కిళ్లు తగ్గేవరకూ పతంజలి వీపు నిమిరాడు రామదాసు.

ఏం భయంలేదు నాన్నా... ఏం భయంలేదం"టూ. పతంజలి అరచేతిని స్నేహపూర్వకంగా, ధైర్యం కలిగిస్తూ





ఒత్తసాగాడు యేసేబు.

వరండాలో అభావదృష్టులతో రాతి బొమ్మల్లా నిలబడి వున్నారు శాస్త్రి, గాయత్రి.

కళ్యాణి తేరుకుని, గాయత్రికి చేరువై ఆవిడ జబ్బలచుట్టూ చేతులుంచి ధైర్యం కలిగిస్తూ, సానుభూతిగా నిలబడింది.

పతంజలిని భుజానికి ఎత్తుకున్న రామదాసు బయటకొచ్చాడు. భాస్కర్ బయటకొచ్చి శాస్త్రికి 'ఏం భయంలేదన్నట్లు'గా సంజ్ఞ చేస్తూ, ఆయన జబ్బ పట్టుకున్నాడు ఊతకోసం.

పళ్ల బిగువున నాగుబాబు మీద కోపాన్ని అణచుకుంటూ, అతన్ని చురచుర చూస్తూ అదురుతున్న కణతలతో బయటకొచ్చాడు యేసేబు.

నాగుబాబు భయంభయంగా తండ్రి ముందుకొచ్చి, "నాన్నగారూ... అసలేటి జరిగిందంటే..." అంటూ ఏదో చెప్పబోతుండగానే, రామదాసు చాచి గూబ పగిలేలా కొట్టాడు. భాస్కర్ అడ్డుపడకపోతే మరో దెబ్బకు వాడు స్పృహ తప్పి కింద పడేవాడే.

"చెప్పు... ఏటి జరిగిందీ...?" ఉరిమాడు రామదాసు, కంట్రోల్ చేసుకోవడానికి విఫల యత్నం చేస్తూ.

అసలే భయంతో ఉన్నాడు. ఆపైన చెంప పగిలింది. నిజం తెలిసిపోతుందేమోనన్న భయం. నాగుబాబు ఒణికిపోతున్నాడు.

"చెప్పరా గాడిద కొడకా..." రామదాసు కళ్లు నిప్పులు కక్కుతున్నాయి.

"ఎవరో... సీనియర్లు... ఈ కుర్రోణ్ణి... ర్యాగింగ్..." కొడుకు నడినెత్తి మీద బలమైన తన చేత్తో చరిచి, వేళ్లకు అందినంత జుట్టు పట్టుకుని వాడి తలని గుంజేస్తూ, "ఏ తొత్తుకొడుకుకంత ధైర్యం ఉందిరా" అంటూ పెద్ద బొబ్బపెట్టి, వాణ్ణి వెనక్కి విసిరేసి, వార్డెన్‌తో, అక్కడ గుమికూడిన యితర విద్యార్థులతో, "ఎందుకయ్యా... ఎందుకయ్యా... సదువులు మీకు? లేగదూళ్లాంటి కుర్రోడిని యిట్టా హింస పెడ్తాంటే మీలో ఒక్కడికయినా అడ్డుకోవడానికి చేవలేకపోయిందా?" అని ఉరిమి, శాస్త్రి దంపతుల వైపు తర్జనితో చూపిస్తూ, "ఆ కన్నపేణాల ఉసురు మీకు కూడా తగల్దంటయ్యా..." అంటూ గద్గదికతో, భాస్కర్‌తో, "నడండి లెక్చరర్ గోరూ... కుర్రోడిని ఆస్పిటల్‌కి తీసుకెళ్దాం" అంటూ, కళ్లు తుడుచుకుంటూ గేటువైపు నడవసాగాడు రామదాసు.

రామదాసు ఆక్రోశాన్ని అర్థం చేసుకున్న హాస్టల్ విద్యార్థుల్లో కొందరి ఛాతీలు ఆవేశంగా పొంగడం, వాళ్లు నాగుబాబువైపు మింగేసేలా చూడడం గమనించాడు భాస్కర్. ముందు పతంజలి క్షేమం ముఖ్యం కాబట్టి, మిగిలిన వారితోబాటు తనూ రామదాసుని అనుసరించాడు.

## 7



తమకు పరిచయం ఉన్న సైకియాట్రిస్టు మిత్రుడిని కాంటాక్ట్ చేసి, ఓ మల్టీస్పెషాలిటీ హాస్పిటల్లో జాయిన్ చేశారు పతంజలిని. కొద్ది రోజులుగా తిండి తిప్పలు మానేసి చిక్కిశల్యమైపోయిన అతణ్ణి శారీరకంగానూ, మానసికంగానూ బలవంతుడిని చెయ్యడానికి.

శాస్త్రి దంపతులతో "ఏం ఫరవాలేదు. మా స్నేహితుడు చాలా మంచి డాక్టరు. ప్రత్యేక శ్రద్ధ తీసుకుని ట్రీట్ చేయిస్తాడు పతంజలికి. రెండు మూడు రోజుల్లో మెరుగుపెట్టిన



బంగారంలా వస్తాడు బయటకు" అన్నాడు భాస్కర్ ధైర్యం కలిగిస్తూ.

"రేపసలు అసెంబ్లీ ఓ ఊపు ఊపె య్యనూ మనోడి పరిస్థితి జెప్పి. ముఖ్యమంత్రి సేత సెప్పిస్తా ఆస్పత్రోళ్లకి. కుర్రోడ్ని జార్తగా సూడమని. ఏం బెంగలేదు" అన్నాడు రామదాసు ఆవేశంగానూ, ధైర్యం కలిగిస్తూను. ఆపైన, "రేగింగ్ అంట రేగింగ్. అమ్మ, బాబూ తలకాయలు తాకట్టు పెట్టి, ఆళ్లవీ ఈళ్లవీ కడుపులు, కాళ్లూ అట్టుకుని, అబిమానం సంపుకుని, ఈళ్లేదో ఉద్ధరిస్తారనుకుని సదివిత్తూంటే- కుర్రనాయాళ్లు ఏదో సరదాగా ఆసికాలాడుకోవాలి, ఆడుకోవాలి, ఆనందించాలి, సదూకోవాలి కలిసికట్టుగా. అంతేకాని, హింసించుకోడం, నాశినం చేసుకోడం, పేణాలు తీసుకునేలా జెయ్యడం, పిచ్చెక్కించడం, ఛీఛీ... మడుసులు జేసే పనేనా ఇదీ? చెబ్తా... రేపు అసెంబ్లీ వూగిపోవాల..." అన్నాడు స్వగతంగా అంటున్నట్లుగా.

రామదాసుతో, "అంకుల్... ఇంటి దగ్గర కంగారు పడ్తూంటారు..." అంటూ కళ్యాణి , ఏదో చెబ్తూండగానే, "అవునమ్మా... నీ సంగతే ఆలోచించలేదు ఈ కంగారులో. బయల్దేరు తల్లీ ఆలీస్యెం అయిపోయింది" అన్నాడు రామదాసు.

"అహఁ... అది కాదు. నేను వెళ్తానుగానీ, మీరూ, ఈ బాబాయిగారూ, పిన్నిగారూ కూడా మా ఇంటికొచ్చేయండి. రాత్రికి ఉండి పొద్దున్నే వద్దురుగాని. హాస్పిటల్లో ఒక్కరే అటెండెంట్‌ని ఉండనిస్తారు..." అని ఆమె అంటూంటే, యేసేబు "ఈ రాత్రికి హాస్పిటల్లో నేనుంటాను" అన్నాడు.

"లేదులే యేసేబూ... నువ్వు వెళ్లిపో. నేనుంటానులే. ఏ అవసరమొచ్చినా చూసుకోవడం నీకు కష్టమౌతుంది. అవసరమయితే రేపుందువుగానిలే" అన్నాడు భాస్కర్.

అయిష్టంగానే, తన సర్వీసు మిస్ అవుతోందే అన్న భావంతో నిరుత్సాహంగానే, అలాగే అన్నట్లు తలవూపాడు యేసేబు.

"ఓ పన్జేద్దాం. రేపు నేను ఈ ఇషయం కోసమన్నా హయిద్రాబాద్‌లో వుండాల. కాబట్టి లెక్చరర్‌గారు హాస్పిటల్లో కుర్రోడికి తోడుంటారు. ఈ కుర్రోడు ఎళ్లిపోయి యిశ్రాంతి తీసుకుంటాడు. మా శాస్త్రి, ఆయమ్మా కళ్యాణితో ఆమె యింటికెల్లి ఇశ్రాంతి తీసుకుని, పొద్దున్నే వొత్తారు" అన్నాడు రామదాసు ఫైనల్ డెసిషన్‌గా.

"మా ఇద్దరిలో ఎవరో ఒకరం హాస్పిటల్లో బాబుతోబాటు వుంటాం" అని ఏదో చెప్పడానికి శాస్త్రి దంపతులు ఇద్దరూ బతిమలాడుతూ ప్రయత్నించారు గాని, మిగిలిన నలుగురూ వద్దని వారించారు.

"ఇంకో ఆలోచనేం అక్కర్లేదు. ఉప్పుడే నేను బస్టాండు కెల్లిపోయి, హయిద్రాబాదెల్లిపోతాను. మీరంతా నేను సెప్పినట్టు జెయ్యండి" అన్నాడు రామదాసు.

అందరూ అంగీకరించారు.

భాస్కర్ తప్ప మిగిలిన వాళ్లంతా బయలుదేరారు హాస్పిటల్ బయటకు.

* * *

ఓ మూల పేటలోని తన చిన్న రూముకి

## ఒప్పుకోను

తమ సూత్రాశ్రమంలోకి వస్తున్న ఒక పెద్దమనిషిని ఎదురొచ్చి ఆహ్వానించారు త్రిపురనేని. అంతటితో ఆగకుండా నీళ్లు తెప్పించి ఆయన పాదాలు కడిగారు. త్రిపురనేనిలాంటి వ్యక్తి కాళ్లు కడగడమేంటని ఆశ్చర్యపోయిన సదరు పెద్దమనిషి అంతలోనే తేరుకుని ఆయనను వారించారు.

'తప్పదు.. బురదకాళ్లతో నా ఆశ్రమంలోకి అడుగుపెడతానంటే ఒప్పుకోను' అన్నారు త్రిపురనేని సీరియస్‌గా.







జేరి, అన్నం తినబుద్ధికాక, ఓ గ్లాసు మంచినీళ్లు తాగి, పక్క మీద వాలిన యేసేబుకి వారం రోజుల క్రితం తన మెడికల్ కాలేజీ మిత్రుడు రామిరెడ్డి చెప్పిన ర్యాగింగ్ ఉదంతం గుర్తుకొచ్చి, కళ్లముందు ఆడు తోంది. రామిరెడ్డి కూడా నాగుబాబు క్లాసు వాడే. నాగుబాబు... తండ్రి పతంజలి మీద ఎక్కువ ప్రేమ చూపిస్తున్నాడన్న కసితో ర్యాగింగ్ పేరున అతన్ని తన కాలికింద చెప్పుని చేసుకుని, ఆడించి తృప్తి చెందాలని ప్రయత్నిస్తున్నాడని చెప్పాడు. తను అను కుంటున్నట్లే అన్నీ జరుగుతుండడంతో తాగిన మైకంలో నాగుబాబు తనకీ, తన ఫ్రెండ్సుకీ ర్యాగింగ్ ఎంత జయప్రదంగా జరుగుతోందో వర్ణించి చెప్పేవాడని, తను చెబ్తున్న విషయాలని వినకపోతే కూడా కొట్టేవాడని, విపరీతమైన ఒళ్లు పొగరుతో నాగుబాబు రెచ్చిపోతున్నాడని, తన తండ్రి అధికార పార్టీ ఎమ్మెల్యే అని, అవసరమైతే చీఫ్ మినిష్టర్ని కూడా కాలేజీకి తెప్పించి, తన మాట వినని వాళ్లకు టిసి ఇప్పించేస్తా నని బెదిరిస్తుంటాడని చెప్పాడు. వారంక్రితం పతంజలిని రేగింగ్ చేసినప్పుడు నాగుబాబు యిప్పించే బీర్‌కి కక్కుర్తిపడి, వాడి మాటకి భయపడి, తను కూడా పాల్గొన్నానని జరి గింది పూస గుచ్చినట్లు చెప్పాడు. వాడు చెప్పినదంతా వాడు నాగుబాబు నోట విన్నదీ, వాడు ప్రత్యక్షంగా పార్ట్నర్ అయి పార్టిసిపేట్ చేసినదీ... ఇప్పుడు తన కళ్లె దుట బొమ్మ కడ్తున్నాయి. తన గుండెలతో బంతాట ఆడుకుంటున్నాయి. తనని అసహ నానికి గురిచేస్తున్నాయి. చదువుకోవడ మంటే... విద్యావంతులు కావడమంటే... అసలు ఉద్దేశం ఏమిటా అనే సంశయానికి గురిచేస్తున్నాయి. పతంజలి లాంటి సున్నిత మనస్కుడైన పల్లెటూరి కుర్రవాడు ఎంతటి నరకయాతన అనుభవించాడో ఊహకి అందుతుంటే పిడికిళ్లు బిగుసుకుంటున్నాయి.

'... తల్లిదండ్రుల వద్ద తప్ప ఎన్నడూ ఎక్కడా ఉండడం అలవాటు లేని పతంజ లికి హాస్టల్ వాతావరణం అంతా కొత్తగా వుంది. తనకేం అవసరం వచ్చినా, వారబ్బా యిని కలిసి చెప్పమన్నాడు రామదాసు బాబాయిగారు. కానెందుకో అతనికి చెప్పా లంటే బిడియంగానూ, బెరుగ్గానూ ఉంది. అతని రూము దగ్గరకెళ్లినప్పుడు, తలుపులు బిగించుకుని వున్న ఆ రూములోంచి విని పించే నవ్వులూ, కేరింతలూ, అరుపులూ తన గుండెల్ని అదరగొడ్తాయి.

ఓరోజు స్నానం ముగించుకుని, పూజ చేసుకుని, బట్టలు మార్చుకుని, టిఫిన్ చెయ్య డానికి బయలుదేరాడు పతంజలి. డైనింగ్ హాల్లోకి అడుగు పెట్టబోతూంటే నలుగురు సీనియర్లు చుట్టుముట్టారు. ఆపైన వాళ్లు వేస్తున్న ఎగతాళి ప్రశ్నలకి భయం వేసింది పతంజలికి. నోటమాట రాలేదు. 'ఫెయిల య్యావు' అంటూ కళ్లు మూసి, జెల్లకాయలు కొట్టారు. గోళ్లు దిగిపోయేలా బుగ్గలు పిండారు. ఒంటికాలిమీద ఆడపిల్లల డైనింగ్ టేబుల్ చుట్టూ గెంతించారు.

ఏడుపొచ్చిన పతంజలికి టిఫిన్ చెయ్యబు ద్ధి కాలేదు. ఉడుకుమోతుతనంగా, చెప్పుకోవ డానికి నాగుబాబు రూమువైపు నడిచాడు వేగంగా.

తలుపుని మెత్తగా తోశాడు. లోపల గడి యపెట్టి లేకపోవడంతో, తలుపు తెరుచు కుంది.

డ్రాయరు, బనీనుతో బస్కీలు తీస్తున్నాడు నాగుబాబు. "ఏంటీ" అన్నాడు పతంజలితో, కుర్చీలో కూర్చుంటూ తాపీగా, రెక్‌లెస్‌గా.

జరిగింది చెప్పాడు పతంజలి.

నాగుబాబు నిలువుగా ఓసారి తలూపి, "ఊఁ" అంటూ నిట్టూర్చి, "బయంలేదులే బెదరూ... నేన్చూస్తాలే" అన్నాడు.

పతంజలికి కొండంత ధైర్యం వచ్చింది.



## సర్వరోగ నివారిణి




"మీరు మానసిక వత్తిడితో బాధ పడ్తున్నారా? రక్తపోటుతో అల్లాడుతు న్నారా? మధుమేహ వ్యాధి, వెన్ను నెప్పి, అలసత్వం, ఇంకా... ఇంకా..." ఏమిటండీ, ఏదో సపట్ మలామ్ అడ్వ ర్టయిజ్ మెంట్ లా అడుగుతున్నారు అన కండి. ఇలాంటి వాటన్నిటికి సర్వరోగ నివా రణి లాంటి ఆసనం 'శవాసన'మంటున్నారు యోగానిపుణులు.

రోజుకి రెండుసార్లు శ్రద్ధగా శవాసనం వేస్తే చాలట. వెల్లకిలా పడుకుని, కళ్లు మూసుకుని, కాళ్లు, చేతులు వెడల్పుగా జాపుకుని విశ్రాంతిగా పడుకోవాలి. శ్వాసమీద ఏకాగ్రత నిలిపి, మెల్లగా గాలి పీల్చి వదులుతూ... ఎక్కువసేపు గాలిని వదులుతుం డాలి.

దీనివల్ల మానసిక వత్తిడి తగ్గి, విశ్రాంతి పొందుతాము. రక్తనాళాల్లో రక్తప్రసరణ ఉధృతి తగ్గి, రక్తపోటు అదుపులోకి వస్తుంది. మందూ మాకూ, డబ్బూ దస్కం లేకుండా హాయిగా పడుకుని వేసే శవాసనంతో ఈ జబ్బుల భరతం పట్టేయ వచ్చు. -అందుకే శవాసనముండగా ఔషధాలు దండగ అంటున్నారు యోగా నిపుణులు.

ఎదురుగా ఉన్న కుర్చీలో కూర్చోబోయాడుగాని, నాగుబాబు ఆ కుర్చీలోకి కాళ్లు చాపుకున్నాడు. పతంజలి నిలబడే ఉండిపోయాడు.

"ఆళ్లు చేసిన అల్లరిని ర్యాగింగ్ అంటారు. సీనియర్స్ జూనియర్స్‌ని అలాగ అల్లరి పట్టి స్తారన్నమాట. కాన్నువ్వేం బయపడమాక. నేన్నిన్ను నా కేండిడేట్ గా ఏసుకుంటాను. నా కేండిడేట్ అంటే ఎవ్వరూ నీ జోలికి రారు. కాన్నేను నీ చేత పన్లు జేయించుకో వాలి. నువ్వు నేన్జెప్పినట్టలా వినాలి. నేను సీనియర్‌ని కాబట్టి, నువ్వు నాకు బయబ క్తుల్తో పనులు చేత్తున్నావని ఆళ్లు నమ్మాలి. అర్థమైందా బ్రెదరూ?" అన్నాడు నాగుబాబు తాపీగా.

అర్థమైంది అన్నట్లుగా తలూపాడు పతం జలి.

మొలకి తువ్వాలు చుట్టుకుని, "ఇవుగో... ఈ బనీను, డ్రాయరు వరండాలో దండెం మీద ఆరేసిరా" చెమ టకు తడిసిన వాటిని విప్పి, పతంజలికి చూపించాడు నాగుబాబు.

తెల్లబోయాడు పతంజలి.

"చెప్పాగా... నేను సీనియర్ని, నువ్వు జూనియర్‌వి. నా కేండిడేట్‌వి. నేను చెప్పి న మాట ఇనకపోతే బయటకెళ్లిపో. ఆ తర వాత ఆళ్లు నిన్నేం చేసినా నా పూచీలేదు మరి"

కళ్లు మూసుకుని, మునివేళ్లతో పట్టుకుని డ్రాయరు, బనీను ఆరేసి వచ్చాడు పతం జలి.

"గుడ్... రా... కొంచెం ఒళ్లు పట్టు! ఒళ్లంతా నొప్పులుగా వుంది" అంటూ మంచానికి అడ్డంగా బోర్లా పడుకున్న నాగు



బాబుని బిత్తరపోయి చూశాడు పతంజలి.

"రావాలీ" అన్నాడు నాగు బాబు, కసితీరేలా ఆనందం లోనుండి తన్ను కొస్తుండగా.

యాంత్రికంగా కదిలాడు పతంజలి.

ఇంకోరోజు...

"ఈవాళ్ల ఫ్రెండ్సుకి పార్టీ యిస్తన్నాను. నువ్వట్టా డల్‌గా కాక యాక్టివ్‌గా వుండాలి బ్రెదరూ" అన్నాడు నాగుబాబు.

పతంజలి చిన్నగా నవ్వాడు.

"వెర్రీగుడ్.. ఉంకో అయిదు నిముషాల్లో వొచ్చేత్తారు ఆళ్లు. మరి బ్రెదరూ... ఆ బూట్లు చూడు నాయి. మావోళ్లు ఆటిని చూత్తే ఇన్సల్టుగా వుండదూ? చక్కగా పాలిష్ చేసేయమ్మా"

ఖంగుతిన్నాడు పతంజలి

"తొరక్కానివ్వాలమ్మా బుజ్జీ" బుగ్గ గిల్లాడు నాగుబాబు.

"బూట్ పాలిష్ చెయ్యడం నాకు రాదు" నీళ్లు నమిలాడు పతంజలి.

"చేత్తే అదే వస్తది... కానియ్"

పతంజలిలో కదలిక లేకపోవడంతో వేరే విధంగా కూడా భయపెట్టడానికి నిశ్చయిం చుకుని, "చూడు బ్రెదరూ... నీకు చదువు ముఖ్యం కదా. నీ చదువుకి నేను మా డాడీకి సర్టిఫికెటివ్వాలి. చదవకుండా, నా మాటసలు ఇనిపించుకోకుండా, నివ్విక్కడ పోకిరీ ఏసాలు ఏస్తున్నావని రిపోర్ట్ యిచ్చా ననుకో... దెబ్బకి నీ చదువుకి గండి పడ్తుం ది. అప్పుడు మీ ఊరెల్లి మంత్రాలు చదూ కోవాల్సిందే నువ్వు. అండర్‌స్టాండ్... కానియ్యి" అంటూ కసిరాడు.

పతంజలి కళలో నీళ్లు తిరిగాయి

యాంత్రికంగా బూట్లకు పాలిష్ చేశాడు.

"వెర్రీగుడ్... ఇంత బాగా చేసి, పాలిష్ చైడం రాదంటావేంటి? బలేవోడివే బ్రెదరూ. ఇంత చక్కటి విద్య నీకాడున్నందుకు నువ్వు గర్వపడాలసలు. మెడిసిన్ పూర్తికాలేదను కుందాం సపోజ్... ఇప్పట్లా మా డాడీ దగ్గరో, ఉంకోళ్ల దగ్గరో చెయ్యి సాపి అడు క్కోనక్కరలేకుండా, ఎంచక్కా ఈ ఆర్టు నీకు ఎంతో పనికొస్తది. నిజం" అంటూ భుజం తట్టాడు నాగుబాబు.

పతంజలి కళ్లనుండి నీళ్లు జర్రున జారి బూట్లమీద పడ్డాయి.

నాగుబాబు బిగ్గరగా నవ్వి, "ఓమ్మో, ఇదేంది కన్నీటి పాలిష్షా. బాగుంటుంది. షైనింగొస్తుంది" అంటూ అలమార్లోంచి తీస్తున్న వస్తువుల్ని వింతగా చూస్తున్నాడు పతంజలి. రెండు పెద్దసైజు బాటిల్స్, సిగ రెట్ ప్యాకెట్లు, పేకముక్కలు, ప్యాకెట్లలో మిక్చర్, జీడిపప్పు..

"ఉప్పుడు మన ఫ్రెండొస్తారు. ఆళ్ల ఎదు రుగా నేను చెప్పిన ఏ పనినీ కాదనకూడదు నువ్వు. ఆళ్లకి చా... లా కోపమొచ్చేస్తది. దాంతో ఆళ్లు చేసే ర్యాగింగ్‌ని నువ్వు తట్టు కోలేవు. పోయినేడాది నీలాంటి కుర్రోడే తట్టుకోలేక సూసైడ్ చేసుకున్నాడు"

పతంజలికి తల తిరుగుతున్నట్లుగా అని పించింది.

తలుపు చప్పుడయ్యింది

"ఎళ్ళి తలుపు తియ్"

భయంభయంగా వెళ్లి తలుపు తీశాడు పతంజలి.

వాళ్లు లోపలికి వస్తూనే కళ్లు మిటకరించి, "వా... వ్ లవ్లీ! ఏంటి బాస్- లేత కొబ్బ రిలా వున్న ఈ శాల్తీ మగోడా లేక మగ వేషం వేసిన ఆడపిల్లా?" అంటూ బుగ్గలు చిదిమారు. ఒళ్లంతా నిమిరారు.

"న్నేను... వెళ్తాను..." అన్నాడు పతంజలి బెరుగ్గా.

"అబ్బ, వెళ్దువుగానిలే... కూచో డాళింగ్" అంటూ ఒకడు దగ్గరకు లాక్కుని కౌగలించు



కున్నాడు. మరొకడు తన చేతిలోని ప్యాకెట్ ఓపెన్ చేసి, "లేడీస్ హాస్టల్ నుంచి కొట్టుకొచ్చాం...ఇదుగో, ఈ బట్ట లేస్కో" అంటూ చీర, లంగా, జాకెట్టు తెచ్చి, పతంజలి ముందుంచాడు.

బిత్తరపోయి చూశాడు పతంజలి.

వాళ్లు పకపక నవ్వుతూ, స్వేచ్ఛగా, దౌర్జన్యంగా, పతంజలి ప్యాంటు చొక్కా లాగిపడేసి, అతను తేరుకునేలోగానే లంగా తొడిగేసి, జాకెట్ ఎక్కించేసి, చీర చుట్టబెట్టేసి, నొసట ఓ స్టిక్కర్ అంటించేసి, "అబ్బ... ఇప్పుడు ఎంత ముద్దొస్తున్నా వో... అద్దంలో చూస్కో డార్లింగ్" అన్నారు, నిలువుటద్దం వైపుకు తోస్తూ..

అద్దంమీద పడబోయి, నిలదొక్కుకుని తన ప్రతిబింబాన్ని చూసుకున్న పతంజలి కొయ్యయి పోయాడు. ఒక్కపెట్టున దుఃఖం తన్నుకొచ్చింది.

నవ్వుతూ బాటిల్స్ ఓపెన్ చేశాడు నాగుబాబు.

వాళ్లంతా ఫుల్‌గా తాగారు. డాన్సు ప్రారంభించారు. గోలగా నవ్వుతూ, బూతు పాటలు గట్టిగా పాడుతూ, పంతజలిని ఒకరి మీదికొకరూ నెట్టుకుంటూ, అతని శరీరాన్ని యిష్టమొచ్చినట్లు నలిపేస్తూ, తాము కట్టిన బట్టల్ని మళ్లీ లాగేశారు.

లోపల ఒక్క డ్రాయరుతో మిగిలిన పతంజలి కుర్చీలో కూలబడి, చేతుల్లో ముఖం దాచుకుని ఏడవసాగాడు.

ఓ గ్లాసునిండా మందుపోసి, దాంతోబాటు పతంజలి పక్క కొచ్చి కూర్చున్నాడు నాగుబాబు. "అరెరె... చ్చ్చ్చ్.. ఏంట్రా యిదీ? ఇట్టాంటి నాజూకు కుర్రోళ్లతో ఎట్టా బిహేవ్ చెయ్యాలో తెల్దు మీకు! ఇందమ్మా, ఈ మందు తీసుకో... బాదంతా పోయి, హా...యిగా ఉంటది. కలిసిపోవాలి బ్రెదరూ... మంత్రాలు చదువుతూ, మడిగా కూసుంటే కుదర్దిక్కడ..." అంటూ పతంజలి నోటిని బలవంతంగా తెరిచి మందుపోసి, అది పొర్లిపోయి బయటకు వచ్చెయ్యకుండా నోరు మూశాడు.

పతంజలికి ఉక్కిరిబిక్కిరి అయిపోయింది. ఆ మందు ముక్కు రంధ్రాల్లోకి తన్నింది. పొరబోయింది. నెత్తిమీద కొట్టు కోసాగాడు.

"ఆc మందొక్కటీ పుచ్చుకుంటే అట్టాగే అవుద్ది మరి. ఇదుగో ఈ మటన్ పీస్‌ని బుగ్గన పెట్టుకో..." అంటూ ఒకడు ప్లేటుతో దగ్గరకొచ్చాడు.

పతంజలి నోరు తెరవకుండా శక్తికొద్దీ గింజుకున్నాడు.

మరో ఇద్దరు గోలగా నవ్వుతూ ముందుకొచ్చి బలవంతంగా

**ఇట్టాంటి నాజూకు కుర్రోళ్లతో ఎట్టా బిహేవ్ చెయ్యాలో తెల్దు మీకు! ఇందమ్మా ఈ మందు తీసుకో... బాదంతా పోయి, హా...యిగా ఉంటది. కలిసిపోవాలి బ్రెదరూ... మంత్రాలు చదువుతూ, మడిగా కూసుంటే కుదర్దిక్కడ..."**





పతంజలి నోటిని పెగలదీసి, ఆ ముక్కని అతని నోట్లో కుక్కారు. ఆపైన లేచి, అతని చుట్టూ చప్పట్లూ చరుస్తూ డాన్సు చేశారు.

వాళ్ల బారినుంచి తప్పించుకోలేకపోయిన పతంజలి నరాలు తెగిపోయేలా అరిచాడు. "అ... మ్మా..." అని.

ఆ నాలుగు గోడల మధ్య అతని స్వరం నిస్సహాయంగా గిలగిల కొట్టుకుంది.

బహుశా పల్లెటూళ్లో అతని తల్లి పేగు కొట్టుకుని ఉండొచ్చు

కోపంతో పిడికిళ్లతోబాటు యేసేబు శరీరం కూడా ఉక్కు ప్రతిమలా బిగుసు కుంది. అసహనంగా నేలను తన్నాడు.

రాజ్యాంగం కల్పించిన అవకాశాలు నాగు బాబు లాంటి నీచులకు అంది ఎలా దుర్వి నియోగం అవుతున్నాయో, తనలాంటి అదే సామాజిక వర్గానికి చెందిన అనేకమందికి అందక ఎన్ని ఇబ్బందులు పడవలసి

వస్తోందో, కొందరికే లభిస్తున్న అవకాశాల కారణంగా సామాజికంగా వెనకబడ్డప్పటికీ పలుకుబడి లేని తనలాంటి చదువుమీద ఆసక్తివున్న విద్యార్థులు, ఆర్థికంగా బాగా వెనుకబడిన ఇతర సామాజికవర్గ విద్యార్థులు ఎంతగా అన్యాయం అయిపోతున్నారో తలుచుకుంటూంటే యేసేబు కళ్లు చిల్లుపడ్డ వాన మబ్బులే అయ్యాయి.

ఆపుకోవడానికి ప్రయత్నించకుండా స్వేచ్ఛగా ఏడ్చేసి అలసటతో నిద్రలోకి జారాడు.

## 8

భయపడినంత ఇబ్బందేమీ పడకుండా డాక్టర్లిచ్చిన మందులు, ఇంజక్షన్ల ప్రభావంతో ప్రశాంతంగానే నిద్రపోయాడు పతంజలి రాత్రంతా.

తెల్లవారాక వచ్చిన శాస్త్రి దంపతులకు పతంజలి కోలుకుంటున్నాడని, ఏం భయం లేదని ధైర్యం చెప్పి, సాయంత్రానికి మళ్లీ వస్తాననీ, ఏం అవసరమైనా కబురు చేయమని చెప్పి తన రూము కొచ్చేశాడు భాస్కర్.

బాగా అలసటగా, బద్ధకంగా ఉండడంతో మంచంమీద ఓ గంట కళ్లు మూసుకుని దొర్లాడు. తర్వాత లేచి, కాలకృత్యాలు తీర్చుకుని, పతంజలి హాస్పిటల్ ఖర్చులకు అవసరమైతే సర్దడానికి డబ్బు డ్రా చెయ్యడానికి బ్యాంకుకు బయల్దేరాడు.

తనెప్పుడొచ్చినా నవ్వుతూ, తన ట్రాన్సాక్షన్‌కి అటెండ్ అయ్యే లేడీ ప్రొబేషనరీ ఆఫీసరే వుంది కౌంటర్లో. పొద్దుతిరుగుడు పూవులాంటి పచ్చని ముఖం, వెన్నెల్లాంటి నవ్వు, సిసింద్రీలాంటి చురుకు, అలసట, కోపం తెలియని చూపులు, ఆమె తన పనికి అటెండ్ అవుతున్నప్పుడు ఏ కష్టమర్‌కైనా తమ పని అరగంట ఆలస్యమైనా ఫరవా లేదు అనిపించేంత ఆకర్షణీయంగా ఉంటుంది.

కౌంటర్ దగ్గరకొచ్చి చిరునవ్వు సాయంతో, పాస్‌బుక్, విత్‌డ్రాయల్ ఫారం ఆమెకు అందించాడు భాస్కర్.

అవి అందుకుంటూ యథాలాపంగా భాస్కర్ ముఖంలోకి చూసిన ఆమె ముఖం, అప్పటివరకూ నవ్వుతున్నదల్లా వివర్ణమయింది.

ఆమె చూపులు విసురుగా వాలిపోయాయి.

పెదాలమీద ఎప్పుడూ చిందే చిరునవ్వు మాయం. అవి మొగ్గల్లా ముడుచుకున్నాయి.

యాంత్రికంగా విత్‌డ్రాయల్ ఫారం, పాస్‌బుక్కు అందుకుని, టోకెన్ బల్లమీద పెట్టిందంతే. ఆ తర్వాత ఆ బుక్కుని ఓ పక్కగా కేర్‌లెస్‌గా పడేసింది.

ఆశ్చర్యపోయాడు భాస్కర్ ఆ ప్రవర్తనకు.

'ఆమె'... ఆమేనా? ఇంకొకరో, వేరొకరో అయితే వింతలేదు. అవసరమయిన దాని కంటే అటెన్షన్ పే చేసే ఆమె, ఈ రోజు ఎందుకిలా...? ఒంట్లో బాగా లేదేమో? ఇంట్లోనో, ఆఫీసులోనో గొడవపడిందేమో? కాని తనని చూడక ముందువరకు బాగానే ఉన్నట్లుందే? !

ఆలోచిస్తూ పోయి కస్టమర్స్ చైర్స్‌లో ఓ మూలగా కూర్చున్నాడు భాస్కర్.

ఇంతకు ముందెన్నడూ కూర్చోవలసిన అవసరం వచ్చేదికాదు. కూర్చుందాం అనుకుంటుండగానే క్యాషియర్ నుంచి పిలుపొచ్చేసేది. అంత ఫాస్ట్‌గా ఆమె నుంచి పాస్ అయిపోయేది.

అయిదు నిమిషాలు గడిచాయి.

పిలుపు లేదు.

పది నిముషాలు.

ఊఁహూఁ...

పావుగంట...

లేచాడు భాస్కర్. ఆమె కౌంటర్ దగ్గరే తారాట్లాడసాగాడు. పక్కనపెట్టి పొరబాటున మరచిపోయిందేమో, తనని చూస్తూనే 'సారీ' ఫేస్‌తో గబగబా పాస్ చేసేస్తుం



దని... ఉహూ, నో యూజ్!

ఈసారి కౌంటర్ దగ్గర నిల బడి ఏదో ఆలోచిస్తున్నవా డిలా, టోకెన్‌తో కౌంటర్ బల్ల మీద తబలా వాయిస్తూ, సన్నగా ఏదో హమ్ చేస్తూ, ఫ్యాన్లు లెక్కపెట్టసాగాడు రూఫ్‌వైపు చూస్తూ.

ఒక్కసారి తలెత్తి, చప్పుడు చెయ్యొద్దు అన్నట్లుగా 'ప్చ్' అని, తిరిగి వేరే పన్లో పడి పోయిందామె.

సిగ్గుపడిపోయాడు భాస్కర్. సిల్లీగా బిహేవ్ చేశాననిపించింది. కౌంటర్‌కి దూరంగా జరిగి, ఆమె దృష్టినుంచి దాటిపో నంత దూరంలో పచార్లు చేయసాగాడు.

'రష్' కూడా ఏమీ లేదు.

తన ట్రాన్సాక్షన్ లేటెందుకు అవుతోందో అర్థం కాలేదు భాస్కర్‌కి. తన తర్వాత వచ్చిన ఇద్దరు ముగ్గురు డబ్బులు తీసుకుని వెళ్లిపోయారు కూడా.

కౌంటర్ దగ్గరకు నడిచాడు భాస్కర్.

"ఎక్స్‌క్యూజ్ మీ, మేడం"

"యేస్..." కేవలం డ్యూటీగా తల ఎత్తిం దామె. చూపులయితే సూటిగా తనవైపు లేవు.

"నా విత్‌డ్రాయల్ పాస్ కాలేదూ..." మర్యాదగా నవ్వాడు భాస్కర్.

"అవుతుందండీ... తొందరపడితే ఎలా? " తిరిగి వేరే పనిలో పడిపోయిందామె.

ఆ మాటలు ఆమె నోట వినడంతో చెంప మీద చరిచినట్లు అనిపించింది భాస్కర్‌కి. ఇంకక్కడ నిలబడలేక తిరిగి వెనక్కిపోయి కూర్చున్నాడు.

'ఎందుకిలా ప్రవర్తిస్తుంది ఈమె? తనొ క్కడితోనే ఆమె అలా ప్రవర్తిస్తోంది అనిపి స్తోందే? కారణం ఉండాలిగా? తనేం చేశా డని? తప్పుగా ఎన్నడన్నా మాట్లాడాడా? దురుసుగా ప్రవర్తించాడా? తనమీదెందుకూ కోపం? ఇంకెంతసేపిలా వెయిట్ చెయ్యా లి? మరొకరు అయితే తన ప్రవర్తన వేరే లా ఉండేది. ఎప్పుడూ ఉండే రీతికి పూర్తి భిన్నంగా ఉందే ఈరోజు ఈమె ప్రవర్తన?'

భాస్కర్ చూస్తుండగానే మరో ముగ్గురు కస్టమర్స్‌ని డిస్పోజ్ ఆఫ్ చేసింది ఆమె.

భాస్కర్‌కి కోపం తన్నుకొచ్చింది.

బాగా చిన్నతనంగానూ అనిపించింది.

'కావాలని తన పని లేట్ చేస్తోందామె. ది సీజ్ టూమచ్' విసురుగా లేచి, మేనేజర్ క్యాబిన్‌లోకి నడిచాడు భాస్కర్.

మేనేజర్ నవ్వుతూ కుర్చీ చూపించాడు.

కూర్చుంటూ కోపాన్ని కంట్రోల్ చేసు కుంటూ, "ఏంలేదూ... మనీ విత్‌డ్రా చెయ్య డానికొచ్చాను. కౌంటర్లో పాస్ బుక్కు, విత్ డ్రాయల్ ఫారం యిచ్చి ట్వంటీమినిట్స్ పైగా అయ్యింది. కొంచెం అర్జంటుగా వెళ్లా ల్సివుందీ..." అన్నాడు తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

మేనేజర్ కనుబొమలు ఆశ్చర్యంతో పైకి లేచాయి. "ట్వంటీ మినిట్సా? ! ఇంపాసి బుల్ సర్" అన్నాడు నవ్వు ముఖంతోనే.

భాస్కర్ ఇబ్బంది పడ్డాడు.

"సారీ! నేను కంప్లయింట్ చెయ్యడానికి రాలేదు సార్. కానీ ఇంకా ఎక్కువే అయ్యింది" అన్నాడు.

"అదేమిటండీ... ఆ అమ్మాయి చెక్కు తీసుకున్నంతసేపు పట్టదు పాస్ చేయడా నికి. మీరేమో ట్వంటీ మినిట్స్ అంటు న్నారు... ప్లీస్ కమ్ విత్ మీ సర్, లెటజ్ ఫైండౌట్ వాట్సద ఎగ్జాక్ట్ ప్రాబ్లెం..." అంటూ లేచి రూము బయటకు నడిచాడు మేనేజరు.

"కంప్లయింట్ ఇచ్చినట్లయ్యిందేమో. ఈ ఒక్కసారికీ ఇంకొంచెంసేపు వెయిట్ చేయా ల్సిందేమో. ఆమె మనస్సుని హర్ట్ చేస్తున్నా నేమో. అసలే ఆమె ఈవాళ ఔట్ ఆఫ్ మూడ్‌లో ఉందేమో, తను తొందర పడ్డా



డేమో" అని ఆలోచించుకుంటూ బిడియ పడ్తూ మేనేజర్ వెనకాలే అడుగులో అడుగు వేసుకుంటూ నడిచాడు భాస్కర్.

"ఏమ్మా, ఏమిటీ... వీరి పేమెంట్ ఆగి పోయిందటా? మోర్ దేన్ ట్వంటీ మినిట్స్ అయ్యిందిట? " అనడిగాడు మేనేజరు సౌమ్యంగానే.

మేనేజర్ గొంతు వింటూనే ఆమె చటుక్కున లేచి నిలబడింది.

మేనేజర్ వెనగ్గా నంగిగా చూస్తున్న భాస్కర్‌ని చురచుర చూసింది. "ఏంలేదు సర్... అయిపోయింది. స్కూల్ వాళ్ల సాలరీస్ ఫీడ్ చేస్తున్నాం..." అంటూ మేనేజరుకి వినయంగా జవాబు చెప్పింది.

మేనేజరు తల అడ్డంగా ఊపుతూ, "నో నో మిస్ కుసుమాంజలీ! కౌంటర్ కస్టమర్స్ ఆర్ టు బి అటెండెడ్ ఫస్ట్. ప్లీజ్ స్టాప్ దట్ వర్క్ అండ్ అటెండ్ టు ద కస్టమర్స్" అని కొద్దిపాటి చిరాకు ప్రదర్శించి, తన రూములోకి వెళ్లిపోయాడు.

'కు-సు-మాం-జ-లి!' బొమ్మయి నిలబడిపోయి, ఏదో గుర్తుకు రాగా గొణుక్కుంటున్నాడు భాస్కర్.

ఆమె ఉడుకుమోతుతనంగా తనవైపే చూస్తోంది.

ఆమె ముఖం...అందమైన ముఖం... ప్రసన్నమైన ముఖం... ఎప్పుడూ పువ్వులా వికసించి ఉండే ముఖం... ఎర్రబడుతోంది.

'కుసుమాంజలి... లెటర్... గులాబీ కాగితాల మీద ఆకుపచ్చ అక్షరాలు...' భాస్కర్ అచేతనంగా ఆమెనే చూస్తున్నాడు.

బ్యాంకు నుంచి తిరిగొచ్చాడన్న మాటే గాని, ఎలా వచ్చాడో భాస్కర్‌కే తెలియదు. మనసు మనసులో లేదు. ఏదో తెలియని కలకలం గుండెల్లో. మనసులో ఏదో అలజడి. ఎన్నడూ ఎర్గని కలవరం. ఏమిటిది? ఏమంటారు దీన్ని? బహుశా ప్రేమంటే ఇదేనా? ఏదో గమ్మత్తుగా వుంది!

'కుసుమాంజలి...' అంత అందమైన అమ్మాయి...తనని ప్రేమిస్తోందా? గతంలో బ్యాంకు పనిమీద తను వెళ్లినప్పుడు వెంటనే, వేగంగా, తనకు అటెండ్ అయ్యేటప్పుడు ఆమె చూసే చూపుల్లో ఆ భావనేమీ... యస్... ఉండేది.... అదోవిధమైన ఎడోరింగ్ ఫీలింగ్... ఒక హీరోని చూస్తున్నట్లు... ఆ తర్వాత యిష్టమైన వ్యక్తిని చూస్తున్నట్లు... తనే గమనించలేదు. తను సరైన రెస్పాన్స్ యివ్వలేదు. రెండుసార్లు లెటర్స్ రాసినా, డాబా గది బయట నిల్చుని చూసైనా విసరని తనంటే చాలా కోపంగానూ ఉందామెకు. పావుగంట తన పనిని అశ్రద్ధ చేసిందని తనంత ఉడుక్కున్నాడే. మరి ఆమె... ఎప్పట్నుంచి తన నుంచి రెస్పాన్స్ ఆశిస్తోందో... ఆడపిల్లయ్యుండీ స్వతంత్రించి ఉత్తరాలు రాసీ... ప్రేమ చిగురించడానికి ప్లానులు చెప్పీ... చచ్చిచ్చ... ఎంత డిసప్పాయింట్ అయిందో పాపం... ఇప్పుడు తనేం చేయాలి?

## మొగుడు

దేవుడు లేడని ప్రచారం చేస్తూ, పురాణాలు చెప్పిన దైవ లీలలను అపహాస్యం చేస్తూండే రామస్వామిని ఒకాయన కలిసి 'మీరింత నాస్తికులు కదా? భగవంతుడైన శ్రీరామచంద్రుడి పేరెలా పెట్టుకున్నారు?' అని నిలదీశాడు.

ఆయన ఏం చెబుతాడా అని చుట్టుపక్కల ఉన్నవారంతా ఆసక్తిగా చెవులు రిక్కించారు.

'రామస్వామి అంటే.. రాముడికి స్వామి. అంటే రాముడికి మొగుడు.. అర్థమైందా? ' అన్నారు త్రిపురనేని.







## మందుప్రియులు కండి!

మందుబాబుల్ని చూసి మూతి ముడుచుకుని దూరంగా ఉండకండి. మీరు కూడ ఓ పెగ్గు లాగించేయండి వాళ్లలాగే. ఇది మీ మంచి కోసమే సుమా అంటున్నారు రాయల్ ఫ్రీ, యూనివర్సిటీ కాలేజి ఆఫ్ మెడికల్ స్కూల్ శాస్త్రవేత్తలు.

ఇరవై ఐదు నుండి నలభై రెండు సంవత్సరాల వయసున్న మగువలు రోజూ కొద్దిగా మద్యం సేవించటం వల్ల ఆ వయస్సులో వచ్చే మధుమేహ వ్యాధిని నివారించుకోవచ్చంటున్నారు ఆ శాస్త్రవేత్తలు. లండన్ యూనివర్సిటీ, హార్వార్డ్ యూనివర్సిటీ శాస్త్రజ్ఞులు ఇరవైఐదు నుంచి నలభై రెండేళ్ల వయస్సుగల లక్షమంది ఆరోగ్యవంతమైన మహిళలపై పదేళ్ళు పరిశోధనలు జరిపి ఈ నిర్ధారణకు వచ్చారు.

మద్యం సేవించని మహిళల కంటే రోజుకి ఒకటి లేదా రెండుసార్లు మద్యం సేవించే స్త్రీలలో 58 శాతం మందికి టైప్-2 మధుమేహ వ్యాధి వచ్చే అవకాశాలు తక్కువగా ఉన్నాయని కనుగొన్నారు. అలాగే రోజుకి ఒక్కసారి మద్యం సేవించే స్త్రీలలో 33 శాతం మంది ఈ వ్యాధి బారిన పడకుండా ఉండే అవకాశాలున్నాయి. వారానికి రెండు మూడు సార్లు మద్యం సేవించే మగువల్లో కేవలం ఇరవై శాతం మందికి మాత్రమే టైప్-2 మధుమేహ వ్యాధి రాకుండా ఉండే అవకాశాలున్నాయని చెబుతున్నారు.

ఆల్కహాల్ శరీరపు గ్లూకోజ్ వినియోగపు శక్తిని పెంచి, మధుమేహ వ్యాధి రాకుండా నివారిస్తుందని అంటున్నారు ఎరిక్‌లిమ్ అనే శాస్త్రవేత్త.

ఏం చేయాలి?
ఏం చేయాలి?
'ప్రేమించాలి... అంతకంటే ఏం చెయ్యాలి?' అంది మనస్సు మందలిస్తూ.

'అలాగే' అనుకున్నాడు భాస్కర్ బుద్ధిగా. మెరుస్తున్న కళ్లతో చుట్టూ చూశాడు రూమంతా... కుసుమాంజలి తన రూములో కలియతిరుగుతున్నట్లుగా అనిపిస్తోంది... రూము బయటకొచ్చాడు... రూము బయట డాబా, అరవైలలోని బ్లాక్ అండ్ వైట్ సినిమాలలో కనిపించే డాబాలా, మల్లె మాలతీ తీగలతో, కొబ్బరి ఆకుల వెనుగ్గా నవ్వుతూ కనిపించే పూర్ణచంద్రుడితో, మల యమారుతంతో... పట్టపగలే పున్నమి రాత్రిలా మనోహరంగా కనిపిస్తోంది. ఆ అందమైన, ఆహ్లాదకరమైన, చల్లని వాతావరణంలో...తనూ, కుసుమాంజలి... పాము కుబుసం లాంటి తెల్లని, పల్చని బట్టల్లో... పిల్లగాలికి నుదుటిమీద ముంగురులు కదులుతుండగా...

కొత్త పెళ్ళికూతురి సహజమైన నునుసిగ్గుతో ఆమె చూపులు బెదురుతుండగా... తన తాకిడికి ప్రకంపనలతో లజ్జగా ఆమె ఎరుపెక్కిన బుగ్గలు అదురుతూండగా... భాస్కర్ గుండెల్ని మైకం కమ్మేసింది.

కింకర్తవ్యం? !

రెండు విధాల ఆమెకు కోపం తెప్పించాడు తను.

ఇప్పుడు ప్రసన్నం చేసుకోవడం ఎలా?

ప్రసన్నం చేసుకుని, పెళ్ళి చేసుకుంటే... తన ఆదర్శాలు, ఆశయాలు నెరవేరుతాయా? అందరిలా తనూ సంసారం చేసి, పిల్లల్ని కనేసి, రొటీన్‌గా జీవితాన్ని గడిపేసి... నోనో! భయపడక్కరలేదు. మన సుంటే మార్గం వుంది. సరైన ఆలోచన లుంటే మనుసుని ఎన్ని మంచిపనుల మీదైనా నిలపొచ్చు. మనసిచ్చిన మగువతో ప్రణయం, మనసుంచిన కార్యంలో దీక్ష, మనసు కోరుకునే శిఖరాలను చేరడం... అన్నీ సాధ్యమే. పైగా వ్యక్తిత్వం అనేది ఏదో ఒక్క విషయంమీద కేంద్రీకరించినంతలో పరిపూర్ణత సాధించదు. వీలయినన్ని రంగాల్లో రాణించాలి.

తయారై కాలేజీకి బయలుదేరాడు భాస్కర్.

* * *

సాయంకాలమయింది.

కాలేజీ వేళలయిపోయాయి.

తన అలమారాకి తాళం పెట్టి బయటకు బయలుదేరాడు భాస్కర్.

ఆ సమయంలో ఎదురొచ్చింది లావణ్య, "నమస్తే సార్" అంటూ.

అప్పుడు గుర్తొచ్చింది భాస్కర్‌కి ఇంగ్లిష్ గ్రామర్ చెప్పడానికి స్టాఫ్‌రూంకి ఈ రోజు నుంచీ ఆమెని, మరో స్టూడెంటు కాత్యాయనినీ రమ్మన్నానని.

"అన్నట్లు, ఈ రోజు నుంచీ మీకు ఇంగ్లిష్ గ్రామర్ చెబుతానని చెప్పాను కదూ? " అన్నాడు భాస్కర్, మరచిపోయానన్నట్లు గానూ, వేరే అర్జంటు పనివుందన్న భావాన్ని దాచుకోలేకపోతూను.

"అవును సార్... అన్ని సబ్జక్టులలో బాగానే వున్నాను గానీ, ఇంగ్లిష్ గ్రామరే చాలా పూర్ సార్. ఓ పది రోజులు మీరు కొంచెం మాకు చెబితే, ప్రాక్టీసు చేసి, పెర్‌ఫెక్ట్ అయిపోతాం సర్. కాత్యాయని కూడా వస్తానంది కదా సార్. కానివాళ తనకి కొంచెం వేరే పనుందని వెళ్లింది. పని అయిపోగానే వచ్చి కలుస్తానంది సార్..."

"అలాగా... మరి... పోనీ... రేపట్నుంచీ..." పాపం, ఆ అమ్మాయిలను రమ్మని ఇప్పుడు పోస్ట్‌పోన్ చేయడం ఇష్టం లేక తప్పించుకున్నట్లవుతుందేమోనని సంశయిస్తూ నసుగుతున్నాడు భాస్కర్.

భాస్కర్‌కి వేరే ఏదో ఇంపార్టెంట్ పని ఉన్నట్లుంది అని గ్రహించింది లావణ్య.

"సర్,పోనీ రేపట్నుంచీ మొదలు పెడదాం సర్. కాత్యాయని కూడా లేదు కదా. క్లాసు మిస్సయ్యానని బాధపడుతుంది" తన ఐడియాగా, భాస్కర్ నొచ్చుకోకుండా సలహా యిచ్చింది లావణ్య.

కాని భాస్కర్ నొచ్చుకుంటూనే, "అలాగేమ్మా... సారీ! పాపం నువ్వు నా క్లాసులన్నీ అయ్యేవరకు వెయిట్ చేసినట్లున్నావు" అన్నాడు.

"ఫరవాలేదు సర్... షటిల్ ప్రాక్టీస్ చేసుకుని వెళ్లిపోతాను. వస్తా సర్. నమస్తే" చురుగ్గా లేడిపిల్లలా వెళ్లిపోయింది.

'హాస్పిటల్‌కి వెళ్లి, పతంజలికి ఎలా వుందో చూడాలి' అనుకుంటూ బయటకు నడిచిన భాస్కర్‌కి ఏదో ఆందోళనతో ఉన్నట్లుగా కనిపిస్తోన్న హిస్టరీ లెక్చరర్ సుకుమార్‌బాబు ఎదురయ్యాడు.

భాస్కర్‌ని చూస్తూనే, కొంచెం సర్దుకుపోవడానికి ప్రయత్నిస్తూ, "మీరా భాస్కర్ గారూ! ఇంకా వెళ్లలేదా? " అని అడిగాడు.

"ఇదిగో వెళ్తున్నా, మీరు మళ్లీ వచ్చినట్లున్నారు? ఏదో ఆందోళనగా కనిపిస్తు



న్నారు? " అనడిగాడు భాస్కర్.

"అబ్బే... ఆందోళనేం లేదు. బజార్లో ఓ మెడిసిన్ కోసం తిరగడంతో అల సటగా ఉందంతే. వెళ్లేటప్పుడు నా హ్యాండ్ బ్యాగ్ తీసుకెళ్లడం మరచిపోయాను, అది తీసుకుందామని తిరిగి వచ్చాను. మీరు బయలుదేరండి సార్" అంటూ తను స్టాఫ్ రూంలోకి నడిచాడు సుకుమార్‌బాబు.

బయలుదేరాడు భాస్కర్ స్కూటర్ స్టాండ్ వైపు.

వంద గజాలు నడిచాడో లేదో "సార్" అన్న సుకుమార్‌బాబు పిలుపు వినిపించింది.

ఆగి, వెనక్కి తిరిగాడు భాస్కర్.

సుకుమార్‌బాబు అతనివైపు గబగబా నడిచి వచ్చి, "ఆహఁహఁ ఏమీ లేదు. లావణ్య వచ్చినట్లుంది కదూ ఇటు? ఏమీ లేదు. బుక్కొకటి ఇచ్చాను ఆమెకి. తీసుకుందామనిలెండి" అన్నాడు తొందర తొందరగా.

విషయం సరిగా అర్థమవ్వలేదు భాస్కర్‌కి. సరే ఏదయితేనేం మనకెందుకులే అనుకుని, "వచ్చింది సార్... ఇంగ్లిష్ గ్రామరు చెబ్తానన్నాను. కానీ నాక్కొంచెం పనుండి, రేపటికి పోస్ట్‌పోన్ చేశా. 'షటిల్ ప్రాక్టీస్ చేసుకుంటా'నని గ్రౌండ్స్ వైపు వెళ్లింది" అని చెప్పాడు.

సుకుమార్‌బాబు తేలిగ్గా నవ్వాడు.

"అలాగా... సారీ సర్, వెళ్తున్నవాళ్లని ఆపాను. బుక్ రేపు తీసుకుంటాలెండి. గుడ్‌నైట్" అన్నాడు వినయంగా.

"గుడ్‌నైట్..."

'రేపు తీసుకున్నా ఫరవాలేని బుక్కుకోసం అంత గాభరా ఎందుకుపడ్డాడు? బహుశా గాభరా మరచిపోయిన బ్యాగ్ గురించేమో! కొందరు మనుషులంతే. అతి చిన్న విషయాలకు కూడా గాభరా పడిపోతుంటారు. ఈ లెక్చరర్ చురుకైనవాడే గాని, త్వరగా చలించిపోతుంటాడు, చిన్న విషయాలకు కూడా. చాలా సున్నితమనస్కుడు. తరుచూ గాభరా పడుతుంటాడు. మొన్న స్టాఫ్‌రూంలో ఎవరో "సార్ మీ మిసెస్ ఊర్నుంచి వచ్చేశారా? " అని అడిగితేనే జవాబు చెప్పడానికి తడబడిపోయాడు. దాంతో అందరూ నవ్వులు... చిన్నబుచ్చుకున్నాడు పాపం!'

## 9



పతంజలికి కొంత రిలీఫ్ వచ్చింది.

హాస్పిటల్లో ట్రీట్‌మెంట్ బాగుంది.

శాస్త్రి దంపతులు కూడా కొంత తేటగా కనిపిస్తున్నారు.

భాస్కర్ వెళ్లేసరికి యేసేబు కూడా ఉన్నాడక్కడ. పతంజలిని ఎక్కువ డిస్టర్బ్ చెయ్యకుండా, శాస్త్రి దంపతులకీ, వాళ్లకంటే ఎక్కువ ఆందోళన పడ్తున్న యేసేబుకీ, కొంత డైవర్షన్ అవసరం అనిపించి, రాజకీయ నాయకులమీద కొన్ని జోకుల్ని చెప్పి నవ్వించాడు భాస్కర్.

సైకియాట్రిస్ట్ మిత్రుడొచ్చాడు.

సున్నితమైన మనసున్న వాళ్లని కార్నర్ చేసి హింసిస్తే ఓ విధమైన న్యూరోసిస్‌కి గురవుతారని, సరైన వైద్యం అందుతున్న కారణంగా పతంజలి త్వరలోనే కోలుకుంటాడని, కోలుకున్నాక ధైర్యం కలిగిస్తూ, సపోర్ట్ యిస్తే ఏ భయం లేకుండా పులిలా బతుకుతాడని చెప్పాడు.



కోలుకుంటాడన్న మాట శాస్త్రి దంపతులకి ఆనందాన్నిచ్చింది.

పులిలా బతుకుతాడన్నది యేసేబుకి ఆనందాన్నిచ్చింది.

చదువుల తల్లికి సమర్పించబడే ఓ పూజా పుష్పం నలిగిపోలేదు అన్నది భాస్కర్‌కి ఆనందాన్నిచ్చింది.

వాళ్లు ఆనందంలో వుండగా,

"ఎలా వుంది పతంజలికి?" అంటూ కళ్యాణి వచ్చింది.

."నథింగ్ టు వర్రీ... ఇంప్రూవ్‌మెంట్ ఈజ్ దేర్" అన్నాడు భాస్కర్ ధైర్యం కలిగించే నవ్వుతో.

"హమ్మయ్య" అంటూ స్టూలుమీద కూలబడింది కళ్యాణి.

"కోలుకున్నాక పతంజలి పులయిపోతాట్ట" సంతోషాన్ని ఆపుకోలేని యేసేబు కళ్యాణితో అన్నాడు.

ఆశ్చర్యంగా చూసింది అతనివైపు కళ్యాణి.

"ఇప్పుడే సార్‌ఫ్రెండు, సైకియాట్రిస్ట్ చెప్పారు"

"అప్పుడు నాగుబాబుగాణ్ణీ, వాడి ముఠానీ..." పళ్లు కొరికింది కళ్యాణి.

"ఆc ఆc... ఈజీ ఈజీ... ఆవేశపడిపోకండి. అయినా నాగుబాబుకి ఈ ర్యాగింగ్‌తో సంబంధం ఉందని ఎలా చెప్పగల్రు?" అనడిగాడు భాస్కర్. యేసేబు ఆ విషయం తనకు 'బాగా తెలుసు' అని చెప్పబోతూంటే, 'ఇప్పుడేం మాట్లాడొద్దు, పతంజలి తల్లిదండ్రుల్ని బాధ పెట్టినవాళ్లం అవుతాం మళ్లీ' అన్నట్లుగా గుడ్లురుముతూ హెచ్చరించి, "పతంజలికి బాగా అవడం మనకు ముఖ్యం" అన్నాడు భాస్కర్.

"అంతేసార్... అంతే" అన్నారు కళ్యాణి, యేసేబు ఒక్కసారే అర్థమయి. కళ్యాణికి సంజ్ఞ చేసి, ఓ పక్కకు తీసుకెళ్లి, "కళ్యాణీ! బ్యాంకులో డబ్బు డ్రా చేశాను. నీ దగ్గరుంచు. హాస్పిటల్ వాళ్లు మందులకీ ఫీజులకీ మధ్యమధ్యలో పేమెంటు అడుగుతుంటారు" అన్నాడు భాస్కర్ జేబులోంచి డబ్బు తీస్తూ.

కళ్యాణి వారించింది. "అక్కర్లేదు సార్... నేను తెచ్చాను"

"నువ్వు తేవడం ఏమిటి? మతిపోయిందా? ఇంత శ్రమ పడుతున్నావు పతంజలి అమ్మానాన్నలకి మీ ఇంట్లో మకాం కల్పించావు. చాలు"

"డబ్బు నాది కాదు సార్... రామదాసు గారు ఇక్కడ నా అక్కౌంటులోకి హైద్రాబాదు నుంచి జమచేసి ఫోను చేసి చెప్పారు. పతంజలిని జాగ్రత్తగా చూసుకోమని కూడా చెప్పారు"

- రామదాసుని తలుచుకుంటుంటే భాస్కర్ గుండెల్లో అమృతం ఊరుతున్నట్లనిపించింది. ఇంకా మానవత్వం బతికే వుందనే నమ్మకం కలగసాగింది.

* * *

రాత్రి పతంజలికి తను తోడుగా పడుకుంటానని యేసేబు మరీ పట్టుబట్టడంతో రూముకొచ్చేసి బాగానే నిద్రపోయాడు భాస్కర్. ఆ ముందురోజు రాత్రి నిద్ర లేకపోవడంతో గాఢంగానే పట్టేసింది నిద్ర.

ఆలోచనలు వేరే విషయాల మీద లగ్నమై ఉండడంతో, అలసటతో నిన్న చెయ్యడం మరిచిపోయిన 'ముఖ్యమైన' పని ఈ పూట చేయాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు భాస్కర్.

అందులో నిన్నటికీ ఈవాల్టికీ తేడా వుంది.

ఇప్పటికయినా తను రెస్పాన్స్ యిచ్చే ఉత్సాహాన్ని చూపించకపోతే వ్యవహారం బెడిసికొడ్తుంది. తను టిప్పుసుల్తాన్ కత్తికి కూడా తెగని బెండకాయ అయిపోతాడు.









తనేం చిన్నపిల్లవాడు కాదు.

'పహిలా పచ్చీస్' నుంచి 'పచ్చీస్ కెబాద్‌మె'లోకి వచ్చి మూడేళ్లయ్యింది.

లేచి కాలకృత్యాలు తీర్చుకుని, కాఫీ తాగుతూ టైంపీస్ వైపే చూస్తున్నాడు భాస్కర్. టైము ఎనిమిదెప్పుడు అవుతుందాని. గడియారం ముళ్లివాళ ఈ కుసుమాంజలిలాగే అలిగి, తనని లక్ష్యపెట్టకుండా 'స్లో'గా నడుస్తున్నాయి. కంప్లయింట్ యివ్వడానికి వాటి తాలూకు మేనేజరు ఎవడూ లేడు.

సడెన్‌గా బ్యాంకు మేనేజరు మీద కోపం పొటమరించింది భాస్కర్ గుండెల్లో. తనేదో చికాకులో కంప్లయింట్ యిచ్చినంతలో ఆయనగారు అంత అర్జంటుగా తన సీట్లోంచి లేచి వెళ్లి మరీ ఆమెని అడిగెయ్యాలా? మందలిస్తున్నట్లు మాట్లాడెయ్యాలా? తనైనా ఎక్కడో దూరంగా నక్కి, ఏం జరుగుతుందో చూడొచ్చుగా? ఏదో ఘనకార్యం సాధించినవాడిలా ఆయన వెనకాలే పోయి, ఆవిడ చురచుర చూపుల్లో మాడి పోవాలా? ఆమెకు కోపం, ఉడుకుమోత్తనం మరింత రైజ్ అయ్యేలా చెయ్యాలా? ఇప్పటికే చేసిన నిర్వాకం చాలదూ?

కాని ఓ విధంగా మంచే జరిగిందేమో? ! ఒకటి- ఆమే 'లేఖారాణి' కుమారి కుసుమాంజలి అని తెలిసింది. రెండు- ఆమె అలా 'అలక కుర్చీ' ఎందుకు ఎక్కిందో తెలిసింది.

సంతోషం!

ఉతకవలసిన అవసరం లేకపోయినా పెట్లో ఇస్త్రీ మడతల్లో ఉన్న తన మెరూన్ షర్టుని, బక్కెట్ నీళ్లలో కుసుమాంజలి కోసం నానబెట్టాడు భాస్కర్.

అర నిముషానికోసారి గడియారం వైపు చూస్తూ, గదిలోకి బయటికి గడువు తేదీ దగ్గర పడిపోతున్నా కథ తట్టని రచయితలా అసహనంగా తిరగసాగాడు. ఆందోళనగా తిరుగుతుండడంతో గమనించుకోలేక రెండుసార్లు గడపకి గుద్దుకుని, బొటనవేలు తెగ మండుతోంది. 'ఐ డోన్ట్ కేర్' అనుకుని అలాగే తిరుగుతున్నాడు భాస్కర్.

గడియారం ముళ్లు కనికరించాయి భాస్కర్ని.



ఎనిమిది కావస్తోంది.

గడియారం నుంచి తనను ఏడిపించే బాధ్యతని అతని గుండె తీసుకుని, రివర్స్‌లో దడదడ లాడుతూ నిముషానికి ఏడువందల ఇరవైసార్ల వరకు కొట్టుకోసాగింది స్పీడుగా.

మెరూన్ చొక్కాతో ఉన్న బకెట్‌ని బయటకు తెచ్చాడు భాస్కర్. చూపుని రోడ్డుమీదకే ఉంచి, చొక్కా తీసి పిండుతూ, దాన్ని హ్యాంగర్‌కి తగిలించి,దండానికి పెడ్తున్నాడు.

కుసుమాంజలి రాలేదు.

మళ్లీ చొక్కాని నీట్లో ముంచి, పైకి తీస్తూ, పిండుతూ, హ్యాంగర్‌కి తగిలించి, దండానికి...

ఊహూఁ.. ఇంకా రాలేదు ఆమె.

మళ్లీ చొక్కాని నీట్లో ముంచి...

అబ్బే, ఇంకా రాలేదు ఆమె.

మళ్లీ చొక్కా... రిపీట్... షాట్ సరిగ్గా రాకపోతే రీటేక్‌లతో టేక్‌ల మీద టేక్‌లు తింటున్న కొత్త హీరోలా...

ఈసారి ఓ మెరుపు మెరిసింది...

కుసుమాంజలి వస్తోంది...

భాస్కర్ గుండెలు గుబగుబలాడాయి...

ఆనందంతో చొక్కాని శక్తికొద్దీ పిండాడు. చొక్కా పటపటలాడింది.

చంకల దగ్గర కుట్లు తెగిపోయాయి. అవి చూసుకుంటూ బాధపడేలోగా ఆమె వెళ్లిపోతుందని, కుట్లు తెగిన ఏరియా కనబడకుండా హేంగర్‌కి పెడ్తూ, ఆమెనే చూస్తున్నాడు భాస్కర్.

హంసలా నడుస్తోందామె.

మలయమారుతంలా, సెలయేరులా కదుల్తోంది ఆ చిగురుబోడి.

క్లిప్పులు పెట్టినట్టు భాస్కర్ కనురెప్పలు తెరుచుకున్నవి, తెరుచుకున్నట్టుగానే బిగుసుకుని వున్నాయి.

దూరంనుంచీ తన ఇంటిదాకా నడిచివస్తున్న ఆమెనే చూస్తున్నాడు. ఇక ఆమె తనని చూడడమే తరవాయి. ఆమె కోరుకున్నట్లుగా తను సరిగ్గా ఎనిమిది గంటలకి తన మెరూన్ షర్టు ఆరవేసినట్లు, ఆమెవైపే చూస్తున్నట్లు ఆమె గమనించడమే తరవాయి. ఆపైన తమ చూపులు కలవడమే తరవాయి. పిమ్మట ఆ గుమ్మ గుమ్మైపోయి, మొగ్గైపోయి, ముడుచుకుపోయి...

కాని స్క్రీన్‌ప్లే వేరేగా వుంది. డైరెక్టర్ బ్రహ్మగారు కదా! స్క్రిప్టు వారిదే. అప్పటిదాకా ముఖం కనిపించేలా వచ్చినదల్లా కుసుమాంజలి, భాస్కర్ ఉన్న ఇంటి





ముందుకు రాగానే, ఎండ నుంచి రక్షణ కోసం చేతిలో ధరించిన రంగు రంగుల గొడుగుని ఇటువైపుకి తన ముఖం కనబడ కుండా అడ్డుపెట్టుకుని ముందుకి సాగిపో యింది.

తడిచొక్కాతోబాటే తనూ నీరుగారిపో యాడు భాస్కర్.

లేక లేక ఆలస్యంగానైనా తనకి ప్రేమించే ఛాన్సు రానేల... వచ్చెను పో... అది గ్రహించడానికి తను ఆలస్యం చేయనేల... చేసెను పో... బుద్ధిమంతుడిలా తను ఆమె కు రెస్పాన్స్ ఇచ్చిననూ ఆమె కోపం తగ్గక పోనేల... ఏల ఈ లీల? ఈ గోల...?

ఉస్సురంటూ పోయి, మంచంమీద వాలాడు భాస్కర్.

'నన్ను నా మానానికొదిలెయ్యక... నా మానాన్ని ఓ పూబోణికి ఫంతర్పణ చేసుకునే అవకాశం కల్పించి, తిరిగి టర్న్ తిప్పుతున్న ఓ మన్మథా! యూ శాడిస్ట్ ఫెలో... యూ కంత్రీ ఫెలో...' ఇంకా కొత్తరకం తిట్లేవన్నా తిట్టే అవకాశం ఉందాని భాస్కర్ ఆలో చిస్తున్నంతలో...

"ఇదేమిటండీ బాబూ... మీరింత నిశ్చిం తగా పడుకున్నారు. అవతల కొంపలు మునిగే దారుణం జరిగిపోతే" అన్న మాట లు వినిపించి, ఉలిక్కిపడి లేచి కూర్చుని, గుమ్మంవైపు చూశాడు భాస్కర్.

హిస్టరీ లెక్చరర్ సుకుమార్‌బాబు.

"రండ్రండి" అంటూ లేచి కుర్చీని చూపిం చాడు భాస్కర్, ఆయన ఏదో తమాషాకి జోక్ చేస్తున్నాడని భావించి.

"కూర్చోవడమేమిటండీ బాబూ... కాళ్లాడ్డం లేదు నాకు. ఘోరం జరిగిపోయింది. ఇంకా మీకు తెలుసు అనుకుంటున్నాను. మీకు తెలియకపోవడం ఏమిటి? " ఆయన్లో గాభరా.

"ఏమిటండీ... ఏమయ్యింది? నాకేం తెలీదే? " భాస్కర్‌లో కంగారు.

"లావణ్యని ఎవరో మర్డర్ చేశార్ట? "

తల తిరిగిపోయింది భాస్కర్‌కి. పిడుగు లాంటి వార్త మోసుకొచ్చి అది తనకి తెలిసీ నిశ్చింతగా పడుకుని వున్నట్టు, ప్రశ్నిస్తాడే మిటీ ఈయన?

"ఏమిటండీ మీరనేది? ఈవాళ్ల ఏప్రిల్ ఫస్టు కాదుకదా? "

"సార్... నేను మీతో ఎప్పుడన్నా జోక్ చేశానా? అందులో ఇంత ఘోరంగానా? "

"అయ్య బాబోయ్... ఇదేం వార్తండీ బాబూ? నిన్న సాయంత్రం నవ్వుతూ నా దగ్గరకొచ్చిందీ... ఇంతలో..."

"అదే... చివరిసారిగా మీ దగ్గర కొచ్చిన ట్లుగా తెలుసూ... అదే మీరే చెప్పారుగా... ఆ తర్వాతే మర్డర్ అయ్యిందిట. ఈ రోజు పొద్దున్నే కాలేజీ టాయిలెట్లు శుభ్రం చెయ్య డానికి లేడీస్ టాయిలెట్‌లోకి వెళ్తే, అక్కడ లావణ్య శవమై పడుందట. ప్యూను రంగ రాజు పొద్దున్నే వచ్చి రూములు తుడిపి స్తాడు కదా. ఇంక అక్కడ్నుంచి ప్రిన్సిపాల్ గారికి, సూపర్నెంటు గారికి, ఇలా అందరికీ ఇన్‌ఫర్‌మేషన్ పాకుతోంది. సూపర్నెంటు గార్నుంచి ఫోనొస్తే వెంటనే బట్టలు తగిలిం చుకుని, కాలేజీకి పరిగెడ్తూ, దార్లో మీరుంటే టచ్‌చేసి వెళ్దామని వచ్చాను. మీకు కచ్చి తంగా తెలిసే వుంటుందని అనుకుంటు న్నానే..." అన్నాడు సుకుమార్‌బాబు, 'కచ్చి తంగా' అనే పదాన్ని ఒత్తిపలుకుతూ. అందులో కొంత వ్యంగ్యం కూడా ధ్వనించిం దిగాని లావణ్య వంటి అమాయకపు పిల్ల హత్య కావించబడడం ఏమిటీ అనే షాకులో ఇదేమీ పట్టించుకోలేదు భాస్కర్.

యాంత్రికంగానే గబగబా బట్టలు మార్చు కుని, రూముకి తాళంపెట్టి, సుకుమార్ బాబుతో బాటు మెట్లు దిగాడు భాస్కర్.

లావణ్యని హత్య చేసేంత కోపం, పగ ఎవరికుంటాయి?



కొంపదీసి 'రేప్' చేయబడిందా? రహస్యం బయటపడుతుందన్న భయంతో చంపేశారా?

లేక బంధువర్గంలో ఎవరన్నా కుటుంబాల మధ్య ఉన్న పగలతో ఈమెను బలి తీసుకున్నారా?

ఎలక్షన్లు మొదలయ్యాయి కదా... ఈమె ప్రచారంలోకి దిగితే, ఆ పక్షం వాళ్లకి బాగా లాభం... ఎదుటి పక్షానికి చాలా నష్టం ఖాయం. ఈమె ఏ పక్షం వాళ్లకన్నా మాటిస్తే, ఎదుటి పక్షం వాళ్లుగానీ...

బళ్లు కాలేజీ కాంపౌండులోకి ప్రవేశించాయి.

అప్పటికే ప్రిన్సిపాల్ గారు, కొందరు లెక్చరర్లు, ఆఫీసు స్టాఫు, కొందరు స్టూడెంట్లు వచ్చేశారు. కొందరు ఇన్‌స్పెక్టర్లు, పోలీసులు హడావుడిగా తిరుగుతున్నారు. ప్రెస్‌వాళ్లు కూడా ఫోటోలు తీసుకుంటూ, ప్రిన్సిపాల్‌గారితో, ఇతరుల్తో ఇంటర్వ్యూలు తీసుకుంటున్నారు.

లేడీస్ టాయిలెట్ బయట ఒక పొడుగు బల్లమీద పడుకోబెట్టి వుంది లావణ్య శవం.

బైక్ దిగి కుంటుకుంటూ ముందుకు వెళ్తున్నాడు భాస్కర్.

ప్రిన్సిపాల్‌గారు, మరో లెక్చరరూ భాస్కర్‌ని చూసి ఆందోళనగా "అదేంటి సార్... కుంటుతున్నారూ?" అంటూ ముందుకు రాబోతే, ఇదేం పెద్ద విషయం కాదన్నట్లుగా భాస్కర్ వాళ్లని వారిస్తూ దూరంగా ఉన్న లావణ్య శవంవైపు చూపిస్తూ, అదురుతున్న చూపుల్తో "ఏంటి సార్ ఈ ఘోరం?" అన్నాడు.

వాళ్లు కూడా ఏం మాట్లాడలేక 'అవును ఘోరమే' అన్నట్లుగా తలలు ఊపుతూ, దించుకున్నారు విచార వదనాలని.

యాంత్రికంగా, గుబులుగా కుంటుకుంటూ ముందుకొచ్చి లావణ్య శవాన్ని చూసిన భాస్కర్ అదుపుతప్పి బావురుమన్నాడు.

## తెలిక గనుక...

కొన్ని కొన్ని కారణాంతరాలవల్ల రామస్వామి ఆర్య సమాజంలో చేరారు. విమర్శకులకు ఇది అయాచిత వరమైంది. రకరకాలుగా ఆయనపై చెలరేగిపోయారు.

ఆ తరుణంలో ఒకాయన వచ్చి 'దేవుడు లేడని చెప్పే మీరు ఆస్తిక వాదాన్ని బలపరచే ఆర్య సమాజంలో చేరడమేంటి? మీరు దేవుడి ఉనికిని అంగీకరించినట్లేనా?' అని అడిగాడు.

'ఆర్య సమాజం మూడు కోట్ల దేవుళ్లను ఒప్పుకోవడం లేదు. దేవుడు ఒక్కడే అంటోంది. ఇందులో చేరితే ఆ ఒక్కడినీ దొరకబుచ్చుకుని కొట్లాడడం నాకు తేలికవుతుంది. అందుకే ఇందులోకి వచ్చాను' అన్నారు నవ్వుతూ.

ప్రిన్సిపాల్ ముందుకొచ్చి భుజం నిమురుతూ, "ఈజీ సర్... ఈజీ" అన్నాడు.

"మంచిపిల్ల సార్. చురుకైన పిల్ల సార్. చదువుల్లో, ఆటల్లో, పాటల్లో, అన్నింటిలోనూ ముందుండే తెలివైన పిల్ల సార్. ఏం ద్రోహం చేసిందని పొట్టన పెట్టుకున్నారు సార్ దుర్మార్గులు? చనిపోయే ముందువరకు తనని తాను రక్షించుకోవడానికి పాపం ఎంతగా పెనుగులాడిందో, సహాయం కోసం ఎంతగా పరితపించిందో ఆ మొహంలో ఇంకా ప్రస్ఫుటంగా కనిపిస్తోంది సార్ నాకు. దేవుడున్నాడా సార్ అసలు? ఇంతటి ఘోరాలు జరుగుతుంటే ఆయనగారేం చేస్తున్నట్లు సార్...?" ఎంతో పరిపక్వత, గుండె ధైర్యం వున్న భాస్కరే అంతలా బేలగా దుఃఖానికి లొంగిపోతుంటే, లావణ్య మీద అతనికున్న శిష్యవాత్సల్యాన్ని అర్థం చేసుకున్న ప్రిన్సిపాల్ ధైర్యం కలిగిస్తూ, భుజం తట్టుతూ, బాధతో తన గొంతు ఒణికిపోకుండా జాగ్రత్తపడుతూ, "దిస్ ఈజ్ లైఫ్



మై డియర్... మేం ఎన్ని ఘోరాలు చూసి ఉంటాం అంటావు? నువ్వింకా చిన్నవాడివి. తప్పదు. అంతే" అన్నారు బుజ్జగిస్తూ.

కళ్లు తుడుచుకుంటూ తలెత్తి, చుట్టూ చూస్తున్న భాస్కర్ చూపు ఓ పక్కన చెట్టు మొదట్లో నిస్సత్తువగా శూన్యంలోకి చూస్తూ కూలబడి వున్న ఓ మధ్యతరగతి దంపతుల మీద పడింది. శిలాప్రతిమల్లా చెట్టుకి చెరో పక్క జారగిలపడి కూర్చుని ఉన్నారు వాళ్లు. బహుశా షాక్ నుంచి తేరుకున్నట్లు లేదు.

భాస్కర్ చూపుని గమనించి ప్రిన్సిపాల్ లోస్వరంతో "లావణ్య తల్లిదండ్రులు షాక్‌లో ఉన్నారు. డిస్టర్బ్ చేయడం కంటే కొంతసేపు వాళ్లని అలా వదిలిపెడితేనే మంచిదనిపించింది మాకు" అన్నారు.

దుఃఖాన్ని ఆపుకున్నాడు భాస్కర్.

జీప్‌లో పోలీస్ కమీషనర్ వచ్చాడు. అటు పరుగెత్తారు ఇన్‌స్పెక్టర్లు. వారి వెనకే నెమ్మదిగా జీప్ దిక్కు నడిచారు ప్రిన్సిపాల్ గారు.

కమీషనర్ శవం వైపు నడిచాడు.

పోలీసులు ఫాలో అయ్యారు. ప్రిన్సిపాల్ దూరంగానే ఉండిపోయారు. శవం దగ్గర నిల్చుని ఇన్‌స్పెక్టర్లతో ఏవో మాట్లాడి, కొన్ని ఆర్డర్స్ ఏవో పాస్ చేసి, తిరిగి ప్రిన్సిపాల్ దగ్గరకు వచ్చిన కమీషనర్, "ఈ మర్డర్ నిన్న సాయంత్రంగానీ, రాత్రి గానీ జరిగివుండొచ్చు ఆఖరుగా ఈ అమ్మాయిని ఎవరు చూశారు?" అని అడిగాడు.

"భాస్కర్‌గారు" అన్నాడు సుకుమార్ బాబు రక్కున. తటాలున సుకుమార్ బాబు వైపు తలతిప్పి, "ఏమిటి మీ తొందరపాటు? పెద్ద తెలుసున్నట్లు చెబ్తున్నారే! పోలీసులతో వ్యవహారం తెలుసా?" అన్నట్లు చూశారు ప్రిన్సిపాల్ కళ్లు చిట్లించి.

'నిజమే... తొందరపడ్డానేమో' నన్నట్లుగా తల దించుకున్నాడు సుకుమార్‌బాబు.

"నిన్న సాయంత్రం నేను చూసిన మాట నిజమే గానీ సర్... ఆ తర్వాత ఆమె షటిల్ ఆడుకుంటానని వెళ్లింది. నేనింటికి వెళ్లిపోయాను. మరి ఆ తర్వాత విషయాలు నాకు తెలియదు" అన్నాడు భాస్కర్.

"ఊс..." అని సాలోచనగా తల వూపి, "మర్డర్ అయ్యే ముందు అమ్మాయి బాగానే రెసిస్ట్ చేసినట్లుగా ఆధారాలు కనిపిస్తున్నాయి" అన్నాడు కమిషనర్. సుకుమార్ బాబు హుషారుగా ముందుకొచ్చాడు.

"అసలు హిస్టరీ, ఇంగ్లిష్ ప్రైవేటు క్లాసులు ఆ అమ్మాయిలకూ, మరికొందరికీ నేను తీసుకునేవాడిని. మరెందుకో నిన్న భాస్కర్‌గారి దగ్గరకి ఇంగ్లిష్ గ్రామర్ చెప్పించుకోడాని కొచ్చిందంటున్నారాయన. మొన్న నా దగ్గరకు క్లాసుకి రాలేదు. నిన్న నేను క్లాసు క్యాన్సిల్ చేశాను. ఆ విషయం తెలీక వెయిట్ చేస్తుందేమోనని, బజారుకి వెళ్లినవాడిని తిరిగొచ్చి, ఆమె విషయం వాకబు చేస్తే, ఆయన ఈ విషయం చెప్పారు. తనూ పనిమీద వెళ్లిపోతున్నానని, ఆమె కూడా ఆడుకోవడానికి వెళ్లిందని చెప్పారు" ఎందుకైనా మంచిదని.

నేర పరిశోధనకి తనవంతు సాయపడాలని ఉత్సాహపడుతూ చెప్పాడు సుకుమార్‌బాబు.

ప్రిన్సిపాల్‌గారికి ఈ విషయాలేం తెలియక మౌనంగా వింటున్నారు ఆసక్తిగా.

లావణ్య శవాన్ని పోస్ట్‌మార్టంకి పంపించడానికి ఏర్పాట్లు జరుగుతున్నాయి. జనం కూడా బాగా పోగవుతున్నారు.

అదుగో... అప్పుడొచ్చింది కాత్యాయని. ప్రాణస్నేహితురాలికి ఇరవై ఏళ్లన్నా నిండాకుండా నూరేళ్లూ నిండిపోయాయని తెలుసుకుని భోరున ఏడుస్తూ.

లావణ్య శవాన్ని చూస్తూనే పోలీసులు వారిస్తున్నా ఆగకుండా అటు పరుగెత్తి, శవం గుండెలమీద వాలి బావురుమంది.



ఆడపోలీసు ఒకామె త్వరగా వచ్చి కాత్యాయనిని కొంచెం బల వంతంమీద లేవదీస్తూ, "ఇప్పుడు శవాన్ని ఎవరూ ముట్టుకోకూడదమ్మా... కొంచెం కంట్రోల్ చేసుకోవాలి..." అంటూ జబ్బ పట్టుకు దూరంగా తీసుకొచ్చింది. కాత్యాయని చూపు కన్నీటి పొరల వెనగ్గా చెట్టు కింద శిలాప్రతిమల్లా కూర్చున్న లావణ్య తల్లిదండ్రులపైన పడింది.

వాళ్లని చూస్తూనే దిమ్మెరపోయింది కాత్యాయని.

వాళ్లసలు జీవంతోనే ఉన్నారా?

అలా ఉన్నారేమిటి వాళ్లు? వాళ్ల గుండెలు కొట్టుకుంటున్నాయా లేదా? రివ్వున వాళ్లవైపు పరుగెత్తి, వాళ్లిద్దర్నీ కుదుపుతూ, "అంకుల్", "ఆంటీ" అంటూ ఆందోళనగా పిలవసాగింది.

రెండు నిముషాలకు వాళ్లల్లో చలనం వచ్చింది.

నెమ్మదిగా కాత్యాయని వైపు తిరిగారు.

"నేనాంటీ! నేనంకుల్! కాత్యాయన్ని. లావణ్య ఫ్రెండ్ని... కాత్యాయన్ని..." గొంతు పెగల్చుకోవడం కష్టమవుతోందామెకు.

ఇద్దరి చూపులూ కాత్యాయని మీద నిలిచాయి.

ఆ చూపుల్లో క్రమేపీ చలనం వచ్చింది...

చూపుల్తోబాటే శరీరంలోనూ చలనం వచ్చింది...

మెదడులోనూ చలనం వచ్చింది...

జరిగిన ఘోరం బుర్రకందుతోంది...

"అమ్మాయి కాత్యా..." అన్నారు ఇద్దరూ ఒక్కసారే ఒణికే గొంతులతో. ఆపైన ఆమెతోబాటే బిగ్గరగా రోదిస్తూ, లేచి లావణ్య శవం దిక్కు తడబడే అడుగుల్తో నడవసాగారు.

వాళ్లు ఆ మౌనంలోంచి బయటపడి సందర్భానికి స్పందించడం భాస్కర్‌కి కొంత రిలీఫ్‌నిచ్చింది. భయం తగ్గింది. బాధ పెరిగింది. సుకుమార్‌బాబు హడావుడిగా ముందుకి కదిలాడు.

లావణ్య తల్లిదండ్రుల్ని చేతులు పట్టుకుని నడిపించుకొస్తున్న కాత్యాయని దగ్గరకు పరుగెత్తుకెళ్లి, హెచ్చరిస్తున్నట్లుగా ఆమెను ఓ పక్కగా రమ్మని కళ్లతో సంజ్ఞ చేస్తూ, లావణ్య తల్లిదండ్రులతో "మీరు వెళ్లి చూడండమ్మా" అని పంపించాడు సుకుమార్‌బాబు. ఆయన ఏం హెచ్చరిస్తున్నాడో అర్థంగాక, అతన్తో పక్కగా నడిచింది కాత్యాయని అయోమయం చూపుల్తో, కళ్లు చిట్లించి ప్రశ్నిస్తూ.

"నీకేమయినా మతిపోయిందా? చిన్నపిల్లవి... నీకు తెలీదు! ఇటువంటి క్రిమినల్ కేసుల్లో అధిక ఉత్సాహం చూపించకూడదు! మనం ఏం తెలీనట్లుగానే ఉండాలి. కొంపలు మునుగుతాయి. మనం గమ్మునున్నా పోలీసులు ఎలాగూ ఇహనుంచీ

**లావణ్య తల్లిదండ్రుల్ని చేతులు పట్టుకుని నడిపించుకొస్తున్న కాత్యాయని దగ్గరకు పరుగెత్తుకెళ్లి, హెచ్చరిస్తున్నట్లుగా ఆమెను ఓ పక్కగా రమ్మని కళ్లతో సంజ్ఞ చేశాడు. "మీరు వెళ్లి చూడండమ్మా" అని లావణ్య తల్లిదండ్రుల్ని పంపించాడు సుకుమార్‌బాబు**



వీడే... వీడే సర్...
మన లావణ్యని
అన్యాయంగా
పొట్టన
పెట్టుకున్నదీ...
వీడే సార్
హంతకుడు...
వీడే సర్
కామపిశాచి...
వీడే వీడే సర్...
అని పేగులు
తెగిపోయేలా
అరిచి నిలబడలేక,
నిస్సత్తువగా
వాలిపోసాగింది
కాత్యాయని



ప్రశ్నలతో చంపుతారు. ఉత్సాహం చూపిస్తే, వాళ్లతోబాటు ఈ మర్డర్ చేసిందెవళ్లో, వాళ్లూ మనమీద కక్షగట్టి చంపుతారు. అందరితోబాటు నువ్వుండంతే! ప్రమాదాలు కోరి తెచ్చుకోకు" అని హెచ్చరిస్తూ గొణిగాడు.

ప్రాణస్నేహితురాలు ఇలా అన్యాయం అయిపోయిందన్న బాధ ముందు సుకుమార్‌బాబు 'ప్రమాదంలో పడతావు' అంటూ చేస్తున్న హెచ్చరికలు ఏమాత్రం నిలవట్లేదు. ఏ సమాధానం ఇవ్వకుండా ముందుకే నడిచింది కాత్యాయని గబగబా.

కాత్యాయనికి హెచ్చరికలు జారీచేసి ఉంటాడని గమనించిన ఓ లెక్చరరుగారు ప్రిన్సిపాల్‌గారి పక్కనే నిలబడి, సన్నగా గొణుగుతున్నట్లు "ఈ సుకుమార్ బాబొకడూ... ప్రతి విషయంలోనూ పెద్ద హడావుడి చేసేస్తాడు. అదేం ఉత్సాహమో!" అన్నాడు ఒళ్లుమంటగా.

ప్రిన్సిపాల్ మౌనంగా, నిలువునా తలూపాడు.

అటూ యిటూ మూవ్ అవుతూ ఆర్డర్లు జారీచేస్తున్న కమిషనర్ ఒకట్రెండుసార్లు భాస్కర్ కాలివైపు ఓరకంట చూశాడు.

లావణ్య తల్లిదండ్రులు అనుభవిస్తున్న క్షోభని చూడలేక, భాస్కర్ ఓ పక్కగా పోయి, సిమెంటు అరుగుమీద బరువుగా నిట్టూరుస్తూ కూలబడ్డాడు.

లావణ్య తల్లిదండ్రుల వెనకే నడుస్తున్న కాత్యాయని దృష్టి సడెన్‌గా బొటానికల్ గార్డెన్ గోడమీద పడింది. అంతే! ఆమె ఆలోచనలు నిన్న సాయంత్రం వైపుకి మళ్లాయి. బుర్రలో నెమ్మదిగా తిరుగుతున్న ఆలోచనలు... నిన్న సాయంత్రం తనకెదురైన సంఘటన... అంతకుముందు లావణ్య తనకు చెప్పిన సంఘటనలు...

ఒక్క వుదుటున బొటానికల్ గార్డెన్స్ గేటువైపు పరుగెత్తింది కాత్యాయని వేగంగా, ఆందోళనగా.

"వీడే... వీడే సర్... మన లావణ్యని అన్యాయంగా పొట్టన పెట్టుకున్నదీ... వీడే సార్ హంతకుడు... వీడే సర్ కామపిశాచి... వీడే వీడే సర్..." అని పేగులు తెగిపోయేలా అరిచి నిలబడలేక, నిస్సత్తువగా వాలిపోసాగింది కాత్యాయని.

ఆడవాళ్లు ఆమెని పొదివి పట్టుకున్నారు.

ప్యూన్లు ఆఫీసు రూములోంచి ఓ పొడువాటి బల్లని తెచ్చారు. దానిమీద కూర్చోబెట్టే, అలాగే దానిమీద వాలిపోయింది కాత్యాయని.

ఇలా జరుగుతుందని ఊహించనందున నోటమాట రాక బిక్కచచ్చిపోయి చూడసాగాడు సుకుమార్‌బాబు.

ఇద్దరు ఇన్‌స్పెక్టర్లు అతనికి దగ్గర్లో ఎడ్జస్ట్ అయి ఎలర్ట్‌గా

నిలబడ్డారు.

కాత్యాయని ముఖంమీద నీళ్లు జల్లారు.

కమీషనర్ ఆర్డర్ మీద హ్యాండ్ కర్చీఫ్‌తో జాగ్రత్తగా కాత్యాయని చేతుల్లోని ప్లాస్టిక్ కాగితాల వస్తువుల్ని బయటకు తీసింది లేడీ కానిస్టేబుల్.

ప్లాస్టిక్ చేతి తొడుగులు

కళ్లు మిటకరించుకుని చూస్తున్నారంతా.

సడెన్‌గా లేచింది కాత్యాయని. "ఏడీ వాడేడీ... చంపేస్తాను వాణ్ణి..." అంటూ పూనకం వచ్చినంత ఆవేశంతో.

సుకుమార్‌బాబులో చలనం వచ్చి గాభరాగా అటూ ఇటూ దిక్కులు చూస్తున్నాడు.

"వాట్ బేబీ... వాట్ హేపెండ్? నీకు తెలిసింది చెప్పమ్మా... కంట్రోల్ చేసుకుని చెప్పు" అన్నాడు కమిషనర్ ఉత్సుకతతో.

"నెమ్మదిగా... నెమ్మదిగా చెప్పమ్మా..." అన్నాడు ప్రిన్సిపాల్ సానునయంగా.

ఈసారి కాత్యాయని ఆవేశం దుఃఖంగా మారింది. ముక్కుపుటాలు, చెంపలు, పెదవులు అదురుతున్నాయి. గుండెలు ఎగిసిపడుతున్నాయి. వెక్కుతూ చెప్పడం ప్రారంభించింది.

"నిన్న సాయంకాలం లావణ్య, నేను భాస్కర్ సార్ దగ్గర ఇంగ్లీష్ గ్రామరు చెప్పించుకుందామని, ఆయన్ని రిక్వెస్టు చేస్తే సరే రండమ్మా అన్నారు సార్. కానీ నేను తప్పనిసరయి ఇంటికి వెళ్లాల్సొచ్చింది. గంటన్నర తర్వాత లావణ్య కాలేజీలో సార్ దగ్గర వుంటుంది కదా, ఆమెతోబాటు వాళ్లింటికి వెళ్దామని కాలేజీకి వచ్చాను సార్. స్టాఫ్ రూం తాళం పెట్టుంది. వెళ్లిపోయినట్లున్నారని, ఇంటికి పోదామని బయలుదేరి, ఇదుగో మా లేడీస్ టాయిలెట్ దగ్గరకొచ్చేసరికి అందులోంచి వస్తూ ఈ సుకుమార్‌బాబుగాడు కనిపించాడ్సార్.

మనిషి గాభరాగా ఉన్నాడు.

బహుశా మా లేడీస్ టాయిలెట్ ఉపయోగించుకుని నా కంట పడినందుకు అలా సిగ్గుతో గాభరా పడ్డాడనుకున్నాను సర్. నాకసలు టాయిలెట్ అప్పుడు ఉపయోగించుకోవాల్సిన అవసరం ఉండి, కాలేజీలో ఎవరూ లేని సమయంలో అతనలా అందులోంచి వచ్చేసరికి ఏదో తెలియని భయం అనిపించి వెళ్లిపోయాను సార్, గబగబా. అలా వెళ్లిపోకుండా టాయిలెట్‌లోకి వెళ్తుంటే మా లావణ్యా కొన ఊపిరితోనైనా దక్కేదేమో... ఆ తర్వాత బతికేదేమో సార్..." అంటూ భోరుమంది.

ఆడవాళ్లు ఆమెని హత్తుకుని ఓదార్చారు.

స్టూడెంట్ల పిడికిళ్ళు బిగుసుకుంటున్నాయి.

పోలీసులు సుకుమార్‌బాబుకి మరింత దగ్గరయ్యారు.

వెక్కిళ్లలోంచి తేరుకుంటూ మళ్లీ చెప్పసాగింది కాత్యాయని. "లావణ్య మీద ఎప్పట్నుంచో కన్నేసి వున్నాడు ఈ రాక్షసుడు. ప్రైవేట్ క్లాసెస్‌లో కూడా వీలైనప్పుడల్లా ఆమెమీద పిచ్చి పిచ్చి కామెంట్స్ చేసేవాడు. హిస్టరీలో ఏ అందమైన స్త్రీ గురించి చెప్పాల్సి వచ్చినా లావణ్యలా ఉంటుందని చెబ్తూ, ఆమెని బుట్టలో వేసుకోవాలని చూసేవాడు. ఆమెని ఒంటరిగా రమ్మని పిలిచి, పొగుడ్తూ, బతిమిలాడ్తూ, భయపెడ్తూ, చాలా విధాలుగా ఆమెను లొంగదీసుకోవాలని ప్రయత్నించి ఫెయిలయ్యాడు. తనకి గవర్నమెంటులోనూ, యూనివర్సిటీలోనూ చాలా పలుకుబడి ఉందని, లావణ్యని పరీక్షల్లో ఫెయిల్ చేయిస్తానని బెదిరించాడు. తనకి లొంగితే యూనివర్సిటీ ఫస్ట్ ఇప్పిస్తానని కూడా ఆశపెట్టి చూశాడు.

ఇవన్నీ పాపం తను నాకు చెప్పుకుని కుమిలిపోయేది. ప్రిన్సిపాల్‌గారికో, పోలీసులకో రిపోర్టిద్దామంటే 'పోనీలే... వాడి ఫ్యామిలీ వీధిన పడ్తుంది. వాళ్ల కోసమన్నా వీణ్ణి క్షమించేద్దాంలే' అనేది. వాళ్ల అమ్మా నాన్నలకు కూడా చెప్పేది కాదు.

నిన్నట్నుంచీ భాస్కర్‌గారి దగ్గరకు ప్రైవేటు క్లాసుకి వెళ్తామని తెల్సి మరీ ఉడికిపోయినట్లున్నాడు. అందులో నేను నిన్న క్లాసుకి వెళ్లడం లేదని తెలిసి ఉంటుంది. ఒంటరిగా ఉన్న లావణ్యని భయపెట్టయినా లొంగదీసుకోవాలనే ప్లానుతోనే వాడు ఈ గ్లాస్ కూడా తెచ్చుకున్నాడు. నిన్న సాయంత్రం వాడు వెళ్లిపోతూ, ఏదో బొటానికల్



గార్డెన్స్‌లోకి విసిరెయ్యడం చూశానుగాని అవి ఇవి అని తెలియదు"

అదుపు తప్పి ఏడవసాగింది కాత్యాయని.

ఇంతలో "అ...మ్మా" అని బాధగా పెద్ద కేక పెట్టాడు సుకుమార్‌బాబు.

అంతా అటు చూశారు.

అక్కడ కొంత అలజడి. పోలీసుల హడావుడి.

ఆవేశంతో ఊగిపోతున్నాడు నేతాజీ. అతని పిడికిలి బిగిసి ఉంది. మరోసారి సుకుమార్‌బాబు ముక్కుమీదకు వాలడానికి సిద్ధమవుతోంది అది.

నేతాజీని అడ్డుకుని, సుకుమార్‌బాబుని జీప్‌వైపు లాక్కుపోయారు పోలీసులు.

"చంపండి...నరకండి... లం..కొ...ని..." అంటూ స్టూడెంట్లు, ప్రజలు అరుస్తున్నారు.

"పబ్లిగ్గా ఉరితీస్తేగాని ఊరుకోం..." అంటోంది అప్పుడే స్కూటీ మీద వచ్చిన ఒక స్త్రీ.

కమీషనర్ ఆర్డర్ అందుకుని, జీపుని స్టేషన్‌కి పోనిచ్చారు పోలీసులు వేగంగా.

మిగిలిన పనులకి సంబంధించి ఆర్డర్లిచ్చి, "నువ్వు కూడా మాతో రామ్మా" అని కాత్యాయనితో అని ప్రిన్సిపాల్‌తో, భాస్కర్‌తో 'మీరు కూడా రండి' అన్నట్లుగా మర్యాదగా సంజ్ఞ చేసి కారు ఎక్కాడు కమీషనర్.

లావణ్య హత్య నగరాన్ని ఒక ఊపు వూపి వదిలింది.

చేసిన నేరం నుంచి తప్పించుకోవడానికి

ప్రయత్నించి, ప్రజల చేతుల్లో చావడంకంటే శ్రీకృష్ణ జన్మస్థానంలోనే కొన్నాళ్లయినా తన ఆయుర్దాయానికి ఢోకా లేదని భావించిన సుకుమార్‌బాబు కిమ్మనకుండా నేరాన్ని బుద్ధిగా ఒప్పేసుకుని, ఊచల్ని జానాబెత్తెలతో కొలుస్తున్నాడు.

* * *

కాలేజీలో లావణ్య హత్య క్రమేపీ పాతబడుతూ, ఎలక్షన్లమీద ఉత్సాహం, ఎవరు



గెలుస్తారన్న ఉత్సుకత కొత్త చిగుర్లు తొడుగుతున్నాయి.

చక్రపాణి, నరసింహుల ప్యానెల్స్ కన్‌ఫర్మ్ అయ్యాయి.

ఎంత డబ్బయినా ఖర్చుపెట్టి తను, తన ప్యానెల్ గెలవాలని చక్రపాణి పట్టుదలగా ఉన్నాడు. బిజినెస్ మాగ్నెట్ అయిన తండ్రి ని ఒప్పించి, ఒక కారు, రెండు టాక్సీల్లో కుర్రాళ్లని ఊరంతా తిప్పుతూ, హోటళ్లలో కావలసినంత తినిపిస్తూ, తనవైపే ఉంచుకోవడానికి చాలా ప్రయత్నమే చేస్తున్నాడు. అవసరమయితే ఇతర కాలేజీల నుంచి కూడా రౌడీల్లాంటి కుర్రాళ్లని తెప్పించి, ప్రత్యర్థులని భయపెట్టాలని అతని ప్యానెల్ నిర్ణయించుకుంది.

స్పోర్ట్స్‌లోనూ, ఎన్.సి.సి.లోనూ రాణిస్తూ చదువులో మధ్యస్థాయిలో ఉన్న నరసింహుల్ని సపోర్ట్ చేస్తున్నారు నేతాజీ, యేసేబు, కళ్యాణి.

మర్యాదగా, నమ్రతతో, సంస్కారంతో ప్రవర్తించే నరసింహులంటే భాస్కర్‌కి చాలా ఇష్టం. భాస్కర్ సార్ మెచ్చిన స్టూడెంట్ కావడమే వీళ్లు అతన్ని సపోర్ట్ చెయ్యడానికి ముఖ్యకారణం. స్నేహితురాలి అకాల, అసహజ మరణాన్ని జీర్ణించుకోలేకపోతోన్న కాత్యాయనిని తల్లిదండ్రులు మద్రాసు తీసుకెళ్లారు, వాతావరణంలో మార్పుంటే మంచిదన్న భాస్కర్ సలహామీద. సుకుమార్ బాబు తనే హత్య చేశానని ఒప్పుకున్న నేపథ్యంలో, కాత్యాయని మానసిక స్థితి, ప్రిన్సిపాల్ హామీ పరిశీలించి ఆమె నుంచి స్టేట్‌మెంట్ రికార్డ్ చేసుకుని, ముఖ్య సాక్షి అయినప్పటికీ నగరం

వదిలి కొన్ని రోజులు గడిపి రావడానికి ఆమెకి పోలీసు పర్మిషన్ లభించింది.

హాస్పిటల్లో ఉన్న పతంజలి ఆరోగ్యంలో మంచి మార్పే కనిపిస్తోంది.

## 10

ఉతికి... ఉతికి... ఉతికి... మెరూన్ షర్టు చివికిపోయి, చిరిగిపోయే స్థితికొచ్చే సింది గానీ భాస్కర్‌కి కుసుమాంజలి కొసరు చూపు అందుకునే భాగ్యం దక్కడంలేదు. రోజూ ఎనిమిది గంటలకు భాస్కర్ చేతిలో నానిన మెరూన్‌షర్టుతో డాబా గదిముందు హాజరు. ఆమె గొడుగు అడ్డు పెట్టుకుంటూ దాటి వెళ్లిపోగానే గుండె బేజారు!

'లాభంలేదు. ఇక అటో యిటో తేల్చేసుకో వాలి. నా రాతి గుండెలో మధువు నింపి, మరులుగొల్పి, మరిచిపో అనడం ఆవిడగారి ఇష్టమేనా? దహించుకుపోతోంది గుండె. భరించలేను' అనుకుని బట్టలు మార్చుకుని, తాడోపేడో తేల్చుకోవడానికి బయలుదేరాడు, ఆమె పనిచేసే బ్యాంకుకి.

మళ్లీ సేవింగ్స్ కౌంటర్ దగ్గరే ఆవిడ దర్శనం. హోంవర్క్ చెయ్యని కుర్రాడు టీచర్ దగ్గరకు భయం భయంగా నడిచి నట్లు సేవింగ్సు కౌంటర్ దగ్గరకు అడుగులో అడుగు వేసుకుంటూ నడిచాడు భాస్కర్.

ఎవరో కస్టమర్ అనుకుని, హుషారుగానే మొహం ఎత్తిన కుసుమాంజలి చటుక్కున కనురెప్పలు వాల్చుకుని, మొహం దించుకుని తనకేం అతన్తో పనిలేదన్నట్లుగా పనిచేసుకో సాగింది.

భాస్కర్ అసహజంగా గొంతు సవరించు కుని సిగ్గుపడ్డాడు. ఆ తర్వాత "కెన్ ఐ హావ్ ఎ విత్‌డ్రా ఫాం ప్లీజ్" అన్నాడు స్టైయిల్‌గా కుసుమాంజలి వైపు అర్ధ ఇంద్ర చాపంలా వంగి.

కౌంటర్ మీద ఓ పక్క అతనికి దగ్గర్లోనే ఉన్న విత్‌డ్రాయల్ ఫారాల వైపు చూపు ల్తోనే డైరెక్ట్ చేస్తూ, 'అవేమిటీ?' అన్నట్లుగా చూసింది.

మళ్లీ సిగ్గుపడ్డాడు భాస్కర్. 'అరె, చూళ్లేదే... లేకపోతే వీటిని జేబులోకి తోసే శాకే అడిగేవాణ్ణి' అనుకున్నాడు.

వేరే కస్టమర్ వచ్చి అతని పక్కన కౌంటర్లో నిల్చోగానే కుసుమాంజలి భాస్క ర్‌తో, "కొంచెం పక్కగా నిల్చుని రాసుకుంటా రా?" అంది. ఆ చూపులో అలక, కోపం కనబడుతూనే వున్నాయి.

"ఓ యస్..." అంటూ పక్కకు జరిగాడు భాస్కర్.

తన పనై, ఆ కస్టమర్ కౌంటర్‌కి దూరంగా వెళ్లగానే భాస్కర్ తిరిగి యథాస్థా నంలోకి వచ్చి ఆమెని ఎలాగైనా నవ్వించా లని, రాస్తున్న మాటల్ని స్పెల్లింగులతో సహా రెండవ తరగతి పిల్లాడిలా అమాయ కంగా చదవసాగాడు.

"పి ఏ వై 'పే', టి ఓ 'టు', బి హెచ్ ఎ ఎస్ కె ఏ ఆర్ 'భాస్కర్...',ఆర్ యు పీ ఈ ఈ ఎస్ 'రుపీస్', ఎఫ్ ఐ వి ఇ 'ఫైవ్', టి హెచ్ ఓ యు ఎస్ ఏ ఎన్ డి 'థౌజండ్' , ఓ ఎ ఎన్ ఎల్ వై ఓన్లీ..."

కుసుమాంజలికి నవ్వు తన్నుకొచ్చింది గానీ, పళ్ల బిగువున ఆపుకుంది.

స్వగతంగా అంటున్నట్లు నటిస్తూ అన్నాడు భాస్కర్, "ఛఛ- ఈ విత్‌డ్రా ఫాంస్ తెలుగులో వుంటే బాగుండును... పరువు పోతోంది ఈ ఇంగ్లిష్‌తో" అని, ఆమె వైపు క్రీగంట చూస్తున్నాడు.

కుసుమాంజలి పళ్లు గిట్టకరిచే ఉంది.

"తీసుకోండి మేడం" ఆమెకి ఫారం అందించాడు.

కేర్‌లెస్‌గా టోకెన్ ఇవ్వబోయి, ఫారంలోకి చూసి, "సైన్ చెయ్యండీ... సైన్ చెయ్య కుండా ఇస్తారేం?" అంది కోపం తెచ్చు కుంటూ.

భాస్కర్ అమాయకంగా, "సైన్...?! ఓ



సంతకమా? మరచిపోయాను మేడం, క్షమించాలి" అంటూ తిరిగి తీసుకుని, 'ఏ-రు-భా-రు' అని రాసిచ్చాడు సైన్ చేసేచోట.

అది చూసిన కుసుమాంజలికి మెదడులో నరాలు కిలకిలలాడాయి. తను రాసిన కు-మాం-లి గుర్తుకొచ్చింది. కానీ, ఏమీ ఎరగనట్లు, "ఇదేమిటి, సరిగ్గా సంతకం చెయ్యండి" అని తిరిగిచ్చింది.

"అయ్యో సరిగా లేదా? "అని వెనక్కి అందుకుని, "-లూ-స్క-" అని ఇందాకటి అక్షరాల కింద రాసిచ్చాడు.

కోపం నటించడం కష్టంగానే వుంది కుసుమాంజలికి.

"చింపెయ్యండి దీన్ని... వేరేది రాయండి" అంది చిరుకోపంతో.

ఇంకొక విత్‌డ్రా ఫారం ఫిలప్ చేసి, "ఏలూరు భాస్కరం" అని పెద్ద అక్షరాలతో రాసి అమె కందించాడు.

"అబ్బా... ఏమిటండిదీ... మీలాంటివాళ్లు ఇంకో పదిమందొస్తే మా పని సరే" అంది కస్సుమంటూ, నవ్వు కనబడకుండా జాగ్రత్తపడుతూ.

"అందుకే... ఎవ్వరూ రాకుండా, నేనొక్కడ్నే ఇక్కడ కదలకుండా నిల్చున్నానండి" అమాయకంగా అన్నాడు భాస్కర్.

"సంతోషించాం... పేరుమీద సంతకం చేయండి"

"చూశారా మరచిపోయాను" అంటూ, విత్‌డ్రా ఫారం అందుకుని పేరు పైన ఒక పువ్వు బొమ్మ వేసి తిరిగి యిచ్చాడు.

కుసుమాంజలికి తనని తాను కంట్రోల్ చేసుకోవడం కష్టమయ్యింది. సిగ్గుతో బుగ్గలు ఎర్రబడ్డాయి. పెదవులు బిగిస్తూ తలెత్తి భాస్కర్‌నే చూస్తోంది. ఆమె కళ్లల్లో సన్నటి కన్నీటితెర. ఆ కన్నీటితెర మీద ప్రేమని సాధించిన చిరుగర్వం. అనుకొన్నది పొంది న ఆనందం. అలక తీర్చుకున్న సంతృప్తి.

"విత్‌డ్రా కరెక్ట్‌గానే చేస్తున్నానా మేడం? " అన్నాడు భాస్కర్ చిరునవ్వుతో.

"అడ్వాన్స్ క్యూడా అర్థులే" అంది బ్యాంకింగ్ భాషలో, సిగ్గుగా. అందులోని రెండో అర్థం భాస్కర్ గుండెలకి తగిలి, శరీరం పులకించింది.

"మరి టోకెన్...? " భాస్కర్ వినయంగా.

టోకెన్ని అతని చేతిలో ఉంచుతున్నప్పుడు, ఆమె అరచేతి మెత్తని స్పర్శ... ఇద్దరికీ శరీరాలు ఆనందంతో జలదరించాయి.

అతనిచ్చిన విత్‌డ్రాయల్ ఫారంని గబగబా అందంగా మడిచి, హ్యాండ్‌బ్యాగ్‌లో దాచుకుంది కుసుమాంజలి. ఆ పైన తనే ఓ విత్‌డ్రాయల్ ఫాం తీసుకుని, అయిదువేలకి రాసి, సంతకం పెట్టి, దానిమీద భాస్కర్‌కిచ్చిన టోకెన్ నెంబరు వేసి కంప్యూటర్లో తన ఎక్కౌంటులో 'డెబిట్' చేసి, "వెళ్లి, క్యాష్ తీసుకోండి" అంది.

కుసుమాంజలికి తనని తాను కంట్రోల్ చేసుకోవడం కష్టమయ్యింది. సిగ్గుతో బుగ్గలు ఎర్రబడ్డాయి. పెదవులు బిగిస్తూ తలెత్తి భాస్కర్‌నే చూస్తోంది. ఆమె కళ్లల్లో సన్నటి కన్నీటితెర. ఆ కన్నీటితెర మీద ప్రేమని సాధించిన చిరుగర్వం



## మీ 'గుండె'ను పట్టుకోండి



గుండెపోటు, ఇతర గుండె జబ్బుల గురించి మీకు ఎంత పరిజ్ఞానం ఉందో, మిమ్మల్ని ఒక్కసారి పరిశీలించుకోమంటున్నారు వైద్యనిపుణులు. అందుకోసం వాళ్లు ఓ ప్రశ్నావళిని తయారు చేశారు. ఇదిగో అది...

1. మీరు ధూమపానం చేస్తారా?
అవును- ; కాదు-

2. మీ డాక్టరు మీ కొలెస్ట్రాల్ ప్రమాణం 200 మి.గ్రా. అంతకంటే ఎక్కువ లేదా హెచ్.డి.యల్ 40.మి.గ్రా. కంటే తక్కువగా ఉందని చెప్పారా?
అవును- ; కాదు-

3. మీ రక్తపోటు 140/90 లేదా ఎక్కువగా ఉందని మీ డాక్టరు చెప్పారా?
అవును- ; కాదు-

4. మీ తండ్రి, అన్నదమ్ములకి 55 సం॥ లోపు హార్టెటాక్ వచ్చిందా? లేక మీ అమ్మ, అక్క చెల్లెళ్ళకి 65 సం॥ లోపు హార్టెటాక్ వచ్చిందా?
అవును- ; కాదు-

5. మీకు మధుమేహ వ్యాధి ఉందా? మీ ఫాస్టింగ్ బ్లడ్ షుగర్ 100 మి.గ్రా. కంటే ఎక్కువగా ఉందా? అందుకు మందులు వాడుతున్నారా?
అవును- ; కాదు-

6. మీ వయస్సు 55 సంవత్సరాలా?
అవును- ; కాదు-

7. మీ బి.ఎమ్.ఐ (బాడీ మాస్ ఇండెక్స్) 25 అంతకంటే ఎక్కువగా ఉందా?
అవును- ; కాదు-

8. మీరు శరీర వ్యాయామం 30ని॥ల కంటే ఎక్కువగా చేస్తారా?
అవును- ; కాదు-

9. మీకు ఛాతీ నెప్పి (యాంజైనా) లేదా హార్టెటాక్ ఉందని మీ డాక్టరు చెప్పారా?
అవును- ; కాదు-

పై తొమ్మిది ప్రశ్నల్లో ఏ ఒక్కదానికైనా మీ సమాధానం అవును అయితే, మీకు గుండె పోటు ప్రమాదం ఉందని గుర్తుంచుకోవాలని నిపుణుల ఉవాచ.

విషయం అర్థమైన భాస్కర్, "ఏ ఎకౌంటు?" అనడిగాడు అమాయకంగా.

"మన అకౌంటే" అంది కుసుమాంజలి ఆనందంగా.

"మన... అంటే... యు అండ్ ఐ, ఆర్ కంబైన్డ్ ఉయ్?"

"ఉమ్మడి ఉయ్"

"అమ్మో, నా ఎకౌంటు ఖాళీ చేసెయ్యాలి బాబోయ్"

"అవకాశం లేదు... జాయింట్ అయిపోయింది. ఇద్దరి కన్సెంటు కావాలి" కిలకిల నవ్వింది.

"ఒప్పుకుంటున్నాం" అంటూ తనూ నవ్వి, క్యాష్ కౌంటర్ దగ్గరకు నడిచాడు భాస్కర్.



తన దగ్గరకొచ్చిన కుసుమాంజలి విత్‌డ్రాయల్ కస్టమర్ తీసుకుంటున్నాడేమిటాని క్యాషియర్ కొద్దిగా ఆశ్చర్యపోతూ, ఆవిడ సీటువైపు చూశాడు. కుసుమాంజలి గబగబా వచ్చి "ఆయనకి కొత్త నోట్లు ఇవ్వండి క్యాషియర్‌గారూ... ప్లీజ్" అంది.

* * *

భాస్కర్‌కి చాలా ఆనందంగా వుంది.

విద్యార్థుల నుంచి, సొసైటీనుంచీ లభిస్తున్న గౌరవ మర్యాదలతోబాటు ఇప్పుడు తనూ ప్రేమించబడగలడు. అలాగే తనూ ప్రేమించగలడు కూడా. జీవితానికి ఓ పరిపూర్ణత, ఓ సార్థకత లభించడానికి ఒక్కో మెట్టే ఎక్కే అవకాశాలు తనకు బాగానే వస్తున్నాయి. వచ్చిన అవకాశాలని తను చక్కగానే వినియోగించుకుంటున్నాడు. అలా వినియోగించుకునే శక్తినిస్తూ ఏదో అదృశ్య శక్తి తనకి బాగానే తోడ్పడుతోంది. ఏ అదృశ్య శక్తి, అంతర్యామి ఎన్ని అవకాశాలు కల్పించి తోడ్పడినా మనిషి బుద్ధి వక్రించో, చింతకు లొంగిపోయో, తప్పటడుగు,తప్పటడుగు వేసో అధఃపాతాళానికి జారిపోతేనో, పిరికితనంతో ఆత్మహత్యకు పాల్పడితేనో- ఆ దురదృష్టానికి ఎవరు బాధ్యత వహిస్తారు?!

ఆ తప్పటడుగే వేసి, తన అస్తిత్వాన్నే తుడిచేసే తొందరపాటులో ఉన్న తనని కాపాడిన ఆ దేవత, తన ఈనాటి ఆనందానికి మూలాధారమైన ఆ పుణ్యాత్మురాలు శారద ఎలా ఉందో?! అసలు ఉందో, లేదో?! కాని ఆమె తన గుండెల్లో శారదా దేవియై పూజించబడ్తోంది. ఆమె తన ఇంట కూడా వెలియాలి... ఎలా?!

మురళి గుర్తుకొచ్చాడు భాస్కర్‌కి.

మురళి! కొన్నిరోజుల క్రితం మాధవాచార్యులుగారిది, తనది కేరికేచర్స్ బోర్డుమీద చాక్‌పీస్‌తో గీసి, తన మెప్పు పొందిన స్టూడెంట్. అతన్లో మంచి ఆర్టిస్ట్ వున్నాడని ఆ అబ్బాయిని తను ఎంకరేజ్ చేశాక, చాలా జీవం ఉట్టిపడే చిత్రాలు గీసి, తీసుకొచ్చి తనకు చూపించాడు.

ఖర్చుకి వెనకాడక ఆర్ట్‌ని ఇంప్రూవ్ చేసుకోమని తను ఆ అబ్బాయి భుజం తట్టాడు. తన సహాయం అన్నివిధాలా ఉంటుందని చెప్పాడు కూడా. ఏదో ఆర్ట్ స్కూల్లో కూడా జాయినై, ట్రయిన్ అవుతున్నానని చెప్పాడా కుర్రాడు.

"ఈరోజు సాయంత్రం మురళితో చాలా పనుంది నాకు" అనుకున్నాడు భాస్కర్.

* * *

సాయంత్రం క్లాసులయిపోయాక, స్టాఫ్ రూంలో తననొకసారి కలవమని మురళికి కబురు చేశాడు భాస్కర్.

సాయంత్రమయింది.

స్టాఫంతా వెళ్లిపోయారు.

భాస్కర్ ఒంటరిగా మురళి కోసం ఎదురుచూస్తున్నాడు.

మురళి వచ్చాడు. "సారీ సార్... లేట్ అయింది" అన్నాడు అపాలజీగా.

"మురళీ... నీనుంచి ఓ గొప్ప సహాయం కావాలోయ్" అన్నాడు భాస్కర్ సూటిగా చూస్తూ.

మురళి తత్తరపడ్డాడు.

"నానుంచా సర్?" అన్నాడు, జోక్ చేస్తున్నారా అన్నట్లుగా.

"ఆహా...నీ నుంచే! అక్షరాలా 'నీ'నుంచే" ఒత్తిపలికాడు భాస్కర్.

భాస్కర్ సీరియస్‌గానే అంటున్నాడని అర్థం చేసుకున్నాడు మురళి. "చెప్పండి సర్" అన్నాడు. భాస్కర్ చెప్పిన పని చెయ్యలేక ఫెయిల్ అవుతానేమోనని భయపడుతూ.

"ఏం లేదూ... కొన్ని సంవత్సరాల క్రితం నేను చూసిన ఓ వ్యక్తి పోలికల్ని వర్ణిస్తానూ...నువ్వు నాకు బొమ్మ గీసిపెట్టాలి"

"అయ్యబాబోయ్... అంత ఆర్టు లేదు సార్ నా దగ్గర"



"ఆంజనేయుడులాంటి వాడివి నువ్వు. నీ శక్తి నీకు తెలియదు"

"నన్ను ఎన్‌కరేజ్ చెయ్యడానికి మీరు.."

"ఆ శక్తే నీలో లేకపోతే, నా ఎన్‌కరేజ్‌మెంట్ ఏం పనిచేస్తుందీ? "

తదేకంగా భాస్కర్‌నే చూస్తున్నాడు మురళి. భాస్కర్‌కి తనలోని ఆర్ట్ మీద అంత గట్టి నమ్మకం ఉన్నందుకు చలించిపోతున్నాడు. ఒళ్లు దగ్గర పెట్టుకుని, పనిచేయాల్సిన అవసరం వచ్చిందని గ్రహిస్తున్నాడు. అలా గ్రహిస్తూనే అతని కనురెప్పలు మూసుకున్నాయి. భ్రుకుటి దగ్గర దృష్టి నిలిచింది. నిశ్చలంగా శిలాప్రతిమలా నిష్ఠలో ఉన్నవాడిలా బిగుసుకున్నాడు.

మెస్మరైజింగ్ వాయిస్‌తో శారద ముఖకవళికల్ని, అందులోని భావాల్ని, ఆమె చూపుల్లోని చల్లదనాన్ని, జాలిని వర్ణిస్తున్నాడు భాస్కర్.

భాస్కర్ వర్ణన వింటున్నకొద్దీ మురళిలోని కళాకారుడు కాన్వాస్ మీద ఆ ఊహాచిత్రాన్ని ఆవిష్కరించడానికి ఒళ్లు విరుచుకుంటున్నాడు. ఏదో తెలియని ఆవేశం, ఏదో తెలియని ఆర్తి, ఏదో తెలియని మైకం... భావావేశంతో అతను కళ్లు తెరిచేసరికి భాస్కర్ అతని ముందు డ్రాయింగు పేపరు, పెన్సిళ్లు, యితర సామగ్రి సిద్ధం చేశాడు.

తదేక దృష్టితో తన మస్తిష్కంలో నిలిచిన స్త్రీమూర్తిని ఆ పేపరు మీద ఇరవై నిముషాల్లో దించాడు మురళి.

"ఎక్సలెంట్... ఇలాగే వుంటుంది" అన్నాడు భాస్కర్ సంతృప్తిగా.

భాస్కర్‌కి సంతృప్తినిచ్చే స్థాయిలో తను బొమ్మ గీయగలిగినందుకు సంతోషిస్తూ, "ఎవరు సార్ ఈమె? " అనడిగాడు మురళి కుతూహలంగా.

"నా దైవం" భాస్కర్ గొంతులో తడి.

కళ్లు విచ్చుకు చూశాడు మురళి.

"నాకు తెలిసినంతవరకు నా కొక్కడికే ఆమె దైవం. సమాజానికి..." భాస్కర్ గొంతు బొంగురుపోయింది.

"సార్? "

"సమాజానికి ఆమె ఒక వేశ్య"

"ఏంటిసార్ మీరనేది? "

"నిజం... నిజంగా కూడా ఆమె వేశ్య. వేశ్యగా మార్చబడ్డ ఓ పూజా పుష్పం" అంటూ, ఆమె తనకు చెప్పిన ఆమె కథని మురళికి విపులంగా చెప్పాడు భాస్కర్.

మురళి కళ్లు తడిసిపోయాయి.

"చాలా బాగా గీశావు మురళీ. ఈ బొమ్మని ఎన్‌లార్జ్ చేయించి, ఫొటో తీయించి, పటం కట్టిస్తా. థేంక్యూ" అన్నాడు భాస్కర్.

"కాదు సార్... ఇది కాదు! మీరు చూసిన శారద ఈమె కాదు!" తల అడ్డంగా ఊపుతూ అన్నాడు మురళి.

'ఇలా అంటాడేవిటీ' అని ఆశ్చర్యపోతూ చూశాడు భాస్కర్.

"నిజం సార్... ఈ బొమ్మలో బాహ్య రూపం ఒక్కటే చిత్రించాను. ఆమె మనస్సు ఆమె ముఖంలో, ఆమె కళ్లల్లో ఆవిష్కరించబడలేదు. రేపు ఇదే సమయానికి తెచ్చి మీ ముందు నిలబెడతాను సార్... మీ దైవాన్ని" నమ్మకంగా, ధైర్యంగా, ఆత్మవిశ్వాసంగా, పవిత్రకార్యాన్ని చెయ్యబూనిన ఆనందంతో అన్నాడు మురళి లేస్తూ.

మురళినే వాత్సల్యంతో చూస్తున్నాడు భాస్కర్.

"వస్తా సార్... ఊహల్లో సజీవ కళతో రూపుదిద్దుకున్న ఆ మూర్తిని చిత్రించే పని వెంటనే ప్రారంభించాలి" అంటూ లేచి మెట్లు దిగివెళ్తున్న మురళిని వారించలేదు భాస్కర్. అతడిలోని కళాకారుడికి శుభాకాంక్షలు చెబ్తూ, అతను కనుమరుగయ్యేంతవరకు అలాగే చూస్తూ నిలబడిపోయాడు.



## 11




అందమైన సాయం సంధ్య హాస్పిటల్ చుట్టూ పరుచుకుంది.

పతంజలి ఆరోగ్యం బాగా మెరుగుపడింది.

భాస్కర్ అతణ్ణి చూడడానికి వెళ్లేసరికి, మంచం మీద పడుకునే రామిరెడ్డి, యేసేబు, కళ్యాణిలతో కులాసాగా జోక్స్ వేసుకుంటూ మాట్లాడుతున్నాడు.

కొడుకు తిరిగి మామూలు మనిషి అవుతూండడంతో కుదుటపడ్డ మనసుల్తో బయట లాన్స్‌లో పచార్లు చేస్తున్నారు బ్రహ్మయ్యశాస్త్రి దంపతులు, పిల్లల్ని సరదాగా మాట్లాడుకోవడానికి విడిచిపెట్టి.

భాస్కర్‌ని చూస్తూనే స్టూడెంట్సు ముగ్గురూ లేచి నిలబడ్డారు, "గుడీవినింగ్ సార్" అంటూ. పతంజలి కూడా మంచం మీద లేచి కూర్చున్నాడు 'నమస్తే సార్' అంటూ.

'పడుకో పడుకో ఫర్వాలేదు' అని వారించాడు భాస్కర్.

"లేదుసార్... లేవనీండి. అతను లేవాలి" అన్నాడు యేసేబు, నర్మగర్భంగా.

అవునన్నట్లుగా తలూపాడు రామిరెడ్డి.

ఇద్దర్నీ మెచ్చుకోలుగా అభినందిస్తూ చూశాడు భాస్కర్.

"రామదాసు గారొస్తున్నారు" అంది కళ్యాణి, వరండా వైపు చూస్తూ, గుమ్మం దగ్గర్నుంచి.

భాస్కర్, స్టూడెంట్స్ గుమ్మం దగ్గరకు నడిచారు.

"నమస్కారం లెచ్చరర్ గారూ! ఎట్టావుంది పతంజలి బాబుకి?" అంటూ వాకబు చేస్తూ హడావిడిగా రూములోకి అడుగుపెట్టాడు రామదాసు. మనిషిలో ఇంకా ఏదో తెలియని వ్యాకులత వుంది. "బాగా నయమైపోయిందండి" అని భాస్కర్ అన్న మాటలు, కళ్లెదురుగా మంచంమీద చిరునవ్వు చిందిస్తూ రెండు చేతులూ జోడించి, దర్శనమిచ్చిన పతంజలి ఊరట కలిగించగా నవ్వాడు రామదాసు తృప్తిగా.

రామదాసు రావడం బయటనుంచే చూసినట్లున్నారు, శాస్త్రి, ఆయన భార్య గాయత్రి నవ్వుతూ లోపలకొచ్చారు. రామదాసు చూపు తనమీద పడుతూనే చేతులు చాపి, బాణంలా వచ్చి, అతన్ని గాఢంగా కౌగలించుకుని, ఆనందభాష్పాలతో "నువ్వు మా అబ్బాయికి ప్రాణం పోసిన దేవుడివి రామదాసూ... ఈ జన్మలో నీ రుణం తీర్చుకోలేను. నీ కారణంగానే ఈ అమ్మాయి, లెక్చరర్ గారిలాంటి మంచి మనిషి, ఈ కుర్రాళ్లు మాకు స్వంత పిల్లల్లా మాతో నిలిచి, బాబుని మనిషిని చేసి ప్రాణం పోశారు" అన్నాడు శాస్త్రి గద్గదికతో.

గాయత్రి కళ్లంతా నీళ్లయిపోగా, డగ్గుత్తికతో మాట రాక చేతులు జోడించి నిలబడి వుంది.

శాస్త్రి వీపు నిమురుతూ, "నాదేం ఉందయ్యా, అంతా ఈ లెచ్చరర్‌గారి మంచి మనసు. ఈ కుర్రోళ్లందరికీ ఆయన మాట మీదున్న గౌరవం. అయే... అయే... బాబుని కాపాడాయి. అయినా జీవితంలో నువ్వు నన్నో మనిషిని చైడానికి పడ్డ తాపత్రయంలో, నేన్జేసే సాయం ఏ పాటిదయ్యా శాస్త్రీ. మాటకు ముందు 'సాయం జేశావు. రుణం తీర్చుకోలేను' అంటూ పొగుడుతావు నన్ను? నీ గుండెలకు నన్ను అత్తుకున్నావు సూడూ అది చాలయ్యా, కోటి రూపాయ



లిచ్చినా ఆ ఆనందం నాకు దక్కదు" అంటూ శాస్త్రి భుజం మీద వాలిపోయాడు రామదాసు.

ఒక నిముషం ఆ పరిష్వంగం లోని ఆనందాన్ని అనుభవిం చాక, నెమ్మదిగా తలెత్తి, శాస్త్రికి దూరంగా జరు గుతూ, అదురుతున్న చెంపల్ని అదుపు చేసుకో డానికి ప్రయత్నిస్తూ, "ఇగ నా కొడుకు నాగుబాబు పనిమిగిలింది. ఈయాళ నా చేతుల్లో చచ్చిపోతాడాడు" అన్నాడు రామదాసు కోపంగా.



"రామదాసు... ఏంటది? ఊరుకో" అని వారించాడు శాస్త్రి.

"ఊరుకోడం కాదు... ఊరికి తీసుకుపోయి, ఉరే సేస్తాను ఆణ్ణి" పళ్లు నూరాడు రామదాసు.

"ఊరుకోండి సార్... శాంతించండి... ప్లీజ్" అన్నాడు భాస్కర్.

"శాంతమా? ఎందుక య్యా శాంతం? ఆవుదూడ లాంటి కుర్రోడిని ఆసు పత్రి పాల్జేసినందుకా? ఆడికి నే పెట్టే తిండితో అంత ఒళ్లు కొవ్వెక్కి వుంటే, వూళ్లో రౌడీలుంటారు సూడండి. మదమెక్కి ఆళ్లతో కలియబడమనండి, దూల్దీరిపోద్ది! అంతే గాని...హమ్మా... ఇంకా ఎవరో అల్లరి కుర్రోళ్లు కారణం అనుకుంటున్నా బాబుకిట్టా అవడానికి... ఈడా? అయిపోయిందింక ఆడిపని..." బుసలు కొడ్తున్నాడు, రామ దాసు.

పతంజలి స్థితికి రామదాసు కొడుకు కారకుడన్న సత్యాన్ని ఇప్పుడే తెలు సుకున్న శాస్త్రి దంపతులు ముందు ఆశ్చర్య పోతూ బాధ పడ్డారు గానీ రామదాసు కోపాన్ని చూసి మరీ బాధపడుతున్నారు.

గాయత్రి ఓ అడుగు ముందుకు వేసి రామదాసుతో, "అన్నయ్యగారూ... ఏదో కుర్రాళ్లు. తెలిసీ తెలియని వయసు. సావా సగాళ్లవల్ల చెడిపోతూంటారు. పెద్దవాళ్లం మనం ఏదో ఓ మాటు చీవాట్లు పెట్టి మందలించాలంతే గాని... మనమే శిక్షిస్తే ఎలా? ఈపాటికి మీ అబ్బాయి కూడా

పాపం, తప్పు చేశానని బాధపడుతూనే ఉంటాడు. అందరూ తనని ఏమంటారోనని భయపడుతూనే ఉంటాడు. ఆ రోజున కొట్టే శారు కూడా మీరు. ఇంకేమనకండి పాపం!



చాలు!" అంది తక్కువస్థాయి గొంతుతో, బ్రతిమాలుతున్నట్లు.

"లేదమ్మా పిచ్చితల్లీ! ఆణ్ణి శిచ్చించకపోతే, మృగం అయిపోతాడు. కనీసం ఆణ్ణి కాలేజీ నుంచయినా డిస్మిస్ జేసెయ్యాల. తోటి మడిసిమీద దయ, ప్రేమ, కరుణ వున్నోడే మంచి డాక్టరవుతాడు. కసాయి గుండోడు ఏం డాక్టరుగా పనికొత్తాడు? పెద్దానికీ గుండెలు కోసేసి, ఆనందిత్తాడంతే!..." ఆవే శపడిపోతున్నాడు రామదాసు. ఒళ్లు తెలియ ని పూనకంలో వున్నాడు. తన కొడుకు తన ప్రాణస్నేహితుడికి యింత దుఃఖాన్ని తెచ్చిపెట్టాడంటే ఓర్చు కోలేకపోతున్నాడు. కొడుకు కని పిస్తే ఏమైనా చేసేసేలా వున్నాడు.

ఆఖరి అస్త్రం ఉపయోగించేశాడు శాస్త్రి.

రామదాసు చేతిని అందుకుని పైకెత్తి, వెంటనే దాన్ని పతంజలి తలమీద వుంచి, "నువ్వు నీ బిడ్డకేమైనా కఠిన శిక్ష వేస్తే... నా బిడ్డమీద..." అని శాస్త్రి అంటుండగానే, గబుక్కున మరో చేత్తో ఆయన నోరు మూసి, స్నేహానికీ, మంచితనానికి లొంగి పోయి, "శాస్త్రి... ఎప్పుడూ ఇంతేనయ్యా నువ్వూ..." అంటూ గిజగిజలాడిన రామ దాసు, "సరే అయితే ... మీ యిష్టానికే ఒదిలేస్తున్నాను. నేనింక ఆడిముకం సూడ్ను. ఆడు నాకు కొడుకు కాదు, నేనాడికి తండ్రినీ కాదు. నెలకింతని డబ్బు ఆడిమొకాన తగలేత్తాను. సదువుకుంటాడో, సచ్చిపోతాడో ఆడిస్టం. నేపోతున్నా..." అంటూ బయటకు నడిచాడు రామదాసు, పెద్ద పెద్ద అంగల్తో.

ప్రస్తుతానికి ఆయన కోపం కొంత కంట్రోల్ అయినందుకు సంతోషిస్తూ, శాస్త్రి, భాస్కర్ ఆయ న్తోపాటే బస్టాండ్‌కి బయలుదేరారు, వీడ్కోలు యివ్వడానికి.

బస్టాండులో నాగుబాబు విషయంలో యింకొంచెం శాంతంగా వ్యవహరించమని బ్రహ్మయ్యశాస్త్రి ఎన్నివిధాల నచ్చచెప్పాలని చూసినా రామదాసు ఒప్పుకోలేదు. ఇంకా ఎక్కువ బలవంతపెడ్తే శాస్త్రితో స్నేహాన్న యినా వదులుకుంటానన్నాడు గానీ, కొడుకు మీద ఇంక జాలి, ప్రేమ చూపించలేననే తెగేసి చెప్పేశాడు.

భాస్కర్ ఆయన్ని ఎక్కువ బలవంతపెట్ట లేదు. నాగుబాబుకి అది సరయిన శిక్షే అని పించింది. అంత వెధవ పని చేసి

సరిగ్గా
తన రూము
ముందుకొచ్చాక,
ఓరగా తలెత్తి,
తనవైపో
చిరునవ్వుతో
కూడిన
చూపు విసిరి
దాటిపోతోంది.
తన చూపు
దాటిపోతోంది.
భాస్కర్ గుండెలు
గుబగుబలాడుతు
న్నాయి. నీరసపడు
తున్నాడు...
నిరుత్సాహ
పడుతున్నాడు...



కూడా, తమ కాలేజీ కుర్రాళ్లతో ఫైటింగుకి వచ్చాడు వాడు. వాడు మారడం కష్టం. చెప్పుదెబ్బలు అన్నివైపుల నుంచీ గట్టిగా పడ్డేనే ఎప్పటికయినా దార్లోకి రావొచ్చు వాడు. అదీ చెప్పలేం.

రామదాసుకి వీడ్కోలు యిచ్చేశాక, శాస్త్రిని స్కూటర్‌మీద కళ్యాణి వాళ్లింటి దగ్గర దింపేసి, రూముకి బయలుదేరాడు భాస్కర్. రూముకి వెళ్లాక వంట చేసుకోవడానికి అలసటగా అనిపించి, హోటల్లో దూరాడు భోజనానికి. భోజనం చేస్తుంటే, 'ఇంక స్వయంపాకాలు, హోటల్ భోజనాలు కొన్ని రోజులేకదా' అనిపించి, ఉదయం సంఘటనలు గుర్తుకొచ్చాయి, మనసు ఆనందంతో ఝులంఝులించింది.

ఉదయం ఎనిమిది గంటలకి డాబామీద రూం ముందు నిల్చుని వున్నాడు భాస్కర్. ఇంక మెరూన్ షర్టుని పిండి పిప్పి చేయాల్సిన అవసరంలేదని అతనికి తెలుసు.

హంసలా నడుచుకొస్తోంది తన హృదయం... కుసుమాం జలి... ఉదయాంజలి... హృదయాంజలి...

కొద్దిరోజుల్లో తన స్వంతం కాబోయే ఆ అందాన్ని కళ్లార్ప కుండా చూస్తున్నాడు భాస్కర్.

గంధం రంగు పంజాబీ డ్రెస్‌లో ఈ రోజు కొత్త అందాన్ని సంతరించుకుని, నడకలో కూడా ఉప్పొంగిన ఆనందం, ఉబికి వస్తున్న నునుసిగ్గు ముప్పిరికొంటూంటే, తడబడే అడుగుల్తో, గమ్మత్తు నడకతో, తన ముందు నుంచి...

సరిగ్గా తన రూము ముందుకొచ్చాక, ఓరగా తలెత్తి, తనవైపో చిరునవ్వుతో కూడిన చూపు విసిరి దాటిపోతోంది.

తన చూపు దాటిపోతోంది.

భాస్కర్ గుండెలు గుబగుబలాడుతున్నాయి. నీరసపడుతు న్నాడు... నిరుత్సాహపడుతున్నాడు...

తన చూపు దాటిపోతుండగా ఒక్కసారిగా ఏదో గుర్తొచ్చినట్లు వెనక్కి తిరిగింది కుసుమాంజలి. వెనక్కి నడుస్తోంది.

భాస్కర్ భ్రుకుటి ముడిపడింది.

ఇదేమిటీ... ఏమైనా మరచిపోయిందా? అపశకునం ఏదన్నా ఎదురయిందా? ...

తిరుగు ప్రయాణం అవుతూ మళ్లీ ఓరచూపు, చిరునవ్వు తనకు ప్రెజెంటేషన్...

భాస్కర్ మొహం చందమామే అయ్యింది.

అలాగే చూస్తున్నాడు.

మళ్లీ కనుచూపుమేర వరకు వెళ్లి తిరిగివస్తోంది. వివేకానం దుడి స్టాచ్యూలా చేతులు కట్టుకుని, బుద్ధిగా ఆమెనే చూస్తు న్నాడు భాస్కర్. మళ్లీ ఓ ఓరచూపు, చిరునవ్వు, 'ఇకచాల్లే,

అజీర్తి చేస్తుంది' అన్నట్లుగా తలాడింపు... గబగబా అడుగులు వేస్తూ, ముందుకు సాగి పోయింది కుసుమాంజలి.

ఆనందంతో ఆరేళ్ల పిల్లాడైపోయి గంతులే శాడు భాస్కర్.

బయట సైటుకొడ్తున్నప్పుడు మాడిపో యిన బంగాళాదుంపల వేపుడే అమృతమని పిస్తుండగా, భోజనం కానిచ్చి 'ఇవ్వాళ వయా బ్యాంకు వెళ్దాం కాలేజీకి అనుకుని, స్కూటర్‌ని ఉరికించాడు.

పదివేలకి విత్‌డ్రాయల్ రాసి, కుసుమాం జలి చేతికిచ్చాడు. తమాషా చేయడానికీ, తను అతని రూము ముందు రెండు రౌండ్లు కొట్టినందుకు లోకువ కడ్తాడేమోననే సహజమైన సందేహంతోటి, ఎవళ్లో కొత్తవా ళ్లకిచ్చినట్లు, భాస్కర్‌మీద ప్రత్యేక శ్రద్ధ లేనట్లు టోకెన్ ఇచ్చింది ఆమె.

అప్పుడు భాస్కర్ అన్నాడు, "మేడం - నేనో కాలేజీ లెక్చరర్ని. ఒంటరిగాణ్ణి. బేచి లర్ని. వంట చేసిపెట్టే వాళ్లెవరూ లేక స్వయంపాకం చేసుకుని నేనే తినాలి. ఆల స్యమైపోతుంది. కాలేజీకి టైమైపోతోంది. దయచేసి, ఈ డబ్బును డ్రా చేసుకుని మీ దగ్గరే పెట్టుకుంటారా? మళ్లీ వచ్చి తీసుకుం టానూ..."

"నా దగ్గరా?!" ఆశ్చర్యంగా చూసింది కుసుమాంజలి.

"యస్ మేడం. ప్లీజ్ మేడం"

"మళ్లీ మీరెప్పుడొచ్చి తీసుకుంటారు?" అతని పునర్దర్శనం ఈ రోజే మళ్లీ మళ్లీ జర గబోతున్నందుకు లోనుంచి తన్నుకొస్తూన్న ఆనందాన్ని కంట్రోల్ చేసుకుంటూ, అమా యకంగా ప్రశ్నించింది.

"వస్తాను మేడం. రాక ఎక్కడికిపోతాను మేడం? వదలగలనా మేడం? వదిలి ఉండగలనా మేడం?"

"అబ్బా, ఎప్పుడొస్తారో చెప్పండి..." నవ్వొ స్తోంది.

"వస్తాను మేడమ్... ఇహనో, ఎప్పుడో... గంటకో.. రెండు గంటలకో, ఇవాళో... రేపో..."

"ఈవాళో, రేపో, సంవత్సరానికోనా? డబ్బు అవసరం ఏమీ లేనట్లుందే మీకు? అటువంటప్పుడు విత్‌డ్రాయల్ ఎందుకిచ్చా రు పెద్ద అర్జంటు అయిన వాళ్లల్లా...?" నీ ఇష్టమొచ్చినంత ఆలస్యం చేస్తే నాకు భరిం చడం కష్టం అని ధ్వనిస్తోంది, కసురుతున్న ట్లుగా వినిపిస్తున్న ఆమె మాటల్లో.

"అర్జంటు అననుగానీ... అవసరం మాత్రం వుంది మేడం. క్లాసుల మధ్య ఖాళీ దొరికితే వచ్చి తీసేసుకుంటాను. లేకపోతే మాత్రం సాయంత్రంగాని, అదీ కుదరకపోతే రేపు పొద్దున్నగాని, రేపు సాయంత్రం గాని..."

"రేపో, ఎల్లుండో వస్తే... డబ్బు ఇవ్వను. నేనే తీసేసుకుంటా"

"ఆ హక్కు మీకుంది మేడం!"

"ఆc...య్" కోపంగా పెదవిని కొరు క్కుంటూ చూసింది.

"అదే... ఆ ఛాన్సు మీకుంది అంటున్నా. నిజంగా మేడం"

"ఈ రోజు సాయంత్రం దాటేకపోతే రేపు సాయంత్రమైనా, మీ ఇంటికొచ్చైనా, మీతో కుదరకపోతే మీ నాన్నగారితో మాట్లాడైనా, నా 'సొమ్ము' నాకప్పగించ మంటాను మేడం"

కుసుమాంజలి గుండె ఝల్లుమంది.

"ఈవాళ సాయంత్రం మా డాడీ ఊళ్లో ఉండరు"

"అయితే రేపు సాయంత్రం వస్తాను మేడం"

నును సిగ్గుతో తలొంచుకుంది ఆమె.

"ఏంచేస్తాం. మన సొమ్ముని వదులు కోలేం కదా మేడం... వస్తాను మేడం. కాలేజీ టైము అవుతోంది" మధ్య మధ్య



వెనక చూపుల్తో వెళ్తోన్న భాస్కర్‌ని అలాగే చూడసా గింది కుసుమాంజలి.

* * *

మురళి శ్రద్ధగా పెన్సిల్‌తో డ్రాయింగ్ గీసి తీసుకొచ్చిన 'శారద' చిత్రపటాన్ని చూస్తుంటే ఆనందంతో కళ్లల్లో నీళ్లు తిరిగాయి భాస్క ర్‌కి. ఎదురుగా శారదని చూస్తున్నట్లే ఉంది. బహుశా ఆమెనీ, పక్కనే ఈ పటాన్ని పెడ్తే ఎక్కడో కొద్దిపాటి తేడా కనిపించొచ్చేమో. కాని కొన్ని సంవత్సరాల క్రితం చూసిన ఆమె మూర్తికి ఈ బొమ్మ నూటికి నూరు పాళ్లు సరిపోతున్నట్లుగా అనిపిస్తోంది. ఆమె ముఖంలో ఏయే భావాలు కనిపించాయో ఈ బొమ్మలోనూ అచ్చం అవే కనిపిస్తు న్నాయి. బొమ్మలో ఆమె అసలు వ్యక్తిత్వంలోని గొప్పదనం ప్రకటితం అవు తోంది. బొమ్మగీసి, పటాన్ని కట్టించి మరీ తెచ్చాడు మురళి.

పటాన్ని టేబిల్‌మీద గోడకి ఆన్చి, నిల బెట్టి, మురళిని కౌగిలించుకున్నాడు భాస్కర్ ఆనందం పట్టలేక.

తన ప్రయత్నం ఫలించినందుకు, తనకిష్ట మైన సార్ అభినందనలు పొందినందుకు, తనలోని అసలైన కళాకారుడు ఇప్పుడు బయటపడే అవకాశం వచ్చినందుకు చాలా ఆనందించాడు మురళి.

"మురళీ... యూ ఆర్ గ్రేట్. అచ్చు గుద్దినట్లు, కేవలం ఓ వ్యక్తి రూపురేఖలని గురించి, వ్యక్తిత్వం గురించి విని, ఇంత గొప్పగా మూర్తిని దించడం... రియల్లీ సూపర్బ్! ఫెంటాస్టిక్! వెరీ బ్రైట్ ఫ్యూచర్ ఈజ్ అవెయిటింగ్ ఫర్ యూ! గాడ్ బ్లెస్ యూ డియర్!" మురళి జబ్బలు పట్టుకుని కుదిపేస్తూ అభినందించాడు భాస్కర్.

ఆనందంతో కళ్ల నీళ్లు తిరిగాయి ముర ళికి.

వెంటనే భాస్కర్ అల్మారా తెరచి, కొత్త ప్యాంటు, షర్టు బట్టల్ని తీసి, మురళి చేతుల్లో ఉంచుతూ, "మురళీ... ఇది నీ ప్రతిభకు విలువ కట్టడంకాదు. ఏదో చంద్రు డికో నూలు పోగు. అంతే! జాతీయ స్థాయి కీ, అంతర్జాతీయ స్థాయికి కూడా నువ్వు ఎదగాలి. నీ ఎదుగుదలకి ఉడతా భక్తిగా నేనూ సాయపడితే అంతే చాలు" అన్నాడు.

చేతిలో బట్టలతో బాటు భాస్కర్ కాళ్ల మీద వాలిపోయాడు మురళి. గొంతు పూడుకుపోయింది. మాటలు వెలువడడం లేదు. పెదవులు అదురుతున్నాయి. రెండు కన్నీటి బొట్లు గురుదక్షిణగా, కృతజ్ఞతా పూర్వకంగా భాస్కర్ పాదాల మీదకు జారాయి.

## 12



సూర్యుడు ఉదయిస్తున్న వేళ...

పతంజలి హాస్పిటల్ నుంచి డిశ్చార్జి అయ్యాడు.

భాస్కర్, యేసేబు, నేతాజీ, రామిరెడ్డి, కళ్యాణి, బ్రహ్మయ్య శాస్త్రి, గాయత్రిల ఆనం దానికి అవధులులేవు.

చాలా ఆరోగ్యంగా కనిపిస్తున్నాడు పతం జలి.

ఫ్రెష్‌గా, కడిగిన ముత్యంలా, సానపెట్టిన వజ్రంలా మెరిసిపోతున్నాడు. డాక్టర్ల వైద్యం, తల్లిదండ్రుల ప్రేమ, భాస్కర్ ఆత్మీయత, కొత్త స్నేహితుల సాంగత్యం అతణ్ణి జరిగిన సంఘటనలని పూర్తిగా మరచిపోయేలా చేశా యి. విచారం చుట్టుపక్కల కనిపించట్లేదు.





"బాబుకి హాస్టల్లో కాకుండా, బయట పెద్ద మనుషుల ఎవరింట్లోనయినా ఒక రూము తీసుకుందామనుకుంటున్నాం" అన్నాడు బ్రహ్మయ్యశాస్త్రి.

"వద్దండీ... హాస్టల్లోనే ఉండనీయండి" అన్నాడు భాస్కర్.

"అది కాదు నాయనా! మళ్లీ ఆ గొడవలూ అవీ వాడు పడలేడు. ఎవరింట్లోనైనా రూము అయితే రక్షణ వుంటుంది. వాడు కొంచెం అర్భకుడు కదా!" నెమ్మదిగా, తన అభిప్రాయాన్ని చెప్పాడు శాస్త్రి.

"తండ్రిగా మీరు భయపడుతున్నారు గాని, ఎవరు చెప్పారండీ పతంజలి అర్భకుడని? " పతంజలి జబ్బలమీద చరుస్తూ, తల నిలువుగా ఊపుతూ ప్రశ్నించాడు భాస్కర్.

"పులి" అన్నాడు నేతాజీ, పతంజలి వీపు తట్టుతూ.

"అవును... పులే" అన్నారు యేసేబు, కళ్యాణి ఒక్కసారే.

"ఇకనుంచీ మా కాలేజి హీరో" అన్నాడు రామిరెడ్డి.

వాళ్లని నవ్వుతూ చూస్తున్నాడు భాస్కర్.

గాయత్రి అంది, "పులి, సింహం కానక్కర్లేదు నాయనా! మా బిడ్డ మనిషిగా ఆనందంగా, ఎవరికీ అపకారం చెయ్యకుండా, ఎవరూ వాడికి అపకారం చెయ్యకుండా బతికితే అదే పదివేలు!అందుకనే హాస్టల్లో వాళ్లు వాడి జోలికి రాకుండా ఎవరింట్లోనైనా..."

"ఏం ఫరవాలేదమ్మా... ఇప్పుడు హాస్టల్ నుంచి బయటకొచ్చేస్తే మరీ లోకువ కట్టారు" అంటూ యింకా భాస్కర్ ఏదో చెప్పబోతుండగానే, పతంజలి అందుకుని "నేను హాస్టల్ లోనే ఉంటాను" అని అన్నాడు నిబ్బరంగా, నిశ్చయంగా.

"కాదు నాన్నా... మళ్లీ గొడవలు..." అంటూ గాయత్రి కొడుకు మొహంలోకి చూస్తూ, భయాన్ని వ్యక్తం చేయబోతే, "ఏం జరగదమ్మా. అప్పుడు నేను ఒంటరిగాడిని. ఇప్పుడు ఇంతమంది శ్రేయోభిలాషులున్నారు. ఏమీ కాదు. మీరు నిశ్చింతగా వుండండి. ఇంక ఇలాంటి సమస్యలేవీ ఈ పతంజలి జీవితంలో ఉండవు" అంటూ యేసేబు, రామిరెడ్డి భుజాల మీద చేతులు వేసి, ధైర్యంగా చెబుతున్న కొడుకునీ, 'అవునన్నట్లు'గా ధైర్యం కలిగిస్తూ తమవైపు చూస్తున్న భాస్కర్నీ, అతని శిష్యబృందాన్నీ చూస్తుంటే శాస్త్రి దంపతులకి ధైర్యం వచ్చింది... నమ్మకమూ కలిగింది.

కొడుకుకి జాగర్తలూ, భాస్కర్కీ, మిగిలిన కుర్రవాళ్లకీ కృతజ్ఞతలూ చెప్పి, అందర్నీ ఆశీర్వదించి, తమ ఊరికి ప్రయాణమయ్యారు దంపతులిద్దరూ.

భాస్కర్తో, మిగిలిన స్నేహితులతో, టాక్సీలో ఏదో తెలీని విజయోత్సాహంతో వచ్చి తిరిగి హాస్టల్లో ప్రవేశించాడు పతంజలి. హాస్టల్లో కొందరు స్టూడెంట్ల నుంచి మంచి ఆహ్వానం లభించింది పతంజలికి.

* * *

"నిన్న పొద్దున్ననగా విత్డ్రాయల్, టోకెన్ నాకే ఇచ్చిపోయాడు. ఇప్పటివరకూ మొహం చూపించలేదు. డబ్బు నా దగ్గర భద్రపరచాలిట! ఆయనగారికి తీరికయినప్పుడొచ్చి, డాడీతో 'తన సొమ్ము'ని తనకి అప్పగించమని అడిగి తీసుకెళ్తాట్ట! తన సొమ్ము...ఏమిటో అధికారం...నీ సొమ్మేం ఇక్కడ లేదు పొమ్మంటే... దబాయించి పంపించేస్తే... ఏం చేస్తాడో! అబ్బా, ఏం ధీమా? పోనీ, ఆ అడగడానికయినా రావాలి కదా? రాడేం మానవుడూ? సొమ్మెక్కడికి పోతుందన్న ధీమా? "

తన ఇంటి వరండాలో పచార్లు చేస్తోంది కుసుమాంజలి అసహనంగా, గేటువైపే చూస్తూ.

ఇరవై గంటలయిపోయింది అతణ్ణి చూసి. పొద్దున డాబా మీద దర్శనం ఇవ్వ





లేదు. పోనీ బ్యాంకు కొస్తాడ నుకుంటే రాలేదు. చులకనా, లోకువా, మతిమరుపా... ఏమిటిది? !

ఏదైనా ముఖ్యమైన పన్లో ఉన్నాడేమో?

తనని చూడడంకంటే... తనని కలవడంకంటే... తనని పొందడంకంటే... 'ముఖ్యమైన' పనులుంటాయా? టర్... వీల్లేదు! అంతే!

కొంపదీసి ఆరోగ్యం బాగులేదా?

'రూముకెళ్లి చూసొస్తే...? లోకువయి పోతానేమో? పాపం, అతనికి ఆరోగ్యం బాగులేకపోతే చూడ్డానికి వెళ్తే లోకువ ఎలా అవుతుంది? ఒకవేళ, అతని ఆరోగ్యం బాగానే వుండి, అశ్రద్ధతో అతను రాక పోతే... అలాంటి పరిస్థితుల్లో తను అతని రూముకి వెళ్తే? !... హమ్మో వద్దు! మరెలా? ... అసలు ఈ మగాళ్లూ...' పళ్లు కొరుక్కుంది కుసుమాంజలి.

మళ్లీ పచార్లు.

"నాన్నా... ఈవాళ మీరు క్లబ్బుకి వెళ్లొద్దు. మీరివాళ నా కోసం యింట్లోనే ఉంటే బాగుంటుంది అనిపిస్తోంది నాకు"అంటూ, అసలు కారణం చెప్పకుండా, తండ్రిని కూడా కదలకుండా ఇంట్లోనే కూర్చోబెట్టింది. ఈ మానవుడు ఊడిపడ్డేం? ...

అసహనం పెరిగిపోతోంది కుసుమాంజలిలో.

అదుగో... అప్పుడు దూరంగా తన దివ్యమంగళ విగ్రహాన్ని దర్శనమిచ్చాడు భాస్కర్, స్కూటర్ ఇంటి ముందుకు తెచ్చి పార్క్ చేస్తూ.

ఒక్కసారిగా ఆనందం ఉబికివచ్చింది కుసుమాంజలిలో. అంతలోనే ఉడుకుమోతుతనం దాన్ని డామినేట్ చేసేసింది. కుతకుతలాడిపోతూ చూసింది గేట్ అవతల ఉన్న అతనివైపు. వరండాలోంచి తనని చూస్తోన్న ఆమె వైపు 'హల్లో' అన్నట్లుగా చూపులు విసిరాడు భాస్కర్, కొద్దిగా చెయ్యి ఊపుతూ.

రెసిప్రొకేట్ చెయ్యలేదు కుసుమాంజలి. పరుగెత్తికెళ్లి గేటు తీసి, "రండ్రండి" అనలేదు. సరికదా... సర్రున ముఖం తిప్పేసుకుని, లోపలికి వెళ్లిపోయింది విస విస.

కంగుతిన్నాడు భాస్కర్!

'హీరోయిన్' అలిగిందని గ్రహించాడు. 'చచ్చేంరా దేవుడా... ఏందారి? ! ఊఁ... తప్పదు! వసుదేవుడంతటివాడు...'అంటూ అనుకోబోయి, 'చఛ... దిక్కుమాలిన ఉపమానం' అని తననే తిట్టుకుని గేటుపక్క బోర్డువైపుకు చూశాడు.

ఇంగ్లిష్‌లో 'D. Ramakumar, Retd. ACP' అని ఉంది. స్పీడుగా చదవడంలో D పక్కన చుక్క కనిపించక 'డ్రామాకుమార్' అని పేరు చదివిన భాస్కర్ ఉలిక్కిపడి మళ్లీ చూశాడు. ఇంగ్లిష్ అక్షరాల కిందవున్న తెలుగు అక్షరాల మీద పడింది ఈసారి చూపు. 'డి.రామకుమార్, రిటైర్డ్ ఎ.సి.పి.'

'అమ్మో... పోలీసాయన!' సింహానికి అడవిలో ఉన్నా, బోనులో ఉన్నా పొగరు, పవరు ఒక్కలాగే ఉంటుంది. ఈవిడగారేమో అలిగి, లోపలికి తుర్రుమంది. నిన్న, ఈవాళ ఇంతవరకు తను మళ్ళీ దర్శనం ఇవ్వలేకపోవడానికి కారణాలు ఆమెకు తెలియదు. ఏందారి? పోనీ, తిరిగి వెళ్లిపోదామంటే... సత్యభామని చెలికత్తెగా నియమించుకునేంత ఆత్మాభిమానంతో, ఆభిజాత్యంతో కనిపిస్తోందీ సుదతి! ఈ తండ్రి 'పాత్రధారన్నా' నిజంగా డ్రామాకుమార్ కాకూడదూ, ఏదో పొగడొచ్చు! రిటైర్డ్ అసిస్టెంట్ కమిషనర్ ఆఫ్ పోలీస్! చివరి మూడక్షరాలు చాలు ఎవర్నన్నా భయపెట్టడానికి. ఏం చెయ్యాలిప్పుడు? ! కానియ్, రోట్లో తల దూర్చి చెట్నీ కాబోతు

న్నందుకు భయపడ్డం ఎందుకు?

యాంత్రికంగా గేటు తీసుకుని లవ్‌లెటర్ రాస్తే ప్రిన్సిపాల్ చేత పిలుపందుకున్న స్టూడెంటులా, అడుగులో అడుగు వేసుకుంటూ వరండాలో పాదం మోపాడు భాస్కర్.

గేటు చప్పుడు విన్నా తనని క్షమించి, బయటకు రావొచ్చుగా రాణీగారు! ఊc... రాలేదు!

కాలింగ్‌బెల్ నొక్కడానికి ఒణుకుతున్న బొటన వేలిని 'స్టడీ' అంటూ కంట్రోల్ చేస్తూ, బటన్‌మీద ఉంచబోతోన్న వాడల్లా తన దృష్టి ఆ పక్కనే ఉన్న టీపాయ్ మీదున్న లెటర్‌హెడ్ మీద, ఆ లెటర్‌హెడ్ మీదున్న 'రంగస్థలి, నాటక సమాజం, గౌరవ అధ్యక్షులు శ్రీ డి.రామకుమార్, రిటైర్డ్ ఎ.సి.పి.' అన్న అక్షరాల మీద పడడంతో పులయిపోయాడు భాస్కర్.

చిటికెన వేలితో కేర్‌లెస్‌గా నొక్కిపారేశాడు కాలింగ్‌బెల్‌ని.

గుండ్రంగా, నిలబెట్టిన పరుపుచుట్టలా వున్న ఓ బుర్ర మీసాలాయన బయటకొస్తూ, గుబురు కనుబొమల్ని ముడిచి, 'ఏం కావాలీ' అన్నట్టుగా చూశాడు.

భాస్కర్ కొంచెం భయపడబోయాడుగానీ అంతలోనే 'మీకంత సీను లేదులే... నన్నేం భయపెట్టలేరు' అన్నట్టుగా చూస్తూ, సంప్రదాయం ప్రకారం ఓ నమస్కార బాణం సంధించి, "నమస్కారమండీ... నా పేరు భాస్కర్, కాలేజీ లెక్చరర్ని" అన్నాడు.

"రండి...లోపలికి రండి"అంటూ లోపలికి దారితీశాడాయన.

ధైర్యంగా, చొరవగా, గడపదాటి, లోపలికి కాలు పెట్టాడు భాస్కర్.

తను సోఫాలో కూర్చుని కుర్చీ చూపించాడు భాస్కర్‌కి పెద్దాయన.

ఉపోద్ఘాతం ఇవ్వాలా... సబ్జక్టులోకి డైరెక్టుగా దిగాలా... డొంకతిరుగుడు పద్ధతే శ్రేయస్కరమా... మనిషిని ముందు పడేసుకోడానికి బుట్ట సిద్ధం చేసుకోవాలా... అనే విచికిత్సలో గొంతు విప్పడానికి కొంత సమయం తీసుకుంటున్నాడు భాస్కర్.

కాలేజీ లెక్చరర్ అంటున్నాడూ, పైగా యువకుడూ, స్టూడెంట్లతో ఏమన్నా గొడవ పడ్డాడేమో, తను రిటైరై పని లేకుండా కూర్చున్న పోలీసు ఆఫీసరు కాబట్టి, పెద్దవాడైపోయిన కారణంగా జాలిగుండె ఉండకపోతుందా అని సాయం ఆశించి వచ్చాడా ఇతగాడూ అన్నట్లుగా భాస్కర్‌నే చూస్తూ, "చెప్పండి" అన్నాడు ఆయన.

ఇంక తాత్సారం చెయ్యదలచుకోలేదు భాస్కర్.

ఉపోద్ఘాతం
ఇవ్వాలా...
సబ్జక్టులోకి డైరెక్టుగా
దిగాలా...
డొంకతిరుగుడు
పద్ధతే శ్రేయస్కరమా...
మనిషిని ముందు
పడేసుకోడానికి
బుట్ట సిద్ధం
చేసుకోవాలా ...
అనే విచికిత్సలో
గొంతు విప్పడానికి
కొంత సమయం
తీసుకుంటున్నాడు
భాస్కర్





"ఏంలేదు సార్... మా కాలేజి స్టూడెంట్స్ యూనియన్ ఇనాగ్యురల్ ఫంక్షన్‌కి మిమ్మల్ని స్పెషల్ గెస్ట్‌గా ఇన్వైట్ చేయడానికి మా ప్రిన్సిపాల్ గారు పంపిస్తే వచ్చాను" అని అబద్ధం ఆడేశాడు భాస్కర్.

"ఈ స్టూడెంట్సు, ఈ యూనియన్సు ఇవన్నీ నాకు పెద్ద గిట్టవండీ. మీ ఇన్విటేషన్‌కి థ్యాంక్సు. వేరే ఎవర్నయినా..." అని ఆయన ఆదిలోనే హంసపాదం పెట్టబోతే, "అంటే, మంచి డ్రామా కూడా వేయిస్తున్నామండీ" అని రెండో అస్త్రం వదిలాడు భాస్కర్.

డ్రామాకుమార్ కళ్లు విచ్చుకున్నాయి. పెదవులమీద నవ్వు పూసింది. "డ్రామా కూడా వుందా? అయితే తప్పక వస్తాను. మీరు పిలవకపోయినా వస్తాను. మీరు వేయిస్తున్నారా? వెరీగుడ్. మీకు డ్రామాస్ మీద ఇంట్రస్టుందాండీ. నాకు డ్రామాస్ అంటే ప్రాణం. ప్రతిక్షణం డ్రామాస్ గురించే ఆలోచిస్తుంటాను నేను" ఉత్సాహం చూపించాడు ఆయన.

దొరికాడు ముసలాయన.

తీరుబడిగా, దర్జాగా, కాలుమీద కాలేసుకుని, తన వాక్చాతుర్యం అంతా ఉపయోగించి, తెలుగు నాటకం పుట్టు పూర్వోత్తరాలు, పౌరాణిక, చారిత్రాత్మక, సాంఘిక నాటక రచనలు, ప్రయోగాలు అంటూ అనర్గళంగా ఉపన్యాసం దంచేస్తూ, వేమూరి గగ్గయ్య, అద్దంకి, యడవల్లి, బళ్లారి, కె. వెంకటేశ్వరరావు, గరికపాటి రాజారావుల నుంచి నేటి వైజాగ్ మిశ్రో, రాజమండ్రి ప్రసాదమూర్తి, పెదకాకాని గోపీనాయుడి వరకూ ఉన్న నటుల గురించి కూడా మాట్లాడేస్తుంటే చేష్టలుడిగి చూస్తుండిపోయాడు డ్రామాకుమార్.

ఆఖరి అస్త్రం ఉపయోగించాడు భాస్కర్. "ఈ చరిత్ర అంతా ఒక ఎత్తు, మీరు నాటక కళకి చేస్తున్న సేవ ఒక ఎత్తు అంటూంటారండీ నాటక ప్రియులు" అన్నాడు వినయంగా.

ఇంకేం మిగిలింది, లావుపాటి డ్రామా కుమార్ 'స్టేజంతా పట్టే'లావుకి ఊరిపోయాడు. "భాస్కర్ గారూ... మీతో పరిచయం నా పూర్వజన్మ సుకృతం. మీరు ప్రాణం పోసుకున్న సజీవ నాటక చరిత్రలా కనిపిస్తున్నారు నా కళ్లకి. మీరీపూట మా ఇంట చెయ్యి కడగాలి. మీకు ఆతిథ్యం ఇవ్వడం నా భాగ్యం. కాదనకూడదు మీరు" అంటూనే లోపలి గదుల్లోకి చూస్తూ, "అమ్మాయి కుసుమా... అర్జంటుగా రావాలి" అని పిలిచాడు.

కేవలం తండ్రి పిలుపుకే వస్తున్నదానిలా బయటకు వస్తున్న కుసుమాంజలిని ఇంకొంచెం ఉడికించాలని, ముఖం తిప్పుకున్నాడు భాస్కర్. పెద్దాయన కూతుర్తో "ఈయన భాస్కర్‌గారని, కాలేజీ లెక్చరరు. అంతకుమించి గొప్ప నాటక ప్రియులు..." అంటూ ఏదో చెప్పబోతుంటే కుసుమాంజలి తండ్రి మాటల్ని కట్ చేస్తూ, "తెలుసు. ఆయన గారొచ్చింది వేరే పనిమీదా..." అంటూ సాగదీస్తూ కీచుమని అరచి, చేతుల్లో వెనక దాచుకున్న పదివేల రూపాయల్ని భాస్కర్‌వైపు చాచి, "ఇంద... మీ సొమ్ము" అంది అలకగా మొహం పెట్టి.

భాస్కర్ డబ్బు అందుకుంటూ, వస్తున్న నవ్వుని మునిపంట నొక్కిపట్టాడు.

"మీరొకరికొకరూ ముందే తెలుసున్నవాళ్లా ఏమిటి? సరిపోయింది. నటుడివనిపించుకున్నావయ్యా... కానీండి, నేను రిఫ్రెష్ అయి వస్తాను. చక్కగా కలిసి భోంచేద్దాం. మీరు మాట్లాడుకుంటూ ఉండండి" అంటూ లేచాడు పెద్దాయన.

కుసుమాంజలి గారంగా కయ్‌మంది, "మేం మాట్లాడుకోవడం అయిందీ- ఇంక మీరిద్దరే మాట్లాడుకోవాలీ..." అని అరిచి,



లోపలికి పరుగెత్తింది.

ఆమె అలా అని పరుగెత్తడం, వాళ్లిద్దరికీ ముందే పరిచయం ఉండడం, భాస్కర్ డబ్బు కూతురు దగ్గర ఉండడం, అది తీసు కునే నెపంతో అతనొచ్చి డైరెక్టుగా సబ్జెక్టులోకి దిగకుండా తనని ఉబ్బెయ్యడం, తిక్కపిల్ల, అల్లరి పిల్ల తన కూతురు అలా ప్రవర్తిం చడం, ఆమె వెళ్తూంటే చిన్నపిల్లని బుజ్జగిం చడానికి ముచ్చటపడుతున్నట్లు అతను చూస్తున్న చూపు... 'పోలీసాయన' విష యాన్ని సులభంగానే గ్రహించేశాడు.

మెచ్చుకోలుగా చూస్తూ, "గుడ్ లక్ అండ్ వెల్‌కమ్" అంటూ చెయ్యి చాపాడు పెద్దా యన భాస్కర్‌వైపు.

"థేంక్యూ సర్" అంటూ చేయి కలిపాడు భాస్కర్.

## 13



ఉదయమే బాలభానుడితో పాటు లేచి కాలకృత్యాలు తీర్చుకుని, ఆంజనేయస్వామికి సాష్టాంగ నమస్కారం పెట్టి లేచి బట్టలు మార్చుకుని, టిఫిన్ చెయ్యడానికి డైనింగ్ హాల్లోకి నడిచాడు పతంజలి.

అప్పటికే అక్కడున్న సీనియర్లు అతన్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు. అతన్లో ముసు పటి బిడియం లేదు... భయం లేదు... తొట్రుబాటు లేదు... తడబాటు లేదు... నడకలో ఠీవి వుంది... ధైర్యం వుంది... మగతనం వుంది! రాజసం వుంది!

ర్యాగింగ్ చేయడంలో ఘటికుల గుంపులో ఒకడు మిగతా వాళ్ల వైపు 'ఏంట్రా వీడి ధైర్యం... ఓ పట్టు పడ్దామా?' అన్నట్లుగా కను బొమలు ఎగరేస్తూ చూసి, బల్లమీద చేతు లాన్చి లేవబోయాడు. కాని మరో ఇద్దరు వద్దన్నట్లుగా వారించారు.

చుట్టూ సీనియర్ల వైపు పతంజలి ధైర్యంగా, నిర్లక్ష్యంగా చూస్తూ టిఫిన్ ముగిం చాడు. తిరిగి అదే ఠీవితో బయటకు నడి చాడు. అతని అడుగులు నాగుబాబు రూము వైపుకు పడుతున్నాయి.

ఆ సమయంలో నాగుబాబు తన రూములో బస్కీలు తీస్తున్నాడు. గతరాత్రి హాస్టల్ వార్డెన్ తనని పిలిపించి చెప్పిన మాటలే గుర్తొస్తున్నాయి. బుర్ర వేడెక్కిపో తోంది.

'నాగుబాబూ... మీనాన్నగారి నుంచి ఫోనొచ్చిందయ్యా. నువ్వు, యింకొందరు స్టూడెంట్లు కలిసి పతంజలిని ర్యాగింగ్ చేసిన కారణంగానే అతను మెంటల్ అయి పోయాడని ఎవరో ఆయనకు చెప్పార్ట. అగ్గి రాముడయిపోతున్నాడాయన. ఫోనులోనే నిన్ను నానాతిట్లు తిడుతున్నాడు. ఇంక నీకూ, ఆయనకీ సంబంధం తెగిపోయినట్లే అన్నాడు. కడుపున కన్న ఖర్మానికి నీ చదు వయిపోయేంతవరకు డబ్బులు డ్రాఫ్టు రూపంలో నీ పేరున నాకు పంపిస్తాట్ట. నెలనెలా నా దగ్గర డ్రాఫ్టు తీసుకుని ఖర్చుపె ట్టుకోమని, తన చుట్టుపక్కలకెళ్తే మాత్రం చంపేస్తానని కచ్చితంగా చెప్పమన్నాడు ఆయన"

పతంజలి నాగుబాబు రూముని చేరాడు.

లోపల కోపంతో, ఆయాసంతో బుసలు కొడ్తున్నాడు నాగుబాబు.

తలుపుమీద వేళ్లు టకటకలాడించాడు పతంజలి.

"ఎవరదెహె... నీయమ్మ..." అంటూ విసుక్కుంటూ, విసురుగా తలుపులు తీసిన

నాగుబాబు ఆశ్చర్యానందా లకు గురయ్యాడు. పతంజలి అంత ధైర్యంగా, ఒంటరిగా 'తన' రూముకే వచ్చి, తలుపు కొట్టినం దుకు ఆశ్చర్యం, ఒంటరిగా దొరికినందుకు ఆనందం!



"బాగున్నావా నాగుబాబూ? " అంటూ లోపలకు అడుగుపెట్టాడు పతంజలి చొరవగా.

ఆశ్చర్యపోతూనే వెనకడుగులు వేశాడు నాగుబాబు.

పతంజలి నవ్వుతూ అన్నాడు, "నేనిప్పటికీ నీ జూనియర్నే. చెప్పు నీ ఒంటిమీద చెమటలు తుడవనా? నీ డ్రాయరూ, బనీను బయట ఆరె య్యనా? నీ ఒళ్లు పట్టనా? ... చెప్పు... ఏం చెయ్యమంటావు? "

పతంజలి ధైర్యానికి ముందు తెల్లబో యాడు నాగుబాబు. ఆ తర్వాత తేరుకుని "ఏం... తలతిక్కగా వుందా? " అనడిగాడు. అప్పుడే ఎక్సర్‌సైజ్ చేయడంతో ఉబికిన కండల్ని, మరింత ఉబికించి బెదిరిస్తూ.

పతంజలి నవ్వుతూ 'అలా మాట్లాడొద్దు' అన్నట్లుగా చేత్తో వారించాడు.

"నాగుబాబూ! నువ్వు నా అన్నలాంటివా డివి! నిన్ను గౌరవించాలి నేను. నన్ను ఆద రించి, గైడెన్స్ ఇవ్వాలి నువ్వు కదా? నిజం చెప్పు... నన్నంతగా హింసించి, ఆరోగ్యం పాడుచేసి, హాస్పిటల్ పాలుచేసి, నీ తండ్రి గారికి, నా తల్లిదండ్రులకి అంతలా మన స్తాపం కలగజేశావే నీకిప్పటికయినా బాధగా లేదూ? " సిన్సియర్‌గా అతని కళ్లల్లోకి చూస్తూ ప్రశ్నించాడు పతంజలి.

"ఏటీ? అపాలజీ అడుగుతున్నావా? "

"కాదు! నువ్వు కొద్దిగా పశ్చాత్తాపం పడినా నాకు సంతోషమే"

"నీ సంతోషం ఎవడిక్కావాల్రా ముష్టి నా కొడకా!" కోపంతో అరిచాడు నాగుబాబు.

అంతే! బిగిసిన పతంజలి చేయి అతని ముఖం మీద వాలింది. వెళ్లి గోడని గుద్దు కున్నాడు నాగుబాబు. అదిరిపడి, గుడ్లు మిటకరించి చూశాడు పతంజలి వైపు, మొహం రుద్దుకుంటూ.

"సారీ! నేనూ కోపాన్ని కంట్రోల్ చేసుకో లేకపోయాను. పాపం, నువ్వొక్కడివే ఉన్న ప్పుడు నిన్నేం చేయకూడదనుకున్నాను. పిలు... ఆ రోజున ఈ రూములో నన్ను హింసించిన మిగిలిన నీ ముఠాని పిలు. రామిరెడ్డి మారిపోయాడు. నువ్వు పిలిస్తే, నిన్ను చంపి తను జైలుకి పోతాడు. మిగి లిన గ్యాంగుని పిలు. నేనిక్కడే వుంటా. ఒంటరిగానే వుంటా. మళ్లీ ర్యాగింగ్ కాని వ్వండి... కమాన్ పిలు! దమ్ముంటే పిలు



వమ్మా..." ముందుకు వస్తూ, ఛాలెంజ్ చేశాడు పతంజలి.

ఒక్క నిముషం చేష్టలుడిగి, నిలబడిపోయిన నాగుబాబు తేరుకుని, "రే...య్! నిన్ను కొట్టడానికి నేను చాలన్రా" అంటూ పిచ్చికేక పెడ్తూ, వెయిట్ లిఫ్టింగ్ ఐరన్ రాడ్‌ని చేతిలోకి తీసుకుని ఎత్తి పతంజలి తలని గురిచేసి, విసురుగా ఊపాడు. పతంజలి దాన్ని ఒడుపుగా అందుకుని, కుడిచేతిని వాడి మెడచుట్టూ తిప్పి భల్లూకపు పట్టుపట్టి ఎడంచేత్తో వాడి మణికట్టు నరం నొక్కి రాడ్‌ని పడవేయించాడు. రూము బయటకు తెచ్చి వరండాలో, ఆవేశంతో పౌరుషంతో ఊగిపోతూన్న పరుశురాముడిలా, పెద్ద పెద్ద అంగలు వేస్తూ, కళ్లల్లో నిప్పులు కక్కుతూ, చచ్చిన కొండచిలువలాంటి నాగుబాబుని ఈడ్చుకొస్తూన్న పతంజలిని ఆశ్చర్యంగా, ఆనందంగా, ఆరాధనగా చూస్తున్నారు అంతా. కొందరు ఆపుకోలేని ఆనందంతో విజిల్స్ వేస్తూ డాన్సు చేశారు కూడా.

* * *

ప్రిన్సిపాల్ గారి రూములో...

పోలీసు డిపార్ట్‌మెంట్ ద్వారా తనకి వచ్చిన ఉత్తరాన్ని చదువుకుంటున్నాడు భాస్కర్. పోలీసు కస్టడీ నుంచి తనని అడ్రస్ చేస్తూ, సుకుమార్‌బాబు రాసిన ఉత్తరం. అది.

"శ్రీ భాస్కర్ గారూ...

పిల్లలకి మంచి బోధించవలసిన లెక్చరర్నైవుండి నీచపు భావాలతో నిండిపోయి వున్న నాలాంటి దుర్మార్గుడికి, ప్రియమైన వాళ్లక్కూడా ఆ లక్షణాలు, భావాలు ఆపా

దించబడతాయేమోనన్న భయంతో, మిమ్మల్ని 'డియర్' అని సంబోధించడంలేదు నేను.

నేను చాలా పాపాలు చేశాను. అందులో ముఖ్యమైనది, నన్ను కాపాడుకోవడానికి మీ వంటి ఉత్తముణ్ణి కేసులో ఇరికించడానికి చేసిన దుర్మార్గ ప్రయత్నం! మిగిలిన పాపాలకి నాకు న్యాయస్థానం శిక్ష వేస్తుంది. నా ఈ పాపానికి మాత్రం భగవంతుడు భయంకరమైన శిక్ష వేస్తాడు. నాకు తెలుసు. దయచేసి, నన్ను క్షమించొద్దు మీరు. అనుభవించాల్సిన శిక్ష అనుభవిస్తేనే వచ్చే జన్మలోనన్నా సమాజానికి కొంచమయినా ఉపయోగపడే వ్యక్తిగా పుడతానేమో! లావణ్యా తల్లిదండ్రులని, 'క్షమించొద్దు నన్నూ' అని అడిగే అర్హత కూడా నాకు లేదు!

ఇట్లు

దుర్మార్గుడు, నీచుడు, పాపి, 'సు'కాదు... దుర్‌కుమార్‌బాబు'.

ఉత్తరం చదివి బరువెక్కిన హృదయంతో ఒక్కసారి కళ్లు మూసుకుని, రెండు నిముషాలు అలాగే ఉండిపోయి, నెమ్మదిగా కళ్లు తెరచి, ప్రిన్సిపాల్‌తో "ఒక్కసారి సుకుమార్ బాబుని, లావణ్యా తల్లిదండ్రుల్ని చూడాలని పిస్తోంది సార్" అన్నాడు భాస్కర్.

"ఎగ్జాక్ట్‌గా నాకూ అలాగే అనిపిస్తోంది. పోలీస్ పర్మిషన్ కూడా తీసుకున్నాను. పదండి వెళ్దాం" లేస్తూ అన్నాడు ప్రిన్సిపాల్.

భాస్కర్ కూడా లేచాడు.

ప్రిన్సిపాల్ స్వగతంగా అంటున్నట్లు అంటున్నాడు, "మనిషి జన్మ ఎంత విచిత్రమో కదా! ఈ భూమ్మీదకు అందరం సమంగానే వస్తాం. కాలం గడుస్తూ, జ్ఞానం పెరుగుతూంటేనే ప్రవర్తనలలో తేడా! కొందరు మంచిగా, కొందరు చెడుగా, కొందరు సంతోషంతో, కొందరు దుఃఖంతో... ఏవిటో ఈ వింత ప్రపంచం? "

బరువు గుండెల్తో బయలుదేరారిద్దరూ.

కటకటాల వెనక సుకుమార్‌బాబుని చూస్తుంటే, ఎంతో వృద్ధిలోకి రావలసిన ఓ చక్కటి విద్యార్థినిని దుర్మార్గంగా పొట్టన పెట్టుకున్నాడన్న కోపం, సరైన ప్రవర్తనతో జీవించివుంటే భార్యాబిడ్డలతోబాటు భగవంతుడిచ్చిన జీవితాన్ని సుఖంగా జీవించి ఉండేవాడు కదా అన్న జాలి కలిగాయి భాస్కర్‌లో.

ప్రిన్సిపాల్, భాస్కర్‌ల కళ్లల్లోకి చూడలేక అపరాధ భావంతో తల దించుకున్నాడు సుకుమార్‌బాబు. నేరాన్ని నూటికి నూరుపాళ్లూ ఒప్పుకుని, భార్యతోసహా ఎవ్వరూ తన తరఫున తనని కాపాడ్డానికి ప్రయత్నించకూడదని కండిషన్ కూడా పెట్టాడు కాబట్టి, అతనికి మరణశిక్ష తప్పదని అతనికి, ప్రిన్సిపాల్‌కీ, భాస్కర్‌కీ కూడా తెలుసు.

ఏం మాట్లాడాలో తెలియక సుకుమార్‌బాబువైపే చూస్తున్నాడు ప్రిన్సిపాల్. భాస్కర్ మౌనంగా, భారంగా నిట్టూర్పు విడిచి ఊచల్ని పట్టుకున్న సుకుమార్‌బాబు చేతులమీద తన చేతులుంచి, "విధి రాత తప్పించుకోలేం" అని గొణిగాడు, అప్పుడు అక్కడ అవసరమయిన ఓదార్పు స్వరంతో.

సుకుమార్‌బాబు చెంపలమీదనుండి కన్నీరు జారింది.

"సరైన సమాజ నిర్మాణానికి మీలాంటి లెక్చరర్లు ఉండాలి భాస్కర్‌గారూ! నాలాంటి దుర్మార్గులు కాదు" అంటూ బర్స్ట్ అయి, కొద్దిసేపటికి తేరుకుని, ప్రిన్సిపాల్‌తో, "సర్! నా భార్యకు కూడా చెప్పాను, ఆమె కూడా అంగీకరించింది, లావణ్య పేరుమీద ఓ స్కాలర్‌షిప్ ఏర్పాటు చేయించండి. లక్ష రూపాయలు దాని నిమిత్తం బ్యాంకులో జమచేయమని మా ఆవిడకి చెప్పాను. ప్లీజ్ సర్... నాకు మరణశిక్ష ఎలాగూ తప్పదు. నేను కోరుకునేదీ అదే. ఈ సమాజంలో నాకు బతికే అర్హత లేదు. నా చివరి కోరికని తీర్చడా

నికి మీరిద్దరూ పూనుకోండి. కనీసం కొద్దిగానైనా పాపాన్ని కడిగేసుకునే అవకాశాన్ని బతికుండగానే నాకు కల్పించండి" అంటూండగా అతని గొంతు పూడుకుపోయింది.

'అలాగే' అన్నట్లుగా ప్రిన్సిపాల్ కూడా సుకుమార్‌బాబు చేతిమీద, అతను తీసుకున్న నిర్ణయాన్ని, పశ్చాత్తాపాన్ని, శిక్షని ఆహ్వానిస్తున్న అతని తీరుని అభినందిస్తూ తట్టారు. అతను తిరిగి సెల్‌లోకి వెళ్లిపోయాడు.

ప్రిన్సిపాల్, భాస్కర్ బయలుదేరారు లావణ్య ఇంటివైపు.

లావణ్య ఇంటికి రావడం ప్రిన్సిపాల్‌గారికి ఇది మొదటి సారి. భాస్కర్, కొందరు స్టూడెంట్స్ లావణ్య చనిపోయాక వీలు వెంబడి వచ్చిపోతూనే ఉన్నారు.

లావణ్య తల్లిదండ్రులు యంత్రాల్లా తమ పనులు తాము చేసుకుంటున్నారు. ప్రిన్సిపాల్‌ని, భాస్కర్‌ని ఇంట్లోకి రమ్మ నడం కూడా యాంత్రికంగానే సాగింది.

కొంతసేపు ఓదార్పు మాటలు మాట్లాడాక, సుకుమార్ మరణాన్ని శిక్షగా ఆహ్వానిస్తూ తీసుకున్న నిర్ణయం గురించీ, లావణ్య పేరున, స్కాలర్‌షిప్ ఏర్పాటు చేయమని, ఖర్చు తను భరిస్తానని చేసిన రిక్వెస్టింగ్ ప్రపోజల్ గురించి నెమ్మ దిగా మెత్తని మాటల్లో ప్రిన్సిపాల్ చెప్పాక వాళ్లిద్దరి ముఖాలు కొద్దికొద్దిగా తేరుకుంటున్నట్లు గమనించి భాస్కర్ గుండె తేలికయింది.

* * *

ఎలక్షన్ రోజు వచ్చింది.

ప్రిన్సిపాల్, అందరు లెక్చరర్లు ముందురోజు మీటింగులో నిర్ణయించుకున్న ప్రకారం కాలేజీ ఆవరణలో నిలబడి, ఎక్కడా ఏ గొడవా జరగకుండా జాగ్రత్తగా నిర్వహిస్తున్నారు.

భాస్కర్ సరేసరి.

సుడిగాలిలా కాలేజీ అంతా తిరుగుతూ, ఏ మాత్రం గొడవ జరిగే ప్రమాదం కనిపించినా మంచి మాటలతో, హెచ్చరిక లతో, స్టూడెంట్లు గుంపులుగా చేరి వాతావరణాన్ని వేడెక్కిం చకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నాడు. పతంజలి చేతుల్లో గానుగ మరలో చితికిపోయిన చెరుకుగడలా, పిప్పిగా మిగి లిన నాగుబాబు ఈ కాలేజీ చుట్టుపక్కలకు రాలేదు. తమంత తాముగా ఏ దౌర్జన్యానికీ దిగమని భాస్కర్‌కి మాటిచ్చిన నరసింహులు తరపు కుర్రాళ్లు ఎలక్షన్ శాంతంగా, సజావుగా జరగడానికి తోడ్పడ్డారు.

ఫలితాలు వచ్చాయి సాయంత్రానికి.

నరసింహులు ప్యానెల్ పూర్తి మెజారిటీతో గెలిచింది.

**సుడిగాలిలా కాలేజీ అంతా తిరుగుతూ, ఏ మాత్రం గొడవ జరిగే ప్రమాదం కనిపించినా మంచి మాటలతో, హెచ్చరికలతో, స్టూడెంట్లు గుంపులుగా చేరి వాతావరణాన్ని వేడెక్కించకుండా జాగ్రత్తలు తీసుకుంటున్నాడు**





ముందు భాస్కర్ సార్ అభినందనలు, ఆశీర్వాదాలు అందుకోవాలని ఉత్సాహంగా అతని కోసం వెదకి, వెదకి చివరకి ఆయన్ని కాలేజీ బయట కాకా హోటల్లో లొకేట్ చేసిన నరసింహులు, మిత్రులు ఆశ్చర్యపోయారు! చక్రపాణి ప్యానెల్ మెంబర్స్‌తో జోకులేస్తూ, నవ్విస్తున్నాడాయన.

అప్పటివరకు వాళ్లకు ఏం బోధించాడో మరి! నరసింహులుని అతని మిత్రుల్ని చూస్తూనే, "కంగ్రాట్స్" అంటూ చక్రపాణి బృందం వచ్చి కౌగిలించుకున్నారు.

అందరి కళ్లలో ఆనందంతో నీళ్లు తిరిగాయి.

* * *

భాస్కర్, కుసుమాంజలుల పెళ్ళి ముహూర్తం నిశ్చయమైపోయింది. ఊరి నుండి తిరిగొచ్చిన కుసుమాంజలి తల్లి కూడా భాస్కర్ చురుకుదనం, సౌమ్యత, మర్యాద లక్షణాలని ఎంతగానో మెచ్చుకుని, పెళ్ళికి పచ్చజెండా ఊపేసింది.

భాస్కర్ తరపున తల్లిదండ్రులుగా వ్యవహరించడానికి ప్రిన్సిపాల్ గారు, భార్య సంతోషంగా ముందుకొచ్చారు.

సంప్రదాయం ప్రకారం సరదాగా జరిగిన తాంబూలాల కార్యక్రమం సమయంలో భాస్కర్ శిష్యబృందం చేసిన అల్లరికి అంతే లేదు. సార్ పెళ్ళికి నేను పెద్దనంటూ, కుర్రాళ్లు పెద్దరికం మీదేసుకుంటూ చేసిన తమాషాలు, "మేము అమ్మాయి తరపు వాళ్లం" అంటూ కళ్యాణి, కాత్యాయని అలవాటులేని పట్టుచీరలు కట్టి, గునగున తిరుగుతూ తమాషాగా చేసిన వ్యాఖ్యలు, డ్రామాకుమార్ గొంతెత్తి స్వేచ్ఛగా శ్రీకృష్ణరాయబారంలోని సుయోధనుడి పద్యాలు చదివితే, మాధవాచార్యులుగారు అద్భుతంగా శ్రీకృష్ణుడి పద్యాలు చదివితే, ఎవరూ ఊహించని సీను... ప్రిన్సిపాల్ గారు అర్జునుడి పద్యాలు అందుకుని అభినయం కూడా చేయడం అందర్నీ సమ్మోహితుల్ని చేసింది.

రోజూ స్కూటరుమీద కుసుమాంజలిని బ్యాంకు దగ్గర దింపి, తిరిగి రూముకొచ్చి ఆమె స్వయంగా ఇంటి దగ్గర తయారు చేసి తెచ్చిచ్చిన క్యారేజీలోని రకరకాల వంటకాల్ని కడుపునిండా తిని, కిళ్లీ బిగించి మరీ కులాసా పురుషుడిలా కాలేజీకి వెళ్తున్నాడు భాస్కర్.

కొందరు చలాకీ కుర్రాళ్లు, గోడల చాటు నుంచి "మా భాస్కర్ సార్ పెళ్ళికొడుకాయెనే..." అని ఆటపట్టించే పాటలు పాడుతున్నారు కూడా. ముసిముసిగా నవ్వుకుంటూ వెళ్లిపోతున్నాడు భాస్కర్.

తన పరిణయ కార్యక్రమంలో తనకు తండ్రిగా వ్యవహరించడానికి అంగీకరించిన ప్రిన్సిపాల్ గారి దగ్గరకు పెళ్ళి ఏర్పాట్లకు సంబంధించి ఓ ముఖ్యవిషయం మాట్లాడదామని కులాసాగా ఆయన రూంలో అడుగుపెట్టిన భాస్కర్ తల పట్టుకుని, ఎంతో బాధతో కనిపించిన ఆయన్ని చూసి నిర్ఘాంతపోయాడు. "ఏమిటి సార్... ఏమయిందీ? " అనడిగాడు గాభరాగా.

ఆయన్ని అంత విచారంలో చూడడం ఇదే ప్రథమం.

సాధారణంగా గుండె నిబ్బరం మనిషి. 'విధి చేతుల్లో మనం కీలుబొమ్మలం' అనే వేదాంతాన్ని నమ్మే మనిషి.

అమితమైన విచారంతోనే, 'కూర్చో'మన్నట్లుగా కుర్చీ చూపిస్తూ సంజ్ఞ చేశారాయన. ఒక్కమాటలో చెప్పేటంత విషయం కాని దేదో ఉందని గ్రహించి యాంత్రికంగానే కూర్చున్నాడు భాస్కర్.

తన ఎమోషన్స్‌ని కంట్రోల్ చేసుకోవడానికి ఒక నిముషంపాటు కళ్లు మూసుకుని



గట్టిగా నిశ్వసించి, తక్కువ స్వరంతో చెప్ప డానికి ఇబ్బంది పడుతూ, ఆయన చెప్పిన 'విష'యాన్ని విన్న భాస్కర్ చేష్టలుడిగి దిగ్భ్రమతో అలాగే కూర్చుండిపోయాడు కొంతసేపు. ఆ తర్వాత నెమ్మదిగా లేచి దగ్గ ర్లోని హైస్కూలువైపు బయలుదేరాడు, హెడ్మాస్టరు సీతారామయ్యగారిని కలవడా నికి.

## 14



అది విజయవాడకు దగ్గర్లోనే ఉన్న ఓ పల్లెటూరు.

రాజకీయాలకి అతీతంగా, వీలైనంతవరకు నీతిగానూ, న్యాయంగానూ, కట్టుబాట్లతోనూ, సంప్రదాయ పద్ధతులతోనూ జనం ప్రశాం తంగా, గౌరవంగా కాలం వెళ్లబుచ్చే ఊరు.

ఇంతవరకూ సంచలనం కలిగించే ఏ వార్తతోనూ పేపర్లకి ఎక్కని ఊరది.

ఆ ఊళ్లోకి రాత్రి పదిగంటలవేళ, నిరార్భా టంగా, నిశ్శబ్దంగా ప్రవేశించారు భాస్కర్, అతని శిష్య బృందం యేసేబు, నేతాజీ, మురళి, చక్రపాణి, నరసింహులు, పతంజలి, రామిరెడ్డి, కళ్యాణి, కాత్యాయని. వీళ్లు ఊళ్లో ప్రవేశించేసరికి ఊరు నిద్రపోతోంది. విజయ వాడలో ఉద్యోగం చేస్తూ, స్వంత ఊరయిన ఆ ఊళ్లో మకాం ఉంటున్న హెడ్మాస్టర్ సీతా రామయ్యగారింట్లో విడిది వాళ్లకి. చీకట్లో వీధుల్లో ఒకళ్లిద్దరు ఎదురుపడ్డా, హెడ్మాస్టర్ వాళ్లతో కూడా ఉండడంతో,ఆయన స్కూలు తాలూకు మేష్టారు, స్టూడెంట్లు అయ్యుంటార్లే అని ఏమీ ప్రశ్నించకుండా ఆయనకి నమ స్కరించి వెళ్లిపోయారు వాళ్లు.

ఆ రాత్రికి భోజనాలు తన ఇంట చేయాల్సిందేనని సీతారామ య్యగారు ముందే కండిషన్ పెట్టడంతో ఖాళీ కడుపుల్తో వచ్చిన బృందం అంతా కడుపునిండా కమ్మటి భోజనం చేశారు.

ఇంక కార్యసాధనకి వ్యూహం కోసం వల యాకారంలో కూర్చుని భాస్కర్‌వైపుకు చెవులు రిక్కించుకు చూస్తున్నారు.

ప్రిన్సిపాల్‌గారి సమక్షంలో హెడ్మాస్టరుగా రితో అప్పటికే ఆ ఊరి వీధుల గురించి, మనుషుల అలవాట్లు గురించి, దారుల గురించి, దారుణాలకు గురయ్యే అవకాశం ఉన్న తావుల గురించి చర్చించివుండడంతో భాస్కర్ ప్లాన్‌ని నిర్ణయించుకునేవున్నాడు.

శిష్యుల్ని గ్రూపులుగా విడదీశాడు.

కర్తవ్యం బోధించాడు. దూకుడు లేకుండా, చాలా తెలివిగా జాగ్రత్తగా వ్యవహరించక పోతే వ్యవహారం తమకే ఎదురుతిరిగే ప్రమాదం ఉందని హెచ్చరించాడు.

పొద్దున నాలుగుగంటలకే నిద్రలేచి కార్య రంగంలో దూకవలసివున్న కారణంగా, కబు ర్లతో కాలక్షేపం చెయ్యక నిద్రపొమ్మన్నాడు.

- ఉదయం నాలుగు గంటలవేళ.

హెడ్మాస్టరు అందర్నీ నిద్రలేపారు. నిశ్శ బ్దంగా, లైట్లు కూడా వెలిగించకుండా చిన్న కోడిగుడ్డు దీపం కాంతిలోనే అందరూ సమ రోత్సాహంతో, చప్పుడు కాకుండా, త్వరత్వ రగా కాలకృత్యాలు తీర్చేసుకున్నారు. హెడ్మా స్టరి భార్య కలిపిచ్చిన కమ్మని కాఫీతో అంద రిలో ఉత్సాహం ఉరకలేసింది.

బ్యాచులుగా విడిపోయి ఒకరి తర్వాత ఒకరు, అతి నిశ్శబ్దంగా, గోడవారగా, చీకట్లో గమ్యాలవైపు బయలుదేరారు. భాస్కరు, హెడ్మాస్టరు పిలుపునిబట్టి అవసరమయిన చోటికి వెళ్లడానికి నిశ్చయించుకుని, వీధి అరుగుమీద పొడుగు చెక్కబల్ల మీద రెడీగా కూర్చున్నారు.





ఉదయం అయిదు గంటల వేళ-

హెడ్మాస్టరి కూతురు రోజూ పెరట్లోని తడికల స్నానాలగదిలో స్నానం చేసేవేళ అది. భాస్కర్ ఆదేశానుసారం ఈ రోజు ఆమె ఇంటిలోపలే వుండిపోయింది. ఆమె బదులు కళ్యాణి వెళ్లడానికి సిద్ధంగా వుంది.

పెరట్లో ఎవరో మనిషి కదిలిన అలికిడి.

కళ్యాణి ధైర్యంగా తను కట్టుకునే బట్టలు, తువ్వాలు, దీపం తీసుకుని, ఏమీ తెలియని దానిలా వెళ్లి, తడికల స్నానాల గదిలో ప్రవేశించింది.

ఆగంతుకుడి ఆనందానికి అవధులు లేవు.

హెడ్మాస్టరింటికొచ్చిన బంధువుల పిల్ల...

చిలకలాంటి పిల్ల...

మంచి యవ్వనంలో వున్న పిల్ల...

హెడ్మాస్టరుగారి అమ్మాయికంటే అందమైన పిల్ల...

తను కెమెరా తెచ్చుకుని కార్యరంగంలో దూకిన మొట్టమొదటి రోజే తన పంట పండింది. ఆమె స్నానం చేస్తోంటే, వీడియో రికార్డింగ్ చేసే... ఆనందంతో ఒళ్లు గగుర్పొడిచింది వాడికి. ఆమె దగ్గరున్న చిన్నదీపం వెలుతురు చాలు, ఆమె ఒంపుసొంపుల్ని చక్కని కాంతిషేడ్‌లలో తను అందంగా తన దగ్గరున్న ఇంపోర్టెడ్ కెమెరాలో బంధించడానికి... ముందడుగు వేశాడు ఆగంతుకుడు చప్పుడు కాకుండా.

వంటగదిలోని అరతెరచిన కిటికీ గుండా ఊపిరి బిగపట్టి, స్నానాల గదివైపే చూస్తోంది కాత్యాయని. సందర్భం కుదరగానే పెద్దపులిలా బయటకు ఉరకడానికి.

దీపాన్ని ఎత్తులో ఒక పిట్టగోడలాంటి దానిమీద పెట్టి, నైటీ తీసుకోబోతోంది కళ్యాణి.

ఆగంతుకుడు కెమెరా రెడీ చేసుకుని, గుడ్లు మిటకరించి సిద్ధమవుతున్నాడు.

ఏదో తెచ్చుకోవడం మరచిపోయిన దాన్లా నైటీ తీసుకునే ప్రయత్నాన్ని విరమించి, బయటకు రెండడుగులు వేసిన కళ్యాణి, మళ్లీ ఎందుకో లోపలికే ప్రవేశించింది.

ముందు నిరుత్సాహపడ్డ ఆగంతుకుడు, మళ్లీ ఆమె లోపలికే ప్రవేశించడంతో రెట్టింపు ఉత్సాహంతో సిద్ధమవుతున్నాడు, కెమెరా కంటి దగ్గర పెట్టుకుని, తడక కన్నాల్లోంచి షూట్ చెయ్యడానికి సిద్ధపడుతూ.

తనకి టైం గెయిన్ చెయ్యడానికే కళ్యాణి అలా లోపలికి, బయటికి, లోపలికి నడిచిందని గ్రహించిన కాత్యాయని, దూకడానికి సమయం ఆసన్నమయిపోయిందని గ్రహించింది. ఇంక ఒక్క క్షణం ఆలస్యం చేసినా, కళ్యాణి తను రాదేమోనని భయపడిపోయి తత్తరపాటులో తప్పుచేస్తుంది... ఏదో ప్రమాదం ఉందని పసిగడ్తే ఆగంతుకుడు పారిపోతాడు... అంతే... "ఎవడ్రా అదీ...?" అంటూ కేకపెడ్తూ అక్కడున్న మడకర్రొకటి చేతుల్లోకి తీసుకుని, బయటకొచ్చి వాడివైపు పరుగెత్తింది కాత్యాయని. కళ్యాణి కూడా అదే సమయంలో కాత్యాయనికి తోడుగా స్నానాల గదిలోని ఇత్తడి బాల్చీని ఎత్తిపట్టుకుని బయటకొచ్చింది.

ఈ హఠాత్పరిణామానికి దంగైపోయాడు ఆగంతుకుడు.

వాడి అదృష్టం... మరొక్కక్షణం ఆలస్యమయితే, కాత్యాయని ఆయుధం మడకర్రో, కళ్యాణి ఆయుధం ఇత్తడి బాల్చీయో వాడి తల మీద వాలి, ఆ తలని రెండు ముక్కలు చేసివుండేవే.

తేరుకున్న ఆగంతుకుడు వీధివైపు పరుగు తీశాడుగానీ, అక్కడ పెరటి గుమ్మానికి అడ్డంగా, నిండుగా వున్న విగ్రహం భాస్కర్‌ది!

చేష్టలుడిగి నిలబడిపోయాడు వాడు.

వెనగ్గా ఆడపిల్లలతో బాటు, కోపంతో బుసలుకొడ్తూ, వాడివైపు వస్తున్నారు సీతారా



మయ్యగారు.

హెడ్మాస్టరింటిలో తమ కర్తవ్యం పూర్తి చేశాక జంటగా ఉత్సాహంగా తమ మిత్ర బృందాలకు సహాయం చేయడానికి వేగంగా, చప్పుడు కాకుండా బయలుదేరారు కాత్యాయని, కళ్యాణి.

పక్కవీధిలోకి మళ్లగానే చీకట్లో గోడవారగా ఓ ఆకారం కనిపించింది. సహజమైన భయం కమ్మింది వాళ్లని. ఆ భయం తెలియజేసేలా చెయ్యి ఊపుతూ పతంజలి వాళ్ల దగ్గరకొచ్చాడు. "అప్పుడే ఒకడు దొరికాడు" అంది కళ్యాణి గుసగుసగా.

"ఇంకోడు కరణంగారింట్లో ఉన్నాడు. మీరు జాగ్రత్తగా వ్యవహరించండి. మేం ఇంటి చుట్టూ గోడ బయట వుంటాం" అన్నాడు పతంజలి అదే స్థాయి గొంతుతో.

డిటెక్టివ్లా తక్కుతూ, నక్కుతూ, అలికిడి కాకుండా కరణంగారి పెరట్లోకి అడుగులో అడుగు వేసుకుంటూ ప్రవేశించారు ఆడపిల్లలిద్దరూ. ఆడపిల్లల్ని పంపించడంలో, అక్కడి బ్యాచి లీడర్ పతంజలి ఉద్దేశం స్నానం చేసే స్త్రీని కర్తవ్య నిర్వహణలోనైనా తాము చూడకూడదని.

కరణం గారింటి పెరట్లో స్నానాలగదే లేదు.

ఇంట్లోంచి గురకలు వినిపిస్తున్నాయి.

కరణంగారి కోడలు ఇంటిలోంచి పెరట్లోకి వచ్చి తలుపులు జేరవేసి, అరటిచెట్ల పక్కనున్న బావి దగ్గరకు నడిచింది. దీపాన్ని బావి గట్టుమీద ఉంచి ఆ పక్కనే గట్టుమీద కట్టుకోబోయే చీర పెట్టుకుంది. చేదతో నీళ్లు తోడుకుని, గంగాళంలో పోసుకుంది. కూర్చుని, ఒంటిమీద బట్టలు తీసుకుంటోంది బావికి అటువైపున.

కళ్యాణి, కాత్యాయనుల కళ్లు పగిలిన పత్తికాయల్లా విచ్చుకుని ఆ చీకట్లో అరటి బోదెల వెనగ్గా ఉన్న పొదల్లోకి చూపుని గుచ్చి చూస్తూ వెదుకుతున్నాయి. ఎవరూ కనబడ

## చతుష్పాదులు

కృతయుగంలో ధర్మం నాలుగు పాదాలా నడిచేదట అని ఎవరైనా అంటే- త్రిపురనేని గట్టిగా నవ్వేవారు. అంతేకాదు- 'ఓహో ఆ రోజుల్లో అంతా నాలుగుకాళ్లపై నడిచేవాళ్లు కాబోలు' అంటూ వ్యంగ్యంగా ఎత్తిపొడిచేవారు.

డంలేదు. ఎవరూ లేరేమో. ఊపిరి సలపనంతగా ఉగ్గబట్టుకుని కూర్చున్న తమని డైరెక్టుగా బొందితో కైలాసానికి పంపిస్తారేమో' అని విసుక్కుంటుండగా, పొదలు కొద్దిగా కదలడం కనిపించింది ఇద్దరికీ. ఇంకా కళ్లు పొడుచుకు చూసేసరికి ఆ పొదల మధ్యలో ఆకుల్నీ, కొమ్మల్నీ కొద్దిగా ఒత్తిగించి ముందుకు పొడుచుకొచ్చిన కెమెరా కనిపించింది.

చేతులు గిల్లుకున్న ఇద్దరూ ఒక్కసారీ "ఒరేయ్... ఎవడ్రా అదీ? " అంటూ కేకలు పెడ్తూ దగ్గర్లో వున్న ఇటుకల్ని చేతుల్లోకి తీసుకుని పొదలవైపు పరుగెత్తారు.

వచ్చినవాడు చాలా చుర్నుకైన కుర్రాడు. వీళ్ల కేక ప్రారంభిస్తూ ముందుకు రాబోతుండగానే వీళ్ల ఉనికిని కనిపెట్టి నాలుగంగల్లో ప్రహరీ గోడని చేరాడు. లంక దిక్కు చేతులు చాచి ఎగిరిన ఆంజనేయుడిలా ఎగిరి, గోడమీదకు చేరి అటువైపుకి అమాంతం దూకాడు. గానీ సరిగ్గా పతంజలి, చక్రపాణిల మధ్య పడ్డాడు! వాడిని అవ్వా అప్పచ్చి వేసుకుని పైకెత్తి, నోరెత్తొద్దని సంజ్ఞలతోనే వార్నింగిచ్చి తెచ్చి భాస్కర్ ముందు నిలబెట్టారు వాళ్లు.

వాడికి ఇందాక హెడ్మాస్టరింట్లో దొరికిన వాడి పక్కన మోకాళ్ల మీద కూర్చోవడానికి చోటు కేటాయించబడింది.

ఇంకా తమకెవరూ దొరక్కపోవడంతో







కొద్దిగా నిరాశకు గురవుతున్న నేతాజీ గ్రూపు 'ఎవరూ ఈ పాడుపనికి పూనుకోకుండా వుంటే సంతోషమే. పూనుకుంటే మాత్రం మా చేతికి చిక్కి చెట్నీ అయిపోవలసిందే ఈవాళ' అన్న పంతంతో, రెప్పలు వాల్చ కుండా వెదుకుతున్నారు చీకట్లో.

ఇందాక కరణం గారింటి దగ్గర నీచపు కార్యానికి పాల్పడ్డ దుర్మార్గుడైతే దొరికాడు గాని, కరణంగారి కోడలు ఈ హఠాత్పరిణా మానికి కొయ్యబారిపోయింది. కళ్యాణి, కాత్యాయనుల సపర్యలతో తేరుకుంది గాని, తను స్నానం చేస్తుంటే పరాయి మగాడు తనని చూశాడన్న విషయాన్ని భరించలేక పోయింది. బావిలోకి దూకడానికి సిద్ధప డింది. ఆమెని వారించి మామూలు మని షిని చెయ్యడానికి చాలా కష్టపడ్డారు ఆడ పిల్లలిద్దరూ...

"మా అత్తగారికి, మామగారికి తెలిస్తే నన్నెలాగూ బావిలోకి తోసి చంపేస్తారు" అంది ఆమె ఏడుస్తూ.

"తెలిస్తేగా? గుర్రుపెట్టి దున్నపోతుల్లా నిద్రపోతున్నట్లున్నారు అంతా లోపల. మా అరుపు, అలికిడీ ఏమీ వాళ్ల సుఖనిద్రకు భంగం కలిగించినట్లులేదు. నువ్వు ఏమీ జరగనట్లు లోపలికి వెళ్లిపో. ఇందులో నీ తప్పేంలేదు. దేముడు నీ పక్షమే వున్నాడు. పిచ్చిపిచ్చి ఆలోచన్లు మానెయ్యి" అని బ్రెయిన్ వాష్ చేసింది కళ్యాణి. కాత్యాయని కూడా అవసరమైన మాటల్ని చెప్పింది.

ధైర్యం వచ్చాక లోపలికి వెళ్లిపోయి తలు పేసుకుంది ఆమె.

చడీ చప్పుడూ లేకుండా బయటకొచ్చేశారు ఆడపిల్లలిద్దరూ.

చీకట్లో గోడవారగా నడుస్తున్న నేతాజీ గ్రూపు, "ఏమే ఎవరదీ?" అని పక్కనే వున్న ఇంట్లోంచి వినిపించిన చిన్న కేకకి ఉలిక్కి పడి బొమ్మల్లా బిగుసుకున్నారు. అంతలోనే లోపల పెరట్లో ఎవరో పరుగెత్తబోయిన చప్పుడు. అంతలోనే ఎవరో స్త్రీ కంగారుగా మళ్లీ "ఎవరదీ?" అని ఆశ్చర్యం నిండిన గొంతుతో "ఒరేయ్ తమ్ముడూ... నువ్వంట్రా? ఏమిట్రా ఈ పనీ? కళ్లు పోవట్రా?" అన్న బాధతో కూడిన మాటలూ వినిపించి, జాగ్రత్తగా లోపలివాళ్లకు కనబడకుండా గోడ మీదగానూ, కంచె సందుల్లోంచి లోపలికి చూడాసాగారు. ఊరి చివర ఇల్లది.

ఆదరాబాదరా ఒంటికి చీర చుట్టబెట్టు కున్న ఓ మధ్య వయసు యువతి, నీళ్లు కారుతున్న ముఖంతో, కన్నీళ్లయిపోతూ బాధగా, వేదనగా, ఆందోళనగా ప్రశ్నిస్తోంది. ఆమె ఎదురుగా తల దించుకుని నిల్చున్న ఓ పద్దెనిమిదేళ్ల యువకుడు! చేష్టలుడిగి బొమ్మలా నిలబడిపోయిన ఆ యువకుడి చేతిలో ఓ వీడియో కెమెరా!

గోడదూకి వాణ్ణి పట్టుకుందామా అన్నట్లుగా చూశాడు యేసేబు... నేతాజీ అతణ్ణి వారించి అదెప్పుడయినా చేయొచ్చు, ఏం జరుగుతుందో చూద్దాం అన్నట్లుగా తల ఆడించాడు.

నేరం చేయడానికి అనుభవం లేకపోవ డంతో తల్లిలాంటి స్వంత అక్కగారి నగ్న చిత్రాలనే బజారులో పెట్టడానికి సిద్ధపడి ఆమెకే దొరికిపోయి ఆమె ఎదుట ఇంకా మనిషిగా నిలబడడానికి అసహ్యం, రోత తనమీద తనకే కలిగి, అపరాధ భావన నాభి దగ్గర ప్రారంభమై పైకి తన్నుకు రాగా, అంచెలంచెలుగా కుసిళ్లుతూ, కుప్ప కూలి పోయి బావురుమంటున్నాడు వాడు.

ఎవరైనా వింటారేమోనని భయపడ్తోంది అక్కగారు. తన తమ్ముణ్ణి అందరూ అస హ్యించుకుంటారని బాధ పడ్తున్నట్లుగా వుంది. "ఉష్! వద్దు... ఏడవొద్దు! అయిపో యిందేదో అయిపోయింది, ఊర్కోరా..." అంటూ, అతి తక్కువ స్వరంతో వాడిని ఊరడిస్తోంది-తమ్ముడి నీచ ప్రవర్తనకి బాధ



పడుతూనే.

ఊరుకోలేదు వాడు.

ఒక్క ఉదుటున లేచాడు. చేతిలోని కెమెరాని గోడకేసి పగలగొట్టాడు కసిగా. ఆవేశంగా, "నేను బతక్కూడదక్కా యింక... చావాలి" అంటూ పిచ్చిగా అరుస్తూ, ఒళ్లంతా గీసుకుపోతున్నా లెక్కచెయ్యకుండా ముళ్లకంచెను ఛేదించుకుని పరుగెత్తి వచ్చాడు బయటకు. బహుశా ఏ చెరువులోనో, బావిలోనో పడి చావాలనే సంకల్పం కావొచ్చు.

"తమ్ముడూ...వద్దురా...ఆగరా నాన్నా.." అంటూ ఏడుస్తోంది. ఆమె వెనగ్గా చీకట్లో ఉన్న నేతాజీ బృందాన్ని వాడు గమనించక వీధిలో పరుగెత్తసాగాడు.

అరిస్తే గోలయిపోతుందని, అరవకుండా వెంబడించి, వాడిని సులభంగానే అందుకున్నారు నేతాజీ బృందం.

వాణ్ణి ఓదార్చుతూనే ఒడిసి పట్టుకుని, శిక్షించాలా, విడిచిపెట్టాలా అన్న నిర్ణయం భాస్కర్ సార్‌కే వదిలిపెడ్తూ, అతని ముందుకు తీసుకొచ్చి వదిలారు.

అప్పటికే హెడ్మాస్టరు, భాస్కరూ చెరొకడి చెంపలూ వాయకొట్టి విషయం రాబట్టారు. ఇంకా కొందరు హైస్కూలు పిల్లలు, ఒకళ్లిద్దరు భాస్కర్ కాలేజీ స్టూడెంట్లు, వాళ్ల గ్యాంగులో ఉన్నట్లు తెలిసింది. వీళ్లందరి ధ్యేయం సులభంగా డబ్బు సంపాదించడం. ఈజీ మనీ. ఈ పని చేస్తే కావలసినంత డబ్బిస్తానని ఆశపెట్టి వీడియో కెమెరాలను కార్యం నెరవేర్చగలరని నమ్మకం ఉన్న కుర్రాళ్ల చేతికిచ్చింది విజయవాడలోని ఓ ఫోటో స్టూడియో అధిపతి అని, తన్నులు భరించలేక ఇద్దరు కుర్రాళ్లూ చెప్పేశారు. మిగిలిన వాళ్లు ఈ రాత్రి కొందరు భయపడి రాలేదని, వచ్చిన వాళ్లల్లో మిగిలినవాళ్లు పారిపోయుంటారని చెప్పారు.

ఆఖరుగా నేతాజీ బృందం తీసుకొచ్చిన కుర్రాళ్లను చూసి, వాడు స్వంత అక్క విషయంలోనే నీచంగా ప్రవర్తించబోయి, ఆమెకే దొరికిపోయి మందలించబడ్డాడని, చచ్చిపోతానని మొండికేస్తున్నాడని విని ఆశ్చర్యపోయాడు భాస్కర్. మంచి సంప్రదాయ కుటుంబం నుంచి వచ్చినవాడిలా వున్నాడు. వాడికీ ఆలోచన ఎలా వచ్చింది?!

"సినిమాలు, వీడియోలూ, ఇంటర్నెట్టూ, రహస్య కెమెరాలు... మనం సాంకేతికంగా ఎంత ముందుకు పోతున్నామో, నీతి నియమాల విషయంలో అంత వెనుకకుపోతున్నాం భాస్కర్‌గారూ! కొత్తగా కనిపెట్టే ప్రతి సాధనాన్ని వికృతచేష్టలకీ, వినాశనానికీ ఎలా ఉపయోగించాలా అని పోటీపడి ఆలోచిస్తున్నాం" అన్నారు హెడ్మాస్టరు బాధగా.

**ఈ పని చేస్తే కావలసినంత డబ్బిస్తానని ఆశపెట్టి వీడియో కెమెరాలను కార్యం నెరవేర్చగలరని నమ్మకం ఉన్న కుర్రాళ్ల చేతికిచ్చింది విజయవాడలోని ఓ ఫోటో స్టూడియో అధిపతి అని, తన్నులు భరించలేక ఇద్దరు కుర్రాళ్లూ నిజం చెప్పేశారు**



"ఈ రాత్రి వీళ్లతో రాని వాళ్లలో ఎవరో కుర్రాడు భయపడో, బాధపడో, పశ్చాత్తాపపడో మీకు ఉత్తరం ద్వారా తెలియజేసి వుంటాడు హెడ్మాస్టరుగారూ" అన్నాడు భాస్కర్ నమ్మకంగా.

"అంతే అయ్యుండాలండి. సంప్రదాయానికి మారుపేరు మా ఊరు. ఆడవాళ్లంతా తెల్లవారకముందే కాలకృత్యాలు తీర్చేసుకుంటారు. ఎవరైనా తమని చూస్తున్నారేమోనన్న కించిత్ సంశయం కూడా వాళ్లకి కలగదు. ఈ ఊరి మగవాళ్లమీద వాళ్లకంత నమ్మకం" అన్నారు హెడ్మాస్టరు.

"తన్నులు తిన్న కుర్రాళ్లిద్దర్నీ ఇక వదిలెయ్యండి. ఈ కుర్రాడు మనతో వస్తాడు. చేసినదానికి పశ్చాత్తాప పడుతున్నాడుగా. ఇతనిచేత చేయించాల్సిన మంచి పనులు చాలా వున్నాయి. రేపు ఈ కుర్రాడి నాయకత్వంలో మనవాళ్లంతా ఆ ఫొటో స్టూడియో మీద ఆకస్మిక దాడిచేసి, పరికరాలన్నీ ధ్వంసం చేసి, ఆ రాస్కెల్ పనిపడతారు. దానికి మీడియా నుంచి, పత్రికల నుంచి, పెద్దల నుంచి సహకారం అందేలా నేను చూస్తాను" అన్నాడు ఆవేశంగా భాస్కర్.

ఆ కుర్రాడి ముఖం అపరాధభావన నుంచి, ఆత్మక్షోభ నుంచి, ఆవేదన నుంచి భాస్కర్ మాటలతోబాటే క్రమేపీ తేరుకుని, ఆవేశంగా మారింది. గుండెలు ఉబికాయి. పిడికిళ్లు బిగిశాయి.

కుర్రవాళ్ల చేతులన్నీ కలిపి సై అంటూ పైకి లేచాయి.

* * *

మహోదధి తరంగంలా విరుచుకుపడి, స్టూడెంట్లు ఫొటో స్టూడియోని ధ్వంసం చేసి, స్టూడియో అధిపతిని చెప్పుల దండలతో గాడిదనెక్కించి ఊరేగించారు విజయవాడ నగరం ముఖ్య వీధుల్లో.

అన్ని రంగాలనుంచీ అభినందనలు అందాయి భాస్కర్‌కీ, అతని శిష్యబృందానికీ. యువకులకు సరైన మార్గదర్శకత్వం వుంటే, తప్పుదారి పట్టకుండా సమాజానికి ఎంత చక్కగా ఉపయోగపడతారో భాస్కర్ లాంటి అధ్యాపకులను చూసి చాలామంది చాలా నేర్చుకోవాలని పత్రికలు, ఎలక్ట్రానిక్ మీడియా ఘోషించాయి.

కుసుమాంజలి ఆనందానికి అవధులు లేవు.

డ్రామాకుమార్‌గారు, ఆయన భార్య తమకు కాబోయే అల్లుడి ప్రతిభకు మురిసిపోయారు.

స్టూడెంట్లలో ఇంకా చాలామంది ముందుకొచ్చి భాస్కర్ నాయకత్వంలో మంచి మంచి పనులుచేసి, హీరోలు అనిపించుకోవాలని ఉవ్విళ్లూరుతున్నారు. తల్లిదండ్రులు కూడా తమ పిల్లల్ని భాస్కర్ చేపట్టే ఏ కార్యంలోనైనాసరే పాల్గొనమని ప్రోత్సహిస్తున్నారు.

ఇంతమంది అభిమానాన్ని చూరగొన్నందుకు, మంచి కార్యాలు చేపట్టడానికి అందరి సహకారం లభిస్తున్నందుకు చాలా తృప్తిగా వుంది భాస్కర్‌కు.

తనకింతటి చక్కటి భవిష్యత్తుని ప్రసాదించిన దేవత శారదని తలుచుకుని, ధన్యవాదాలు చెప్పుకున్నాడు. తన రూములోని ఆమె పటానికి మనసా కర్మణా ప్రణామాలు అర్పించాడు.

## 15

భాస్కర్ వివాహం ఈరోజు ఉదయం అత్యంత ఆనందదాయకంగా, శుభప్రదంగా జరిగింది.

భాస్కర్ తరఫున వచ్చిన విద్యార్థులు, విద్యావేత్తలు, అతని మామగారి తరఫున వచ్చిన కళాకారులు, ఉన్నతోద్యోగులు తమ ఇంటి శుభకార్యంగా భావించుకుని, దేవుడి పెళ్ళిలో అందరూ పెద్దలే అన్నట్లుగా బాధ్యతలు మీదేసుకోవడానికి పోటాపోటీగా ముందుకొచ్చి మరీ చక్కగా జరిపించారు



శుభకార్యాన్ని.

ఇప్పుడు ఈ చల్లని సాయంకాలం వేళ-

విద్యార్థులు, కళాకారులు మురళి వేసిన స్కెచ్ ప్రకారం వేదికను అలంకరించి భాస్కర్, కుసుమాంజలిలను కుర్చీల్లో వేదిక మీద కూర్చోబెట్టి చక్కగా రిసెప్షన్ కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు.

తమ తమ తరపు అతిథులను ఒకరికొకరు సంతోషంగా పరిచయం చేసుకుంటున్నారు భాస్కర్ దంపతులు. వాళ్లందుకున్న గిఫ్టలను తమ చేతుల్లోకి తీసుకుని, వెనక అందంగా, పొందిగ్గా అమర్చుతున్నారు కళ్యాణి, కాత్యాయని.

ఒక చేత్తో కుర్రాణ్ణి మరో చేత్తో గిఫ్టునీ పట్టుకుని వేదిక మీదకొచ్చిన ఓ స్త్రీ తమలో ఎవరి వైపో గుర్తుపట్టలేక ఇబ్బందిపడ్డారు దంపతులు. ఆమె గిఫ్టుని భాస్కర్‌కి అందించింది. దానికి అంటించిన కార్డుమీద 'టు మై రియల్ హీరో' అని వుంది. ఇచ్చిన వారి పేరు లేదు.

యాంత్రికంగా భాస్కర్ థ్యాంక్స్ అన్నాడుగాని ఆమె ఎవరో గుర్తించలేకపోయాడు.

ఆమె కుసుమాంజలితో నవ్వుతూ, "యూ ఆర్ వెరీ లక్కీ" అంది.

అలా అనేసి, ఆమె దిగిపోబోతుండగా ఆ గొంతు ఎవరిదో గుర్తొచ్చింది భాస్కర్‌కి.

వెన్నులో విద్యుత్తు పాకినట్లయింది. "బేబీ రాణీగారూ! మేడమ్!" అని చిన్నగా కేక పెట్టాడు.

ఆమె ఆగి, నెమ్మదిగా వెనక్కి తిరిగి, ప్రయత్నపూర్వకంగా తలెత్తి భాస్కర్ ముఖంలోకి చూసింది.

ఆమె కళ్లలో సన్నటి నీటిపొర.

"సారీ! గబుక్కున గుర్తుపట్టలేకపోయాను. రియల్లీ ఎక్స్‌ట్రీమ్‌లీ సారీ. యు మస్ట్ ఫర్‌గివ్ మి" బాధపడ్డాడు భాస్కర్.



"ఏం ఫరవాలేదు! గుర్తు పట్టలేకపోవడం మీ తప్పు కాదు. నా రూపంలోనే చాలా తేడా వచ్చింది" ఆమె గొంతులో మర్యాదతో బాటు, సన్నని బాధ వినిపించింది.

నిజంగానే ఆమె రూపంలో మార్పొచ్చింది. బాగా లావెక్కింది ఆమె. ముఖంలో వయసుని మించిన ముసలి కళొచ్చేసింది. కళ్లల్లో ఏదో తెలియని వెలితి.

"ఈవిడ బేబీరాణిగారని ఫేమస్ డాన్సర్" అని పరిచయం చేశాడు భాస్కర్ భార్యకు.

"ఒకప్పుడు" అని జతచేసింది బేబీరాణి.

కుసుమాంజలి మర్యాదగా, సవినయంగా నమస్కరించింది ఆమెకి. ఆపైన, ఆమె చేతిని పట్టుకున్న కుర్రవాడి బుగ్గలు మీటి, "ఇద్దరూ భోజనం చేసి వెళ్లండి" అంది.

బేబీరాణి తల అడ్డంగా ఊపుతూ అంది.

"లేదండి... వీళ్ల నాన్న వచ్చే వేళయింది. ఆ టైముకి నేను ఇంటి దగ్గరుండాలి. సారీ" అంది.

"అదేమిటి భోజనం చెయ్యకుండా..." బాధపడ్డాడు భాస్కర్.

"మీకు భోజనం పెట్టే భాగ్యం నాకు కలగకపోయినా మరోసారి వచ్చినప్పుడు మీ ఇంట భోజనం చేస్తానులే" అంటూ నవ్వింది, భాస్కర్‌ని చూస్తూ నర్మగర్భంగా.

భాస్కర్ నవ్వేస్తూ దూరంగా ఉన్న తన చెల్లి, బావల్ని పిలిచి బేబీరాణికి పరిచయం చేసి, చెల్లెలి చెవిలో ఏదో చెప్పాడు. ఆమె గబగబా పరుగెత్తింది.

వచ్చిన వారిలో ఒక అతిథి భోజనం చెయ్యడానికి టైము లేదంటూ వెళ్లిపోతుండడం గమనించిన కళ్యాణి, చురుగ్గా పరుగెత్తి, ఓ అరడజను స్వీట్లు ప్యాకెట్ కట్టి తెచ్చి బేబీరాణి కిచ్చింది.

కళ్యాణిని అభినందిస్తూ చూశాడు భాస్కర్.

ఆ తర్వాత చెల్లెలు తెచ్చిన చీర ప్యాకెట్‌ని అందుకుని, బేబీరాణి చేతుల్లో ఉంచి నమస్కరిస్తూ, "థ్యాంక్స్ ఫర్ కమింగ్" అన్నాడు.

ఆ ప్యాకెట్‌ని అందుకుంటూ, అతని వేళ్లని స్పృశించి, మిగిలిన వాళ్లు కొంచెం దూరంలో ఉండడంతో ధైర్యంచేసి, గుసగుసగా, తలదించి, "వచ్చే జన్మలో నిన్ను వదులుకునే మూర్ఖురాలిగా పుట్టను భాస్కర్" అనేసి తలెత్తి గట్టిగా, "థ్యాంక్యూ వెరీమచ్-విష్ యు ఎ హ్యాపీ మేరీడ్ లైఫ్" అని, రివ్వున వెనుతిరిగి, కొడుకుతోబాటు వెళ్లిపోయింది బేబీరాణి, వాచీ చూసుకుంటూ కంగారుగా.

ఒక్క క్షణం అక్కడే చూస్తూ నిలబడి, నిట్టూర్చి తిరిగి హ్యాపీ మూడ్‌ని తెచ్చుకుంటూ భార్య పక్కకు చేరాడు భాస్కర్.

స్టూడెంట్ల పాటలు, డ్యాన్సులు, జోకులు... కేరింతలు... జోరుగా, హుషారుగా సాగిపోతోంది రిసెప్షన్ ఫంక్షన్.

* * *

నాలుగేళ్లు గడిచాయి.

సొసైటీలో భాస్కర్ గౌరవం పెరిగింది. అభిమానుల సంఖ్య పెరిగింది. శిష్యగణం పెరిగింది. సంసారమూ పెరిగింది.

ఇద్దరు ముగ్గురయ్యారు. బిడ్డకిప్పుడు మూడేళ్లు. పెళ్ళై ఏడాది తిరక్కుండా పుట్టిన బాబుకి "ఏం పేరు పెడదామో నువ్వు నిర్ణయించు" అన్నాడు భార్యతో భాస్కర్ మూడేళ్ల క్రితం.

భర్త అభిరుచులకు, లక్షణాలకు కూడా నప్పే రీతిలో బాబుకి పేరు పెట్టాలని ఆలోచించి, ఏం తోచక తల్లిదండ్రులని, భర్త శిష్యగణాన్ని సంప్రదించింది కుసుమాంజలి.

ఓ వెయ్యి పేర్లు పరిశీలనలోకి వచ్చాయి. ఏదీ ఫైనలైజ్ చేయలేకపోయారు అంతా కలిసి.

భాస్కర్ మౌనంగా శ్రోతగా, ప్రేక్షకుడిగా మాత్రమే ఉండిపోయాడు- నిర్ణయాన్ని



వాళ్లకి వదలిపెట్టి.

అంతా కలిసి చివరికి, "మేం చేతులెత్తేశాం... మీరే నిర్ణయించండి, అదే ఫైనల్" అన్నారు భాస్కర్‌తో.

బారసాల రోజున ఆ క్షణాన ఏది తోస్తే అది చెబుతానన్నాడు భాస్కర్. బారసాలకి యింకా వారముంది. ఎప్పుడు ఆ శుభముహూర్తం వస్తుందా బాబుకి ఏం పేరు భాస్కర్ నిర్ణయిస్తాడా అని అంతా క్షణాలు లెక్కపెట్టుకుంటూ గడుపుతున్నారు. క్షణమో యుగంలా గడుస్తోంది.

శుభఘడియలు రానే వచ్చాయి.

"బాబు పేరు..." అని ఆగి అందరివైపు చూశాడు భాస్కర్.

ఉత్కంఠతో ఊపిరి బిగపట్టి చెవులు రిక్కించి, రెప్పలు వాల్చకుండా చూస్తున్నారంతా.

"వివేకానంద శారద" అన్నాడు భాస్కర్.

ఆనందంతో చప్పట్లు మారుమోగిపోయాయి.

"చివర శారద ఎందుకు? ఆడ పేరులా లేదూ? " అని చిరు సందేహాన్ని వెలిబుచ్చింది అత్తగారు.

పురోహితుడు ఆమె భయాన్ని తీరుస్తూ అన్నాడు, "కాదమ్మా... పేరు దివ్యంగా వుంది. ఆ శారదాంబ... సరస్వతీదేవి బిడ్డగా, వివేకానందుడిలాగ లోకప్రసిద్ధి పొందుతాడు చిరంజీవి" అని.

అందరి ఆనందానికి అవధులు లేవు.

* * *

మూడేళ్ల కొడుకు రెండు చిటికెన వేళ్లు పట్టుకుని, వాడికి చెరోదిక్కున నెమ్మదిగా వాడి బుడి బుడి అడుగులతో సమానంగా, టాంక్‌బండ్ మీద నడుస్తున్నారు భాస్కర్, కుసుమాంజలి. ప్రతి చిన్న విషయానికీ అలిగే స్వభావంతో పెళ్ళికి ముందు, పెళ్ళయిన కొత్తల్లోనూ వున్న కుసుమాంజలిలో యిప్పుడు ఎంతటి స్థిమితం, ఎంతటి స్థితప్రజ్ఞత, ఎంతటి సహనం, ...

'బాబు మంచి పౌరుడుగా తయారవడానికి నా ప్రమేయం ఏమీ అక్కర్లేదు. తల్లి పెంపకంలో చాలా వృద్ధిలోకి వస్తాడు వాడు' అనుకుంటుంటాడు భాస్కర్.

శీతాకాలపు ఉదయం ఎండలో హుస్సేన్ సాగర్‌లోని బుద్ధ భగవానుడు అందంగా ధగధగలాడుతున్నాడు. ఆనందంగా కనిపిస్తున్నాడు.

తెలుగు తేజో మూర్తుల విగ్రహాలను పరిశీలించి చూస్తూ, వాళ్ళకు నివాళులర్పిస్తూ ముందడుగు వేస్తున్న దంపతుల చూపు, రోడ్డు దాటుతూన్న చిన్న పిల్లల సమూహం మీద పడింది. వాళ్ళు రోడ్డు దాటుతున్నప్పుడు ఓ స్త్రీ రోడ్డు మధ్యగా వాళ్ళవైపు తిరిగి నిలబడి, వస్తోన్న వాహనాలను కంట్రోల్ చేస్తూ, పిల్లలందరూ దాటాక, తానూ ఫుట్ పాత్ మీదకొచ్చి, క్రమశిక్షణతో వాళ్ళని నడిపిస్తూ, వెయ్యి కళ్లతో వాళ్లనే చూస్తూ, వాళ్ళ ప్రక్కనే నడుస్తూ, తెలుగు తేజాల గురించి బోధిస్తోంది.

ఆమెతో సహా అందరూ శాంతి పావురాల్లా, దేవతా ప్రతినిధుల్లా, చూడముచ్చటగా ఉన్నారు తెల్లని దుస్తుల్లో.

వాళ్ళవైపు బాబు దృష్టిని మరల్చి అటు నడిచారు దంపతులు.

వాళ్ళ గురించి తెలుసుకోవాలని ఉత్సాహం పొటమరించడంతో, లీడ్ చేస్తున్న ఆ స్త్రీతో, "ఎక్స్‌క్యూజ్ మీ, మేడం" అన్నాడు భాస్కర్.

"యస్సర్" అంటూ ఆమె యిటు తిరిగింది.

అంతే!!

సంభ్రమాశ్చర్యాలకు లోనయిపోయాడు భాస్కర్.

ఇది కలా? ! నిజమా? !

నాభి దగ్గర ప్రారంభమయిన ఆనందం



గింగుర్లు తిరుగుతూ, పైకి తన్నుకు వచ్చి గుండెల్లోంచి గొంతులోకి తన్నుకు రాగా "అక్కా" అన్నాడు వివశంగా.

ఆమె ఆశ్చర్యపోయి భాస్కర్ కళ్లల్లోకి చూసింది.

కుసుమాంజలికి ఏం అర్థంకాక చూసింది.

"నేనక్కా... భాస్కర్‌ని. నువ్వు నిలబెట్టిన జీవితాన్ని ఆనందంగా గడుపుతున్న భాగ్యవంతుణ్ణి" ఆనందంగా అరిచాడు.

ఆమె అర్థం కాక అలాగే చూస్తోంది. భాస్కర్ గుర్తుకు రావడం లేదు.

"ఈ టాంక్ బండ్ మీదే. సుమారు పది సంవత్సరాల క్రితం... నేను... అదుగో... అక్కడినుంచి హుసేన్‌సాగర్‌లో దూకి ఆత్మహత్య చేసుకుందామని... జీవితంమీద నిరాశతో ప్రయత్నిస్తే... నువ్వు వారించి... ఇటువైపు తీసుకొచ్చి, జీవిత రహస్యాన్ని చెప్పి, బతుకు పాఠాన్ని బోధించి, నాలోని అణువణువునీ నీ మాటల్తో చైతన్యపరిచి, నన్నొక మనిషిని చేసి పంపావు. గుర్తు లేదూ? నువ్వు మనిషివి కాదక్కా... దేవతవి. నా ఆరాధ్య దైవానివి శారదక్కా..." రెండు చేతులూ జోడించి, కన్నీళ్లతో, ఆర్తితో, ఆవేశంతో చెబుతున్నాడు భాస్కర్.

"...తన భర్త రోజూ తెల్లవారుతూనే మొట్ట మొదట ఆమె పటానికి నమస్కరించాకే మరొక పనికి పూనుకునే దేవత 'శారద' ఈవిడేనన్నమాట" అని అర్థమై మనసారా తనూ నమస్కరించింది కుసుమాంజలి.

ఇప్పుడు గుర్తుకు వచ్చింది శారదకు.

ఆనందంతో ఆమె కళ్లల్లో సన్నని నీటి పొర పొటమరించింది. భార్యాభర్తల ఇద్దరి చేతులూ అందుకుని అభినందనగా ఊపి, వాళ్ళ తలల మీద చేతులుంచి ఆశీర్వదించింది. బాబుని ఎత్తుకుని ముద్దాడి, "చాలా గొప్పవాడవుతాడీ బాబు.. ఏం పేరు?" అంది భాస్కర్‌తో.

"వివేకానంద శారద" అన్నాడు భాస్కర్ ఆనందంగా.

ఒక్కసారి చిన్నగా తొట్రుబాటుతో చంచలించిన శారద, ఆ దంపతుల వైపు 'ఏమిటి మీ చాదస్తం' అన్నట్లుగా చూస్తూ బాబుని దించి,తలమీద చేతులుంచి ఆశీర్వదించింది.

"ఇప్పుడు నువ్వు....?" ఆమె గురించి తెలుసుకోగోరి మాటలు మింగాడు భాస్కర్.

ఆమె చిరునవ్వుతో, గత పది సంవత్సరాల్లోనూ ఆమె గడిపిన జీవిత విధానాన్ని పూస గుచ్చినట్లు చెబుతుంటే శ్రద్ధగా విన్నారు భాస్కర్, కుసుమాంజలి.

వ్యభిచారవృత్తిని అంతమొందించడానికి, ఎయిడ్స్ వ్యాధి నుంచి వారికి పుట్టిన బిడ్డల్ని దూరంగా ఉంచి, సమాజంలో మంచి పౌరులుగా వాళ్ళని తీర్చి దిద్దడానికి, ఆమె ఆ పిల్లల కోసం చిన్న బడి నడుపుతూ, తన జ్ఞానాన్ని వాళ్ళకు పంచుతోందనేది ముఖ్యాంశం.

భాస్కర్ గుండెల్లో మందారాలు విరిశాయి. గబగబా వెళ్లి, అక్కడి లాన్స్‌లోంచి దోసిళ్ళతో పూలు తెంపుకొచ్చి ఆమె పాదాల మీదుంచి మోకరిల్లాడు. భర్తని అనుసరించింది కుసుమాంజలి. వాళ్ళిద్దరు అలా చేసే సరికి వివేకానంద శారద, ఇతర పిల్లలూ కూడా తమ లేత దోసిళ్ళతో పూలు తీసుకొచ్చి శారద కాళ్లమీద పోసి మోకరిల్లారు.

శారద పాదాలు పూలలో మునిగిపోయాయి. ఆమె కళ్లు ఆనందబాష్పాలతో నిండిపోయాయి.

ఆమె పాదాలమీది పూలలో, కొడుకు చూపుడు వేలితో 'సరస్వతీ నమస్తుభ్యం వరదే కామ రూపిణీ విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతు మే సదా...' అని రాయిస్తూ అక్షరాభ్యాసం కావించారు భాస్కర్ దంపతులు.

ఆనంద భాష్పాక్షితలతో ఆశీర్వదించింది శారద.





నాటి చతుర



నాటి నవల

# మానవ హోమం

ఫ్లాష్‌బ్యాక్

కొమ్మిరెడ్డి విశ్వమోహన రెడ్డి

సంపుటి : 3 సంచిక : 2 మార్చి 1980

**ఇది కాలాన్ని నెమరు వేసుకునే శీర్షిక. పాఠకుల కోసం చతుర తొలినాళ్ళను పరిచయం చేసే శీర్షిక. కాలగమనంలో మొన్న నిన్నటి పొరల్లో ఒదిగిపోయిన నవలాహారాల్ని ఒక్కటొక్కటిగా ఇతివృత్తం, కథనం వగైరా అంశాలతో రేఖా మాత్రంగా పరిచయం చేయడం ఈ శీర్షిక లక్ష్యం. 1980వ సంవత్సరం మార్చి నెల 'చతుర' లో కొమ్మిరెడ్డి విశ్వమోహనరెడ్డి నవల 'మానవ హోమం' ప్రచురితమైంది. ఆ నవల పరిచయాన్ని ఈ సంచికలో ఇస్తున్నాం.**

'మానవ హోమం' మొన్నటి, నిన్నటి, ఈనాటి రాయలసీమ గ్రామీణ ముఠా రాజకీయ వాతావరణానికి దర్పణం. ఇరవయ్యేడు సంవత్సరాల క్రితం ప్రచురితమైన ఈ నవలలోని సంఘటనలు ఈనాటికీ జరుగుతున్నాయి. సినిమాలుగా వస్తున్నాయి. పగ, ప్రతీకారాలు మనిషిని బానిసగా చేసుకున్నప్పుడు లెక్కలేనన్ని అనర్థాలు జరుగుతాయనేది వాస్తవం. రెండు వర్గాల మధ్య తరతరాలుగా చెలరేగుతున్న ఘర్షణల్నీ, ద్వేషాగ్ని జ్వాలల్నీ చల్లార్చడానికి ప్రయత్నించక పోగా స్వలాభం కోసం ఆ మంటల్లో మరింత ఆజ్యంపోసే మధ్యవర్తులున్నంత కాలం ఏ మలయమారుతాలూ, మహిళల కన్నీళ్లూ పనిచేయవు. ఆ దారుణ మారణ మానవ హోమంలో అందరూ శలభాలై మాడిపోతుంటారు. ఘోర మారణకాండ జరిగి ప్రజలెందరో క్షతగాత్రులై, అనాథలై, వారి నాయకులు ప్రాణాలు కోల్పోయాక వారి వారసుల క్షేమం కోరి, భవిష్యత్తులో ఉపద్రవాలను మట్టుపెట్టదలచి రెండు కుటుంబాల మధ్య రాజీ కుదుర్చుతాడు ఓ పెద్దమనిషి. అదే ఈ నవలలోని కొసమెరుపు.

పైడిపల్లె పేరు వింటేనే అందరూ గజగజ లాడతారు. అది అన్ని గ్రామాల్లాంటిది కాదు. అక్కడి వ్యక్తులూ అంతే. హత్య జరగని సంవత్సరం లేదు. దొమ్మీ జరగని నెల లేదు. కీచులాట లేని రోజు లేదు. ప్రభుత్వానికి విసుగుపుట్టి ప్రత్యేక పోలీసు క్యాంపు పెట్టినా పోలీసుల ముందే పొడుచుకుని చస్తుంటారు.

రెండు కుటుంబాల మధ్య రాజుకున్న పగ రెండువేల జనాభా గల ఆ గ్రామానికి పాకింది. సగం ఒకరివైపు, మిగతా సగం మరొకరివైపు కత్తులు దూస్తారు. హత్యలు, దోపిడీలు, తలలు పగలగొట్టుకోవటంలాంటి



సంఘటనలు నిత్య కృత్యాలయ్యాయి. అక్కడ పంటలు సమృద్ధిగా పండినా ఆ డబ్బు హత్యలకు, కోర్టులకు ఖర్చవుతుంది.

ఒక వర్గానికి నాయకుడు చెంచురెడ్డి. రెండు వందల ఎకరాల మోతుబరి ఆసామీ. ఒకప్పుడు అతని తండ్రిని ఆ గ్రామంలోనే నడివీధిలో నరికి చంపారు. ఆ తర్వాత నాయకత్వం అతనిదైంది. ఓ సంక్రాంతి రోజు చెంచురెడ్డిని గురివిరెడ్డి వర్గం హత్య చేయించింది. ఆ రెండు వర్గాల మధ్య పచ్చ




గడ్డి వేస్తే భగ్గుమనే వైరముంది. తరతరాలుగా జీర్ణించుకుపోయిన వైరం వారు సంబంధాలు కలుపుకున్నా తగ్గలేదు. హత్య చేయించింది గురివిరెడ్డి అనే విషయం సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌కు, అతని పై అధికారులకు తెలిసినా కేసు మోపడం వారికి సాధ్యం కాదు. ఎందుకంటే గురివిరెడ్డి శక్తి, పలుకుబడి అలాంటిది. మంత్రులతో కూడా డబ్బుతో చాకిరీ చేయించుకోగలడు. చెంచురెడ్డి, గురివిరెడ్డి బావ, బావమరుదులు. గురివిరెడ్డి చెల్లెల్ని చెంచురెడ్డికిచ్చి వివాహం జరిపించినా శత్రుత్వం తగ్గలేదు.

చెంచురెడ్డి పెద్ద కొడుకు శ్రీరెడ్డి ఎం.ఏ. చదువుతుంటాడు. తండ్రి మరణవార్త విని అతడు గ్రామానికి వస్తాడు. శ్రీరెడ్డికి రాంరెడ్డి, గోపిరెడ్డి, సురేంద్రరెడ్డి తమ్ముళ్ళు. నాగడు, వీరడు వెంటరాగా అందరూ ఇల్లు చేరుకుంటారు.

లోపల పడకగదిలో చెంచురెడ్డి భార్య అన్నపూర్ణమ్మ ఒకవైపు ఒదిగి పడుకొని ఉంటుంది. కొడుకు రాగానే వెక్కివెక్కి ఏడుస్తూ పడిపోతుంది. శ్రీరెడ్డి కంఠం వెక్కిళ్ళతో నిండిపోతుంది. పరస్పర ఉపశమన వాక్యాలు, ఏడ్పులు, ఓదార్పులు జరిగిపోతాయి.

ఆనాటి సాయంత్రం స్థానిక శాసనసభ్యుడు సిద్ధారెడ్డి, సమితి అధ్యక్షుడు నారాయణ వస్తారు. గురివిరెడ్డికి, చెంచురెడ్డికి మధ్య సంధి ప్రయత్నాలు చేస్తున్నవారిలో వీరు ముఖ్యులు. చెంచురెడ్డిని హత్య చేయించింది గురివిరెడ్డి కాదనీ, వీరిద్దరి మధ్య సంధి ఏర్పడటం గిట్టని స్వార్థపరులే ఈ పని చేశారనీ చెప్పి సంధి యత్నం చేస్తారు. "చెంచురెడ్డికి నా చెల్లెల్నిచ్చాం. నా చెల్లెల్ని ముండమోయించాలన్న తలంపు నాకెన్నడూ కలగలేదని గురివిరెడ్డి అంటున్నాడు. ఈ గ్రామంలో శత్రుత్వం లేకుండా చెయ్యాలనే మీ తాతగారు ముప్పై ఏండ్ల క్రితం వియ్యమందారు. రెండు కుటుంబాల మధ్య సఖ్యత కోసమే మీ అమ్మగారు ఆ ఇంటినుండి ఈ ఇంటికి వచ్చారు. కానీ ఆ వైరం సమసిపోలేదు. అన్నపూర్ణమ్మ ఒప్పుకుంటే శాంతి స్థాపన జరుగుతుంది అంటారు. అందరూ ఆమెను సంప్రదించగా ఆమె సంధికి అంగీకరిస్తుంది. ఆ విషయం



విన్న ఊరి కరణం మర్నాడు శ్రీరెడ్డి ఇంటికి వచ్చి అన్నపూర్ణమ్మతో మాట్లాడతాడు. ఈ సంధి ససేమిరా మంచిది కాదని వాదిస్తాడు. ఇరువర్గాల మధ్య వైరం ఉంటేనే అతడు బతగ్గలడు మరి! తన స్వప్రయోజనాల కోసం పగను ఎగదోస్తుంటాడు. కరణంతోపాటు చెంచురెడ్డి చిన్నకొడుకు గోపిరెడ్డికీ సంధి ఇష్టం ఉండదు. తండ్రి చావుకు ప్రతీకారం తీర్చుకుంటానంటాడు. రాంరెడ్డి తటస్థంగా ఉంటాడు. తల్లినీ, అన్ననూ వ్యతిరేకిస్తాడు. గోపిరెడ్డి ఇరుకుటుంబాల సఖ్యత కోసం గురివిరెడ్డి కూతురు పార్వతిని శ్రీరెడ్డికి చేసుకోవాలని గురివిరెడ్డి, అన్నపూర్ణమ్మ నిర్ణయిస్తారు. శాంతి, సఖ్యతల కోసం, పగలు, ప్రతీకారాలను రూపుమాపడం కోసం శ్రీరెడ్డి అంగీకరిస్తాడు. కానీ గోపిరెడ్డి వ్యతిరేకిస్తాడు. అయినా శ్రీరెడ్డి, పార్వతుల పెళ్ళి జరిగిపోతుంది.

గోపిరెడ్డిని కరణం, ఇంకా మరికొందరు పురికొల్పుతుండటంతో తండ్రిని చంపిన హంతకుడు గురివిరెడ్డిపై, అతని అనుచరులపై ప్రతీకారం తీర్చుకోవడానికి కుట్ర పన్నుతుంటాడు. పంచాయతీ ఎన్నికలు వస్తాయి. గోపిరెడ్డి తరఫున రాంరెడ్డి ఒక వార్డుకు పోటీ చేసి గెలుస్తాడు. మిగిలిన ఆరుసీట్లు గురివిరెడ్డి వర్గం వారు గెలుస్తారు. గోపిరెడ్డి, రాంరెడ్డి ఇద్దరూ శ్రీరెడ్డితో మాట్లాడటం తగ్గిస్తారు. తనకిష్టం లేకున్నా సంధి చేసుకున్నారన్న కోపంతో గోపిరెడ్డి ఆస్తిలో తన వాటా పంచుకుంటాడు. రాంరెడ్డి కూడా తన వాటా తీసుకుని వేరుగా ఉంటాడు.

ఓ రోజు పార్వతి తల్లిదండ్రుల దగ్గరికొచ్చి "మీ అల్లుని ప్రవర్తన మారుతోంది. పంచాయతి ఎన్నికల వరకు మీతో కలిసి తిరిగాడు. నేడు మీరంటే కోపంతో మండిపడుతున్నాడు. తమ్ములవైపు మొగ్గుతున్నాడు. తిరిగి మరోమారు కలబడితే నా గతేమిటి? " అంటుంది. 'మీ అత్త సంగతి' అడుగుతాడు గురివిరెడ్డి.

"సఖ్యతగా ఉండాలనే నా భర్త పోయిన రెండు రోజులకే రాజీకి ప్రయత్నించాను. ఆ రోజే నా గోపి నాకు కాకుండా దూరమయ్యాడు. వాడు లేకుండా బతకలేను అంటోంది. ఆమెకు గోపిపై విపరీతమైన ప్రేమ. దిగులుతో సగం చిక్కింది" అంటుంది పార్వతి. అంతే కాదు. "మీరందరూ కలిసి మా గొంతులు నులుముతున్నారు. ఆనాడు మీ చెల్లెలు, ఈనాడు మీ కూతురు, అటు అత్తవారింటికీ, ఇటూ పుట్టింటికీ చెందక మేం కుమిలిపోతున్నాం నాన్నా! ఎవరు చచ్చినా ఏడవాల్సింది మేమే!" అని ఇంటికి వెనుతిరుగుతుంది.

గురివిరెడ్డి వర్గం గోపిరెడ్డిని చంపడానికి రంగం సిద్ధం చేస్తుంది. కోర్టుకు హాజరై తిరిగి వస్తున్న గోపిపై హఠాత్తుగా యాభై మంది దాడిచేసి చంపేస్తారు. గోపిరెడ్డిని చంపితే రామిరెడ్డి నిలువలేడు. శ్రీరెడ్డికి గోపిరెడ్డికున్నంత కక్ష గురివిరెడ్డి మీద ఉండదు. ఇక తమదే రాజ్యం అన్న అభిప్రాయం గురివిరెడ్డి వర్గానిది. గోపిరెడ్డిని చంపారన్న వార్త గుప్పుమంటుంది. ఊరంతా కంటతడి పెడుతుంది. వార్త విన్న మరుక్షణం అన్నపూర్ణమ్మ కుప్పకూలి ప్రాణాలు వదిలేస్తుంది. గోపిరెడ్డి శవాన్ని ఇంటికి తెస్తారు. తమ్ముడు సురేంద్రరెడ్డి వస్తాడు. అన్నదమ్ములు ఒకరినొకరు కౌగలించుకుని ఏడుస్తారు. మర్నాడు శవయాత్ర సాగుతుంది. గోపిరెడ్డి భౌతిక కాయం నశించినా ఒక సంవత్సరకాలం ఆ గ్రామంలో అతడు వెలిగించిన వెలుగు, చూపిన పటుత్వాన్ని ప్రజలు మరవలేదు.

గురివిరెడ్డితో కలిసి గ్రామం బాగుచేద్దామనుకుని ప్రయత్నించాడు శ్రీరెడ్డి. అది సాధ్యం కాలేదు. గోపిలాగే తనను కూడా చంపేస్తారని తెలుసుకోగల్గిన శ్రీరెడ్డి గురివి



రెడ్డిని చంపడం ఒక్కటే మార్గంగా భావిస్తాడు.

జాతర సందర్భంగా గ్రామం హడావిడిగా ఉన్న సమయంలో గురివిరెడ్డి పడుకునే ఇంటికి చేరతారు శ్రీరెడ్డి, రాంరెడ్డి, వాళ్ళ అనుచరులు. ఇంటి చుట్టూ డైనమైట్లు పేరుస్తారు. మొత్తం పది డైనమైట్లు, అందరూ తూటాలు నింపిన పిస్తోళ్ళు పట్టుకుంటారు. శ్రీరెడ్డిని, రాంరెడ్డినీ ఇళ్ళకు పొమ్మని తాము చేయవలసింది చేసేస్తారు. శ్రీరెడ్డి, రాంరెడ్డి ఇళ్ళకు చేరుకున్న కాస్సేపటికే ఆకాశం దద్దరిల్లుతుంది. ఢాం ఢాం అని శబ్దాలు వెలువడతాయి. కేకలు, అరుపులు వినిపిస్తాయి. తన మామను తానే చంపానని ఆలోచిస్తూ బాధపడతాడు శ్రీరెడ్డి. తమ్ముడు గోపిరెడ్డి చనిపోవటం ఇప్పుడు జ్ఞాపకానికి రాదు. పశ్చాత్తాపం పుడుతుంది.

కేసు నమోదై రాంరెడ్డిని ప్రథమ ముద్దాయిగా ఇరికిస్తారు. అతడిని విడిపించడానికి శ్రీరెడ్డి తిరుగుతుంటాడు. శ్రీరెడ్డి, పార్వతులకు కొడుకు పుడతాడు. ఇరువర్గాలను రాజీ చేయాలని పోలీసులు విఫలయత్నం చేసినా సాధ్యం కాదు.

ఇప్పుడు శ్రీరెడ్డిని చంపటమే గురివిరెడ్డి వర్గం వారి లక్ష్యం. అదను చూసుకుని శ్రీరెడ్డిని చంపేస్తారు. శ్రీరెడ్డి తమ్ముడు సురేంద్రరెడ్డి అన్నకు అంత్యక్రియలు జరుపుతాడు. అన్నల చావు, భర్త చావు విని పార్వతి గుండె ఆగి చనిపోతుంది. నీలమ్మ స్పృహ తప్పుతుంది.

పోలీస్ సూపరిండెంట్ సురేంద్రరెడ్డిని కలిసి రాజీ చేస్తాడు. "శ్రీరెడ్డి వర్గంలో బతికి ఉన్నవారు సురేంద్రరెడ్డి, శ్రీరెడ్డి, పార్వతుల ఏకైక కొడుకు. గురివిరెడ్డి వర్గంలో మిగిలినవారు నీలమ్మ, పార్వతి చెల్లెలు నాగమణి, బలరాంరెడ్డి కొడుకు. నాగమణికి ఈ పసివాడు అక్క కొడుకైతే, సురేంద్రరెడ్డికి అన్న కొడుకు. బలరాంరెడ్డి కుమారుడు కూడా పసివాడు కనుక సురేంద్రరెడ్డికి, నాగమణికి పెళ్లి జరిపిస్తే పసివాళ్ళిద్దరూ క్షేమంగా ఉంటారు. నీలమ్మ, నాగమణిలకు రక్షణ ఉంటుంది. రెండు వంశాలవారూ ఒక్కచోట పెరిగితే వారికి కక్షలు, ద్వేషాలు ఉండవు" అంటాడు.

సురేంద్రరెడ్డి అంగీకరిస్తాడు. నీలమ్మ ఒప్పుకుంటుంది. కొద్దిరోజులకే సురేంద్రరెడ్డి, నాగమణిల పెళ్లి జరుగుతుంది. రెండు కుటుంబాల ఆస్తులు సురేంద్రరెడ్డి ఆజమాయిషీలోకే వస్తాయి. ఇద్దరు పిల్లల బాధ్యత అతడే వహిస్తాడు. ఆ గ్రామంలో మిగిలినవారు ఎవరంతకు వారు సర్దుకుంటారు. దౌర్జన్యాలు, పోట్లాటలు సమసిపోవటంతో నవల ముగుస్తుంది. ✦




**చతుర సమీక్ష** | మార్చి 'చతుర' నవల సరస్వతీ నమస్తుభ్యం

సమీక్షకుని/సమీక్షకురాలి పేరు: ______________________

చిరునామా: ______________________

______________________

______________________

## జనవరి 2007 చతుర నవల

# ఊరికి ఉప్పులం

## పై సమీక్షలు






## రసస్ఫోరకం

(మొదటి బహుమతి రూ 100/- పొందిన సమీక్ష)

ఉత్తర తెలంగాణ ప్రాంతంలోని అనేక పల్లెల వ్యథార్త జీవిత యథార్థ దృశ్యాలకి సజీవ ప్రతిబింబం 'ఊరికి ఉప్పులం' నవల. వరస కరువు కాటకాలు, ఊసరవెల్లి రాజకీయాలు, స్వార్థపరత్వం- వీటి మధ్య సామాన్య ప్రజల జీవిత బీభత్సాన్ని కాదేది కథకనర్హం అన్నరీతిలో రచయిత ఆద్యంతం సందర్భోచితంగా ప్రదర్శించారు. ఏ విషయంపైనా వ్యాఖ్యానించకుండా, పాత్రల నోటనే పలికిస్తూ కాలపరిమితితో కథను కొనసాగించటం విశేషం.

ఆశా నిరాశల నడుమ వ్యక్తుల చిత్తవృత్తుల అలజడులు, స్వార్థం ప్రకోపించి అవతలివారిని అణగద్రొక్కే ప్రవృత్తులు, కేబుల్ టీవి, సెల్ ఫోన్‌లు పల్లెల్లో సరికొత్తగా తెచ్చిన సమస్యలు, యువత వికృత పోకడలు, ప్రభుత్వ పాఠశాలల్లో చదువులు, మధ్యాహ్న భోజన పథకం, స్థానిక రాజకీయాలు, ఉపాధ్యాయుల తీరు, డ్వాక్రా సంఘాల నిర్వహణ వంటి ప్రతి అంశాన్ని ఉన్నదున్నట్లు చూపాడు. ఊహ కంటె వాస్తవికత భయానకంగా ఉంటుందనే విధంగా డాక్యుమెంటేషన్ వర్ణన పద్ధతి రచనకి నిండుదనాన్ని తెచ్చింది.

గ్లోబలైజేషన్ క్రమంలో గత దశాబ్దంగా పల్లెల్లో వచ్చిన మార్పులు, వర్షాభావ పరిస్థితులు, ఉపాధి కోసం గల్ఫ్ దేశాలకి వెళ్లిన వారి కుటుంబాల కడగండ్లు, అప్పుల బారిన పడిన రైతాంగం, ఇంగ్లీష్ చదువుల మోజు, రాజకీయాలు- లంచాలు పల్లెలకు పాకడం, వెరసి ప్రశాంతమైన పల్లెలోగిళ్లు కక్షలకు, కుటిలత్వాలకు నిలయాలుగా మారిన వైనం పాఠకుణ్ణి ఆలోచింపజేస్తాయి. సాయిలు లాంటి వ్యక్తులు జరగబోయే పర్యవసానాలను పసిగట్టినా ఏమీ చేయలేని నిర్వేదం, పరిస్థితుల ప్రాబల్యాన్ని, ప్రతిబంధకాలను రచయిత చక్కగా మలచాడు.

వస్తువు, శిల్పం, భాష రీత్యానూ నవలని ఉన్నత శ్రేణికి చెందిందిగా చెప్పవచ్చు. ఇతివృత్తం, భాషల పరస్పర సంబంధం బలంగా పోషించబడినందున, సజీవమైన వాస్తవికత రసస్ఫోరకంగా ఆవిష్కృతమైంది. ముగింపులోనూ రచయిత సమస్యల్ని ప్రస్తావించి సజీవంగా వదలివేశారు.

**-డా॥ కొల్లు వెంకటేశ్వరరావు,**
అన్నవర గూడెం.

## మరో పార్శ్వం (రెండవ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)

పచ్చని ప్రకృతికి పల్లెటూళ్ళు ఆనవాళ్ళు మాత్రమే కాదు, కుత్సిత రాజకీయ క్రీడలకు నిలయాలు కూడా అని జనవరి చతుర నవల 'ఊరికి ఉప్పులం' నిరూపించింది. ప్రస్తుత గ్రామీణ రాజకీయాలకు అక్షరాలా అద్దం పట్టిందీ నవల. ఇందులో 'సాయిలు' పాత్రను మినహాయిస్తే ప్రతి పాత్రా అవినీతి తానులో





ముక్కలే. అవకాశవాద రాజకీయ కలుపుమొక్కలే. ఇంతమంది అవకాశవాద నాయకుల మధ్య ఒక్క ఆదర్శ నాయకుడినైనా ఆశాకిరణంలా రచయిత మా ముందు నిలిపితే మా బాధాతప్త హృదయాలకు సాంత్వన చేకూరేది.

దేనికీ ప్రలోభపడని ఎమ్మార్వో నాగేందర్ రెడ్డి సైతం కులానికి లొంగిపోవడం చూస్తే అవినీతి కార్చిచ్చుకు కులం ఆజ్యం పోస్తుందనే విషయం స్పష్టమౌతుంది. పదవిని అడ్డం పెట్టుకొని తమ పబ్బం గడుపుకొనే చీడపురుగుల్లాంటి నాయకులున్నంతకాలం 'దేశమనియెడి దొడ్డ వృక్షం' కుక్కమూతి పిందెల్ని తప్ప అభివృద్ధి ఫలాలను జాతికి అందించలేదు.

అధికార వికేంద్రీకరణ ద్వారా స్థానిక సంస్థలకు మరిన్ని అధికారాలను బదలాయించి వాటిని మరింత బలోపేతం చేయాలని వాంఛిస్తున్న వారిని అభివృద్ధికి మరో పార్శ్వమైన అవినీతి గురించి ఆలోచించమంటోందీ నవల. పూర్తిగా తెలంగాణా మాండలికంలో సాగిన ఈ రచన వర్తమాన గ్రామీణ రాజకీయ వ్యవస్థలోని లొసుగులను ఎత్తిచూపింది.

**– ఎన్.మధుసూదన్ యాదవ్,** నరసరావుపేట.

## ముందే తెలిసినా... *(మూడవ బహుమతి రూ. 50/– పొందిన సమీక్ష)*

స్వార్థపరులైన రాజకీయ నాయకుల పుణ్యమాని పట్నాలే కాదు పల్లెలూ భ్రష్టు పట్టి పోయాయి. సత్ప్రవర్తనతో మసిలే వాళ్ళకి రాజకీయరంగం ఎన్నదగిందే. కాని సంపాదనే ధ్యేయంగా అందులో అడుగు పెట్టేవాళ్ళు ఆ రంగానికున్న విలువలకు కళంకం తెస్తున్నారు. ఎక్కడ ఏ మోసం జరిగినా 'అదంతా రాజకీయం' అంటూ ఆ రంగంపై ఉన్న నమ్మకాన్ని దిగజార్చారు. నా ఊరు, నా దేశం అనుకునే నిష్కళంక వ్యక్తిత్వమున్న యువశక్తి పూనుకోవాలి. మిలిటరీ పద్ధతిలో రాజకీయరంగం కొనసాగితే తప్ప అవినీతి అంతం కాదు. ముందు తమ ఊరును చక్కదిద్దుకుంటే తప్ప మిగిలిన రంగాల్లో రాణించలేరు. పరిపాలనా వ్యవస్థలో అభివృద్ధి సాధించలేరు.

ప్రజల్లో దేశభక్తి పునరుజ్జీవితం కావాలి. ఆనాడు ఆంగ్లేయులను నిలదీసినట్టు అవినీతి రాజకీయ నాయకుల్ని ప్రజల్లో నిలబెట్టి వారి బండారం బయటపెట్టాలి. ఇప్పుడిప్పుడే సమాజంలో అడుగుపెడ్తున్న మాలమాదిగలను విడదీసి తమ స్వార్థానికి వినియోగించుకోవాలని చూశారు కొందరు. అనుభవం లేని అమాయకులు వారి మాటలకు చెవొగ్గి ఉప్పు, నిప్పులా ఉన్నా, చివరికి రాజీకొచ్చి ఐకమత్యమే బలమని తెల్సుకున్నారు. ఒకర్నొకరు రాసుకు పూసుకు తిరిగిన పెద్దలు ధనాశ కారణంగా కష్టాలు కొనితెచ్చుకున్నారు. చివరికి ప్రజలముందు ఎందుకూ పనికిరాని వాళ్ళుగా మిగిలిపోయారు.

ఒక్కసారి వచ్చిపడాలన్న యావతో ఎంత ప్రయాసపడ్డా ఏం మిగిలింది చివరికి? కుటుంబం చిన్నాభిన్నమైంది. చదువుకుని వృద్ధిలోకి రావలసిన రాజు, కవిత ప్రేమలో పడి జీవితం నాశనం చేసుకున్నారు. పద్మ అప్పుల పాలయింది. భర్త నక్సలైట్లకు భయపడి పత్తా లేకుండా పారిపోయాడు. ఎగదోసి దిగదోసిన అత్తగారు నంగనాచిలా మంచమెక్కింది. ఎప్పటికైనా వీళ్ళకీగతి పడ్తుందని ముందే తెల్సినా ఆసక్తిగానే చదివించింది నవల. ఇందులోని ఇతివృత్తం సమాజంలో జరుగుతున్న సత్యం అని కచ్చితంగా చెప్పొచ్చు

**– విజయలక్ష్మి,** మిర్యాలగూడ.



## గ్రామ కలుషిత రాజకీయాల కురుక్షేత్రం (నాలుగవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

పరిఢవిల్లాల్సిన ప్రజాస్వామ్యం గ్రామీణ వ్యవస్థకు పట్టుకొమ్మగా, ప్రగతి బాటగా కాకుండా, చిరిగిన వస్త్రంలాగా, సిగపట్ల రాజకీయం చితికి చితికి కురుక్షేత్రంలాగా ఎలా మారుతుందో, ప్రగతికి ఎలా విఘాతం కలుగుతుందో ఈ నవలలో రచయిత చక్కగా దృశ్యీకరించారు.

భ్రష్టుపట్టిస్తున్న రాజకీయాలకు సర్పంచ్, ఎంపిటీసీ, విద్యాకమిటీ ఛైర్మన్, డీలర్ ఎలా పాలుపడుతున్నారో ఈ నవల చక్కగా చిత్రీకరించింది. ఓట్ల, నోట్ల రాజకీయాలు కలగలిసి, గ్రామ చిత్రాన్ని ఎలా దిగజార్చుతున్నాయో ఈ నవల వివరించింది. ప్రపంచీకరణ ప్రభావాలు, గల్ఫ్ దేశాల వలసలు, ఆంగ్లంలో చదువులు, మహిళా స్వశక్తి గ్రూపుల్లోని రాజకీయాలకు చిత్రిక పట్టింది. పద్మ, శోభ, నారాయణ, కుంటిపోశాలు, దేవేందర్‌రెడ్డి, వెంకటాద్రి, సాయిలు, రాజు, కవిత, హెచ్‌ఎం, తొంట ఎల్లయ్య వంటివారు గ్రామ రాజకీయాలను స్వార్థ ప్రయోజనాలకు ఎలా తెలియజెప్పింది. జడ్పీటిసి, ఎమ్మెల్యేలు సైతం గ్రామరాజకీయాలను ఎలా పావుగా వాడుకుంటున్నారో 'విభజించు-పాలించు' అన్న నాటి బ్రిటిషర్ల కుటిలనీతి ఎలా అమలు అవుతుందో వివరించింది.

నీతినిజాయితీలు కులం ముందు ఎలా మెత్తబడతాయో ఎం.ఆర్.ఓ పాత్ర ద్వారా విశదీకరించిందీ నవల. అడుగంటిపోతున్న ప్రగతి, కలుషితమవుతున్న గ్రామీణ రాజకీయాల నేపథ్యానికి తగిన కారణాలను సైతం కొంత పరిశోధించి రచయిత వివరిస్తే బాగుండేది. ఈ నవలలో శైలి, భాష, కథనం వేటికవే పోటీబడ్డాయి.

*-సంకేపల్లి నాగేంద్రశర్మ, కరీంనగర్.*

## పాపం సాయిలన్న (ఐదవ బహుమతి రూ. 50/- పొందిన సమీక్ష)

సాయిలు బతుకు మీద వాలిన కాలమనే కాకి, బర్రెదూడను చంపి, చావుదెబ్బ కొట్టింది. ఫలితం బర్రె పాలివ్వకపోవడం, బర్రెను కొన్న లోను వాయిదా చెల్లించలేకపోవటం, దానికితోడు, తాను నెత్తినోరు మొత్తుకున్నా తన బిడ్డలు ఊరి రాజకీయల్లో దిగటం అతనికి చెంపపెట్టు.

పద్మవ్యూహ లాంటి కుళ్ళ రాజకీయాలలోకి దిగటం సాయిలు వంటి బక్కరైతు కుటుంబానికి కూడు బెట్టేనా, గుడ్డ బెట్టేనా! సాయిలు బతుకును, కాలమనే కాకి, బిడ్డలనే కాకి పిల్లలు, కుక్కలు చించిన విస్తరిలాగ చేశాయి. అతడిలాంటి బక్కరైతులు ఎందరో? వీరి బతుకుతెరువులు ఎలా నాశనమయ్యాయో, నాశనమవుతున్నాయో కండ్లకు కట్టినట్లు తెలియజేసింది 'ఊరికి ఉప్పులం' నవల.

ఇందులోని ఇతివృత్తం ఒక్క ఊరికే సంబంధించింది అయినా, ప్రతి పల్లెటూరులోను ఇంచుమించు ఇదే పరిస్థితి. ఒకనాటి పల్లె జీవనం కడుపులోని చల్ల కదలనటువంటిది. ఆ పల్లెల బతుకు మనిషి మనసుకు శాంతి సౌఖ్యాలు కలిగించేది. కాని ఈనాటి పల్లె బతుకులు, కుళ్ళు రాజకీయాలతో, ముఠా తగాదాలతో ముందువైపుకు వంగి నమస్కారాలు, వెనుకవైపు గోతులు తవ్వే కుటిల మనస్తత్వాలతో భయానకంగా తయారయ్యాయి. ఈ పచ్చినిజాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించిందీ నవల...

ఈ నవల చదివిన తరువాత మనస్సుకు శాంతి, నిర్మల జీవితం గడపటానికి పల్లెటూళ్లకు వెళ్లదలచిన మనిషి ఒకటికి రెండుసార్లు ఆలోచించాల్సిందే.

*-బి. గంగానాథ్, మౌలాలి*





# FORM IV (See Rule 8)

Statement about ownership and other particulars of CHATURA.

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 4. Publisher's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 5. Editor's Name | : | **RAMOJI RAO** |
| Whether citizen of India | : | Yes |
| If foreigner, state the country of origin | : | - |
| Address | : | 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |
| 6. Name and address of individuals who own the newspaper and partners or shareholders holding more than one percent of the total capital. | : | **RAMOJI RAO**<br>**VASUNDHARA PUBLICATIONS**<br>6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082. |

I, RAMOJI RAO, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**for VASUNDHARA PUBLICATIONS**
**Sd/- RAMOJI RAO**
Publisher

Date: March 1, 2006

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 23730328, Office Address: CHATURA, Telugu Monthly, 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: 23318181, 23398787; Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 2223216; Rajahmundry: 2468991; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 240101; Kurnool: 252813; Cuddapah: 270011; Tadepalligudem: 228881; Warangal: 2559901; Khammam: 255661; Nizamabad: 245661; Mahabubnagar: 276376; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982818; Chennai: 28232390; Bangalore: 25583804; & www.eenadu.net.

